ఏప్రిల్
10
విడుదల



వాహినీవారి

# యోగి
# వేమన

నాగయ్య, లింగమూర్తి, రామిరెడ్డి,
రాజమ్మ, పార్వతీబాయి, కాంతామణి
నటించినవి

డైరెక్టరు – కే. వి. రెడ్డి, B.Sc(Hons)

STUDIO–NEWTONE




Brooke
Bond
Tea



# ఏప్రిల్, 1947

# Making West End Watches *for you*



## మీ కోసం
## వెస్టు ఎండ్ వాచీలు
### తయారు చేయుట

**బాలెన్సువీలు:** గడియారమునందలి వేరువేరుభాగముల మూమెంటుపై సరియైన టైం చూపడం ఆధారపడి వుంటుంది. అట్టి ముఖ్యభాగములలో బాలెన్సువీల్ ముఖ్యమైనది. ఇందులో చూపబడిన పెద్ద బొమ్మ వంక చూడుడు. దీనిని తయారుచేయుటకు - బిగించుటకు - సరిచేయుటకు గొప్ప పనితనము కావలసియున్నదని మీకు వెంటనే తెలియగలదు



న్యూ కాలిబర్ "ఇ"
నికెల్ సిల్వర్, పేటెంట్
ఎవర్‌బ్రైట్ స్టీల్ బ్యాక్‌తో
రూ 79/-

**వెస్టు ఎండ్ వాచ్ కంపెనీ**
బొంబాయి - కలకత్తా.

మెయిన్ స్ప్రింగునుండి వెలువడిన శక్తిని సంపాదించి బాలెన్సు వీలు దానిని కాలపరమాణువులుగమార్చును తక్కిన యితర భాగములకు పలెనే, వెస్టుఎండ్ గడియారములోని బాలెన్సు వీలు గూడ మిక్కిలి ఖచ్చితముగా పనిచేయును. లాభదాయకమగు "వెస్టు ఎండ్" గడియారమును కొనుడు.

రవాణాలు తక్కువైనందున ప్రవటింపబడినరకాలన్నియు సరఫరాకావు కాని యున్నంతవరకు సరఫరాచేయుటకు శక్తివంచలేనకుండ ప్రతిప్రయత్నము చేయబడును.



# WEST END WATCH CO.
BOMBAY CALCUTTA



భారతి. ఏప్రెల్ '47

దీర్ఘాలోచన
చిత్రకారుడు: శ్రీ వేలూరి రాధాకృష్ణ



సంపుటము 24
సంచిక 4

# భారతి

ఏప్రెల్ 1947
[illegible]త్రము

## ఉగాది తలపోత*

సిరులున్ సంపదలున్ సమస్తసుఖముల్ సిద్ధింప నాశాస్యముల్
పరిపూర్ణస్థితి నంద శోభనతతుల్ ప్రాప్తింపఁగా సర్వజి
ద్వరవర్షంబున దైవసత్కృప ననంతంబైన సంతోషసం
భరితాత్మస్థితి మీకుఁ గల్గుత మపూర్వం బీయుగాదిస్మృతిన్.

* రచయిత : బులుసు వెంకటేశ్వర్లుగారు.

# 'స్వాగతము'

= శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి =

నామనోవేదిపై నాట్యమాడిన దేవి
నవ్యశోభల నెవరు అనుకరించగలేరు !

ఆ మహోదయవేళ నానంద మొలికించ
నింబతరుతల్పమున నే జూడ నాజాడ
ఎగిరి గంతును వైచి ఈక్షించినది నన్ను !

ఆ శిల్పసౌందర్య మవతరించగ నపుడు
నాహృదయలగ్నమై నాటె ప్రేమాంకురము,

ఏభావ ముబికెనో ఎదలోన నాక్షణము ?
ఆ నేత్రకాంతిలో ఆ నీలవేణిలో
జననాంతరాగతము సౌహృదము దాగెనా ?

ఎవ్వ డాదర్శనము తేలగలవో నన్ను ?
భావస్థిరము హృదయభాసురం బాయెనా ?

ఏ లోకమార్గాల నీసడించుచు నేడు
భువిలోన జన్మించి పూజాప్రసూనముల
నాదరించగ కలిసినారమొ ప్రేయసీ ?

స్వప్నకన్యకరీతి చరియించినావుగా !
ఆత్మరాగము పరాగాశ్రితము ప్రేయసీ !
అమలరాగహృదయహారతుల నర్పింప
నరుగుదెంచిన దివ్యహాసశ్రీకవదనము
నీపవిత్రప్రేమ నీరీతి చూపగా,

మాధురీలతల నిర్మలసౌఖ్యమే లేని
బ్రతుకులో నేరీతి వర్తింతుమో సఖీ !

అర్ధనారీశ్వరుని అనురాగమాలనే
ఆదర్శముగ నెంచి ఆనందనిష్యంద
నాస్వాదనము నంద నరుగుదె మ్మోసఖీ !
అరుగుదెమ్ము !

# శిష్టప్రయోగము

= శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి =

మన పూర్వులకు అపశబ్దమంటే మహాభయం. 'మ్లేచ్ఛోవా ఏష యదపశబ్దః, మ్లేచ్ఛా మాభూమ ఇత్యధ్యేయం వ్యాకరణమ్' అన్నాడు పతంజలి. (మ్లేచ్ఛః అంటే అపశబ్దమే. మ్లేచ్ఛులు కాకుండా ఉండేటందుకే వ్యాకరణం చదవాలి.) ఎన్ని కట్టుబాట్లు చేసినా కొన్ని అపశబ్దాలు దొర్లినై. పైగా అవి పెద్దవాళ్ళకే వచ్చినై. ఇక తప్పనిసరిగా 'శిష్టప్రయోగం అంగీకర్తవ్యం' అని చెప్పవలసివచ్చింది. 'పృషోదరాదీని యథోపదిష్టమ్' అని సూత్రం వ్రాసుకున్నాడు పాణిని. 'పృషోదరమ్' మొదలైన శబ్దాలు ఎలాగు ఉపదేశింపబడినవో ఆలాగు సాధువులు. ఎవరిచేత ఉపదేశింపబడినవి అంటే 'శిష్టులచేత' అని పతంజలి సమాధానం చెప్పుకున్నాడు. ఈ శిష్టులు పలికిన అపశబ్దంవంటిదే ఇంకొకటి నేను పలుకుతాను అని అనటానికి వీలులేదు. ఉపదేశించినది అంటే ప్రత్యక్షంగా పలికినదే. ఆవుసంగతి తెలియనివాడికి, ఒక ఆవును చెవిపట్టుకొని తీసికొ వచ్చి 'ఇది ఆవు' అని చెప్పటం ఉపదేశం. ఉద్దేశం వేఱు. గుణాలు వర్ణించి చెప్పటం ఉద్దేశం. ఇక్కడ ఉండి, ఎక్కడో పాటలీపుత్రంలో ఉన్న దేవదత్తుడిని ఇంకొకడికి తెలిసేలాగున 'అంగదీ, కుండలీ, వ్యూఢోరస్కః, వృత్తబాహుః, లోహితాక్షః, తుంగనాసః, విచిత్రాభరణః' అని వర్ణిస్తే ఈ పగటివేషంవాడిలక్షణాలతో దేవదత్తుడు ఉద్దిష్టుడౌతాడు. ఇక్కడ మనకు శిష్టులచేత ఉపదిష్టమైనదే, ప్రత్యక్షముగా పలుకబడిందే గ్రాహ్యం.

ఈ శిష్టులు ఎవరు? వైయాకరణులా? శిష్టులే వైయాకరణులైతే శిష్టప్రయోగమంతా వ్యాకరణవిహితమైనదిగానే ఉండేది. శిష్టప్రయోగం అని వేఱుగా చెప్పవలసిన పని ఉండేదే కాదు. ఈ శిష్టులకు 'వైయాకరణీకం' చెయ్యటం చేతగాక వ్యాకరణవిరుద్ధంగా ప్రయోగించారు. వారు శిష్టులు కాబట్టి ఆప్రయోగాన్నే లోకంలో అందరూ శిరసావహించారు.

'గూఢాత్మా' అనటానికి 'గూఢోత్మా' అన్నాడు ఒక శిష్టుడు. 'పృషదుదర' అనవలసినది 'పృషోదరమ్' (లేడి) అని ఇంకొకరు. 'వారివాహకమ్' అని పూర్తిగా సరిగా అనలేక 'వలాహకమ్' (మేఘం) అని ఒకరు. దక్షిణతీరమ్, ఉత్తరతీరమ్ అని కొంతమంది శిష్టులు అన్నారు. అది చేతకాక 'దక్షిణతారమ్' 'ఉత్తరతారమ్' అని అన్నవాళ్లు ఉన్నారు. 'దుర్నాశమ్' అనటానికి 'దూణాశమ్' అన్నాడు మఱియొక ఆయన. 'దుఃఖంతో ఇవ్వబడుతున్నది' అన్నప్పుడు 'దుర్దాశమ్' అనవలసినది 'దూడాశమ్' అని ఒక శిష్టుడు దూడవేశాడు!*

ఈ రూపాలు ఏ వ్యాకరణంచేతా సాధువులు కావు. వ్యాకరణం రాకనే ఇలాగు ఈ శిష్టులు అన్నారు. శిష్టుడి మొదటిలక్షణం వ్యాకరణం చదవక పోవటం. అయితే చదువుకొననివాళ్లను అందరినీ శిష్టులనరు. ఇంకా కొన్ని లక్షణాలు ఉన్నై. నివాసంచేత, ఆచారంచేతా శిష్టపద వ్యవహారాన్ని కొంత మంది పొందుతారు.

నివాసం ఆర్యావర్తంలో ఉండాలి. ఆర్యావర్తం పరిహద్దులు పతంజలి ఈ విధంగా నిర్ణయిం

* దూడేశాడు అని తెలుగులో ఉన్న అశిష్టప్రయోగం 'దూడాశం' అన్న శిష్టప్రయోగానుకరణం కాదుగదా!

చాడు.* హిమవత్పారియాత్రములకు, ఆదర్శకాలక వనములకు మధ్యన ఉన్న దేశం ఆర్యావర్తం అన్నాడు. వశిష్ఠధర్మసూత్రాలలోకూడా ఇలాగే ఆర్యావర్తం నిర్ణయించారు.† శంఖస్మృతిలో హిమవత్పారియాత్రములకు, సింధు, సౌవీర, కాంపిల్యములకు మధ్యన ఉన్న దేశం ఆర్యావర్తం అని ఉన్నది. పూర్వపశ్చిమసముద్రములకు, వింధ్యహిమాచలములకు మధ్య నున్న దేశం ఆర్యావర్తము అని మనువు. ఇదిగాక వింధ్యహిమాచలములకు వినశన‡ ప్రయాగములకు మధ్యన ఉన్న దేశము ఒకటి 'మధ్యదేశము' అని గూడా మనువు నిర్ణయించాడు. పతంజలి చెప్పిన ఆర్యావర్తము, మనువు చెప్పిన మధ్యదేశము ఒకటే అని కొందరు పెద్దలు. భూమికి జఘన స్థానీయమైన దేశము మధ్యదేశము అని వ్యాఖ్యాతలు చెప్పినారు.

ఈ ఆర్యావర్తమనేది నిలకడగా ఒక చోటున ఉన్నట్టు లేదు. రైతుమోతుబరితనంకొలది పొలంకాడి గట్టులు పక్కపొలంలోనికి జరుగుతూవచ్చినట్టు ఆర్యావర్తం పరిహద్దులు జరుగుతూవచ్చినై. వేదకాలంలో కురుపాంచాలదేశాలు స్వర్గమే అన్నారు. అవి దాటి తూర్పుదేశానికి పోగూడదు అన్నారు. తరువాత ఈ తూర్పుదేశాలు (గంగాయమునా తీరాలు) పుణ్యభూములు అయినై. ఇవి దాటి సింధు, సౌవీర, అంగ, వంగ, కళింగ, ఆంధ్రదేశాలు వెళ్ళినట్లయితే మళ్లీ ఉపనయనసంస్కారము చేసుకోవాలి అని దేవల, బౌధాయన ధర్మసూత్రాలలో ఉన్నది. కొంతకాలానికి ఇవన్నీ కూడా పుణ్యభూములు అవుటయేగాక, పూర్వము పుణ్యభూములు అనుకున్నవి నిల్లక్రింపులు అయినై.

'పంచానాం సింధుషష్ఠానాం
నదీనాం యేఽంతరాశ్రితాః
తాన్ ధర్మబాహ్యాన్ అశుచీన్
బాహీకానపి వర్జయేత్.'

పంచనద, సింధు, బాహీకదేశాలు అశుచి అయినవి, ధర్మబాహ్యములు అయిపోగూడదు అని భారతంలో ఉన్నది. చివరకు దేశమంతా పుణ్యభూమి చేశారు. ఎక్కడెక్కడ కృష్ణసారం (నల్లని చారలు ఉన్న లేడి) ఉన్నదో అది అంతా యజ్ఞియమైన పుణ్యదేశము అని మనువు. చాతుర్వర్ణ్యవ్యవస్థ ఎక్కడ లేదో ఆ దేశం మ్లేచ్ఛదేశమని, ఎక్కడ ఉన్నదో ఆ దేశము అంతా ఆర్యావర్తము అని విష్ణుధర్మసూత్రాలలో ఉన్నది. ఈ విధంగా ఆర్యావర్తం పెరిగి పెద్దదై భారతవర్షమంతా ఆక్రమించుకున్నది. ఈ భారతవర్షమును పూర్వము అజనాభవర్షం అనే పేరుతో వ్యవహరించేవారు.§ భరతుడు రాజ్యానికి వచ్చినతరువాత భరతవర్షం అయినది. ఈ భరతవర్షము ఆసేతుహిమాచలము పుణ్యభూమి అని మార్కండేయవాయు పురాణాలలో ఉన్నది.

ఇక్కడ మనకు కావలసినది పతంజలిమతము కాబట్టి వింధ్యహిమాచలములకు, ఆదర్శకాలకములకు మధ్యన ఉన్న దేశం ఆర్యావర్తం అని చెప్పాలి. 'పృషోదరాదీని యథోపదిష్టమ్' అనే సూత్రంలో ఆర్యావర్తం ఈవిధంగా నిర్ణయించి 'ఏతస్మిన్ ఆర్యావర్తే, ఆర్యనివాసే'—ఈఆర్యావర్తంలో, ఆర్యనివాసంలో అని ఇంకొకమాట అన్నాడు. ఆర్యనివాస మనేది ఇక్కడ చెప్పలేదుగాని 'శూద్రాణా మనిరవసితానామ్' అనే సూత్రంలో చెప్పినాడు. బహిష్కరింపబడని శూద్రసంఘాలకు సమాహారద్వంద్వసమాసం వస్తుంది అని పాణిని సూత్రించాడు. ఎక్కడనుంచి బహిష్కరింపబడనివాళ్ళు అంటే 'ఆర్యావర్తము నుంచి' అని పతంజలి చెప్పి పైన చెప్పిన పరిహద్దు లిచ్చాడు. శకయవనమ్, కిష్కింధగంధికమ్, శౌర్యక్రౌంచకమ్ అనే సమాసాలు రావాలి. ఈ శకులు (Scythians), యవనులు (Ioniens) మొదలైన వారు ఈపరిహద్దులలో లేరు. వీరు శూద్రులలో లెక్క. వీరు బహిష్కరింపబడలేదు. ఇక్కడ సమాసం ఇష్టం

* పారియాత్రము = వింధ్య, ఆదర్శము = కురుక్షేత్రంలో ఒకపర్వతం, కాలకవనం = ప్రయాగ అని నాగోజీభట్టు.

† Kane's History of Dharmasastra.

‡ ఇది సరస్వతీనది నష్టమైనచోటు.

§ మహాభాగవతము. పంచమస్కంధము. 7 అధ్యాయము.

అని ఆక్షేపం వచ్చింది. అయితే ఆర్యనివాసంనుంచి బహిష్కరింపబడినవాళ్లు అని చెప్తాను అని, ఆర్య నివాసము అంటే ఆర్యులు నివసించే గ్రామము, ఘోషము (గోమహిష్యాదినివాసం), నగరము, సంవాహము (వణిక్ప్రధానమైన నగరము) అని పతంజలి చెప్పినమీదట ఎక్కడ ఎక్కడ ఆర్యులు ఉన్నారో అది అంతా ఆర్యనివాసము అయి భారతవర్షమంతా ఆర్యనివాసం అయిపోయింది. ఆర్యావర్తానికి, ఆర్య నివాసానికి తేడా పతంజలి చెప్పినందున, ఆర్యావర్తము అంటే ఆర్యులు పుట్టి పెరిగిన చోటు, ఇక్కడికి ఆర్యులు ఏ ఉత్తరధ్రువంనుంచో రాలేదు. ఈ ఆర్యావర్తం భూమికి అంతకూ మధ్యప్రదేశంకాబట్టి ఇది పుణ్యభూమి అని చెప్పేవారు ఉన్నారు. ఈ ఆర్యావర్తంలో నివాసం శిష్టలక్షణాలలో ఒకటి.

ఇక ఆచారం. "ఏతస్మిన్ ఆర్యావర్తే ఆర్య నివాసే యే బ్రాహ్మణాః కుంభీధాన్యా అలోలుపా అగృహ్యమాణకారణాః కించిదంతరేణ కస్యాశ్చి ద్విద్యాయాః పారంగతాః తత్రభవంతః శిష్టాః" అని పతంజలి. ఈ ఆర్యావర్తంలో, ఆర్యనివాసంలో ఉన్న బ్రాహ్మణుడై ఉండాలి. ఈ బ్రాహ్మణుడు నల్లగా 'మినుముల రాశి' వలె ఉంటే పతంజలి ఒప్పుకోడు. 'శుచిగా, ఆచారవంతుడై, గౌరవర్ణంతో, కపిలకేశములతో, జనపనారవంటి జుట్టు,జొన్నలరాశివలె మనిషి ఉండాలి. కుంభీధాన్యుడై ఉండాలి. కుండలో ఆరురోజులకు సరిపడే ధాన్యం ఉన్నవాడు కుంభీధాన్యుడు. కుండలో ఆరురోజుల శేషను, పాతరలో సంవత్సరగ్రాసము కల శ్రోత్రియుడు శిష్టుడు కాడు. ఆరురోజులకు సరిపడే శేషను ఉన్న బ్రాహ్మణుడు శిష్టుడుఅని ఊరుకుంటే ఇప్పుడు చాలామంది శిష్టులైపోతారు. కాని ఇంకా చాలాఇబ్బంది కలిగించే విశేషణాలు కొన్ని చెప్పినాడు. అలోలుపుడై ఉండాలి. లోభమనేది ఉండకూడదు. 'అగృహ్యమాణ కారణాః'—ఫలమేమీ ఆపేక్షించక సదాచారం అవలంబించాలి. యజ్ఞయాగాదులు చేసేవాళ్లు కోరికతోనే చేస్తారు. 'అప్సరా ఏన ముప శేరతే'—అప్సరసలు సెజ్జన జేరుతారు అని ఆశతో చేస్తారు. ఇటువంటి కాంక్షలు లేకుండా సదాచారం అవలంబించినవాళ్లు శిష్టులు. 'కించిదంతరేణ కస్యాశ్చిద్ విద్యాయాః పారంగతాః' — గురూపదేశము లేకుండా విద్యాపారంగతులైనవాళ్లు శిష్టులు.

బౌధాయనుడు శిష్టులను ఇలాగ వర్ణించాడు: "శిష్టాః ఖలు విగతమత్సరాః, కుంభీధాన్యాః, అలోలుపాః, దంభదర్పమోహక్రోధ వర్జితాః, ధర్మేణాధిగతో యేషాం వేదః సపరిబృంహణః, శిష్టా స్తదనుమానజ్ఞాః శ్రుతిప్రత్యక్షహేతవః"- విగతమత్సరులై, కుంభీధాన్యులై, అలోలుపులై, దంభదర్పమోహక్రోధ వర్జితులై, ధర్మముచేతనే అధిగతమైన వేదము కలవారై, వేదముచేత అనుమితమైనదానిని తెలుసుకొని శ్రుతి ప్రత్యక్షమునకు కారణభూతములైనవారు శిష్టులు. ఆపస్తంబుడుకూడా ఈ విధంగానే శిష్టస్వరూపాన్ని నిరూపించాడు. సప్తర్షులు, మనువు మొదలైన ధర్మస్థాపకులు శిష్టులు అని మాత్స్యవాయుపురాణాలలో ఉన్నది.

శిష్టులు చాలా గొప్పవారేకాని శైష్యోపాధ్యాయికఅంటే ఏమిటో ఎఱుకలేదు కాబట్టి తప్పులు వచ్చినై. ఇలాగ శిష్టులు పలికిన తప్పులే ప్రమాణం అయితే వ్యాకరణం ఎందుకు, 'దర్భపవిత్రపాణియై, ప్రాఙ్ముఖుడై, పాణిన్యాచార్యుడు ఎంతో కష్టపడి' అష్టాధ్యాయి వ్రాయడం ఎందుకు అని ఆక్షేపిస్తే పతంజలి ఈ విధంగా సమాధానం చెప్తాడు. శిష్టపరిజ్ఞాన ఫలమే అష్టాధ్యాయి. అష్టాధ్యాయి చదువుకున్నవాడు ఒకడు అది చదవకుండానే సంస్కృతం మాట్లాడే వాడిని ఇంకొకడిని చూస్తాడు. చదవనివాడు తప్పులు పలుకవలసినది పోయి, అష్టాధ్యాయిచేత సాధ్యమైన శబ్దాలనే ప్రయోగిస్తాడు. అప్పుడు చదువుకున్నవాడు ముక్కుమీద వేలువేసుకొని 'మన మిన్నాళ్లు చదివి గూడా ఇలాగే ఉన్నాము. ఈయన చదవలేదు. అష్టాధ్యాయీవిహితమైన రూపాన్నే ప్రయోగిస్తున్నాడు. ఇది దేవానుగ్రహమో స్వభావమో' అని ఆశ్చర్యపడి, ఆయన అపశబ్దం పలికినపుడు 'ఈయనకు మనకు తెలిసిన సంగతులూ, ప్రయోగాలే కాక ఇంకా కొన్ని తెలుసును. ఇది తప్పు అనకూడదు. శిరసా వహించవలసినదే' అని ఆ వైయాకరణుడు ఒక నిర్ణ

యానికి వచ్చి, శిష్టప్రయోగానికి ఒక విశిష్టత కలుగ జేశాడు.

శిష్టప్రయోగం ఇష్టమైనవాళ్లకు అశిష్టప్రయోగం అనిష్టంగా ఉంటుందిగదా! 'భూవాదయో ధాతవః' అనే సూత్రంలో 'భూ' మొదలైనవి ధాతువులు అని పాణిని చెప్పినపుడు * ఆణవయతి, వంఘయతి, వట్టతి అనే రూపాలు ఈ వ్యాకరణంలోనికి రాకుండా సూత్రం చెప్పాలి అని ఆక్షేపం వచ్చినప్పుడు 'అక్కఱ లేదు. ఇవి శిష్టప్రయోగంలో లేవు' అని పతంజలి ఆక్షేపాన్ని పరిహరించాడు. లోకంలో 'కృషి' అర్థంలో 'కసి' అని, 'దృశి' అర్థంలో 'దిసి' అని వాడుతారు. శిష్టప్రయోగమే ఉపాస్యము కాబట్టి ఇవన్నీ లెక్కలోకి రావు.

మీమాంసకులుకూడా శిష్టప్రయోగానికి ఎక్కువ గౌరవం ఇస్తారు. 'శాస్త్రస్థా' అనే మీమాంసాసూత్రంలో ఎవరు ఈ శాస్త్రస్థులు అని ప్రశ్న వేసికొని 'వీరు శిష్టులు. వీరికి వేదమందు, శాస్త్రమందు అవిచ్ఛిన్నమైన స్మృతి ఉన్నది. శ్రుతిస్మృతుల అర్థనిర్ణయంలో వీరు నిమిత్తం' అని శాబరభాష్యంలో సమాధానం చెప్తున్నారు.

శిష్టప్రయోగమే కాకుండా ఆర్షప్రయోగం కూడా ఒకటి ఒప్పుతూవచ్చారు. రామాయణమహాభారతాదిగ్రంథములలో అపాణినీయాలు కొన్ని ఉన్నై. కొన్నిచోట్ల ఛందోభంగం ఉంటుంది. ఇవేవీ ఎవరూ దిద్దరు. ఆర్షప్రయోగం కాబట్టి వెక్కిరించటానికి వీలు లేదు. ఇక కవులు. వీరు నిరంకుశులు. కాళిదాసు కొన్ని అపాణినీయమైన శబ్దాలు ప్రయోగించాడు. అది వైయాకరణులు పట్టుకొని చూపించారు. కాని అపశబ్దాలు అక్కడక్కడ దొర్లినంతమాత్రాన నిజంగా కవియైనవాడికి ఎప్పుడూ గౌరవం తగ్గలేదు.

ఈవిధంగా భాష అపభ్రంశం చెందకుండా ఉండేటందుకు పూర్వులు అనేకప్రయత్నాలు చేశారు. బుద్ధిబలము అందటికీ ఒకేమాదిరిగా ఉండదు కాబట్టి అపభ్రంశం రానే వచ్చింది. అది ఒక భాషగా తయారు అయింది. ఇప్పుడు ప్రచారంలో ఉన్న దేశభాషలన్నీ అపభ్రంశంనుంచి పుట్టినవే అని వ్యాడి చెప్పినందున అపభ్రంశమనే స్వతంత్రమైన భాష ఏదీ లేదు అని పుణ్యరాజు † అన్నాడు. ఒక్కొక్క శబ్దానికి అనేక అపభ్రంశాలు— గోశబ్దానికి గావీ, గోణీ, గోతా, గోపోతలికా మొదలైనవి ఉన్నై అని పతంజలి. మన పూర్వులందరూ సంస్కృతం ప్రకృతి, తెలుగుగైరాభాషలు వికృతులు అని ఘోషించినప్పటికీ తెల్లవారు ఆసంగతి ఒప్పుకోలేదు (ఒక్క గ్రియర్సన్ గారు తప్ప). రాజకీయాలలో వివిధసంఘాలకు భేదదృష్టిని కల్పించి దానికి దోహదం చేశారు. అలాగే తెల్లవారు భాషావైషమ్యం కల్పించి ఉత్తర, దక్షిణాలని వేఱుచేశారు.

అక్షరసమామ్నాయము సంస్కృతంతో సమానంగా ఉన్న భాషలకు అన్యభాషత్వం కల్పించటం సమంజసంగా కనుపించదు. ద్రవిడుడు అనేవాడు కృష్ణుని కొడుకులలో ఒకడు. ఈయన ఆర్యుడో, ద్రావిడుడో. సరస్వతీ అనే పుణ్యనది ఎప్పుడో ఉండేదిట. అది వినశనం అనేచోట వినష్టమై అంతర్వాహినిగా భారతవర్షంపైనుంచి కిందదాకా ప్రవహిస్తున్నది అని ఒక కథ ఉన్నది. ఆకథ ఏలాగున్నా ఇప్పటికీ సంస్కృతభాషాసరస్వతీనది భారతవర్షంలో అంతర్వాహినిగా ప్రవహిస్తూ దేశభాషాసరస్సులకు జీవనము కల్పిస్తున్నది.

శిష్టులు పైన వర్ణించినట్టుగా ఎప్పుడైనా ఉన్నారా? వారు నిజంగా చదువుతో అక్కఱలేకుండానే అధిగతయాథాతథ్యులు, విదితవేదితవ్యులు, పరావరజ్ఞులు అయినారా?

---

* ఇవి క్రమంగా ఆజ్ఞాపయతి, వర్ధయతే, వర్తతే అనే సంస్కృతరూపాల నుంచి వచ్చిన ప్రాకృతరూపాలు అని P. Chakravarthi Linguistic Speculations of the Hindus.

† శబ్దప్రకృతి రపభ్రంశ ఇతి సంగ్రహకారోక్తేః అపభ్రంశో నామ నస్వతంత్రః కశ్చన విద్యతే.

"ప్రకాశస్వరూపము గుర్తెఱిగి, స్థిరచేతస్కులై ప్రత్యక్షమైన అతీతానాగతజ్ఞానం కలిగి అతీంద్రియములను, అనిర్వాచ్యములను ఆర్ష్యమైన చక్షుస్సుతో గ్రహించినవారు శిష్టులు. వారి వాక్కు అనుమానాది ప్రమాణంచేత నిర్బాధకం అయియుంటుంది" అని వాక్యపదీయకర్త భర్తృహరి నిర్వచించాడు. ఇవన్నీ ఎలాగు జరుగుతై? ఇవన్నీ మనకు ప్రత్యక్షంలో ఉన్న సంగతులు గావు. అనాదినిధనమైన ఈ శబ్దతత్త్వం శిష్టులకు సాక్షాత్కారం అయింది అని భాష్యకైయటాలలో స్పష్టం. శబ్దాత్మకుడైన మహాదేవుడు మరణధర్ములైన మర్త్యులను ఆవేశించాడు; ఆమహాదేవునితో మనకు సామ్యము కలుగుటకు వ్యాకరణం చదవాలి అని ఋగ్వేదానుసారంగా పతంజలి చెప్పినాడు. అఆలను, కఖాలను గురించి చెప్తూ పతంజలి అన్నాడు—'సోఽయ మక్షరసమామ్నాయో వాక్ సమామ్నాయః పుష్పితః ఫలితః చంద్రతారకావత్ ప్రతిమండితో వేదితవ్యో బ్రహ్మరాశిః. అస్య జ్ఞానే సర్వవేదపుణ్యఫలావాప్తిశ్చ భవతి'—పుష్పించి ఫలించి చంద్రతారకలవలె విరాజిల్లుచున్న బ్రహ్మరాశిగా ఈ అక్షరసమామ్నాయమును తెలుసుకోవలెను. అక్షరసమామ్నాయ జ్ఞానములో సర్వవేదపుణ్యఫలము ఉన్నది. చిన్నతనంలో నేర్చుకొని మఱచిపోయిన అఆలను ఇలాగ రోమహర్షణంగా జ్ఞాపకంచేస్తాడు పతంజలి. అఆలు బ్రహ్మరాశి అయినట్టయితే, ఈ శిష్టులకు బ్రహ్మరాశి తెలిసినట్టయితే అక్షరతత్త్వం వారికి తెలియకుండా ఎలాగు ఉంటుంది? వారికే తెలుస్తుంది. మామూలు మనుష్యులు 'తురీయం వాచో మనుష్యా వదంతి' నాలుగవ అవస్థలో ఉన్న వైఖరీ వాక్కునే మాట్లాడుతారు. అది ఒకటే వాళ్లకు తెలుస్తుంది. 'గుహా త్రీణి నిహితా నేంగయంతి'- గుహాశయమై లోపల శబ్దం పడుతున్న మూడు అవస్థలు- పరా, పశ్యంతీ, మధ్యమలు అందఱకూ తెలియవు. 'తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః' ఈ శిష్టులకు ఇవికూడా తెలుసును అని ఋగ్వేదములో ఉన్నది. కాబట్టి వారు చదవకపోయినా విజ్ఞులై ఉంటారు అని సమాధానం చెప్పుకోవచ్చును.

మంత్రశాస్త్రానికీ, వ్యాకరణశాస్త్రానికీ చాలా దగ్గరసంబంధం ఉన్నదని అది తెలిసినవారు అంటారు. స్వరవ్యంజన అంతస్థోష్మలకు, సుషుప్తిజాగ్రత్ స్వప్నతురీయావస్థలకు సంబంధం ఉన్నదంటారు. బిందువునుంచి అహంకారం పుట్టిందని, ఈ అహంకారం నుంచి సృష్టి యావత్తూ వచ్చినదని పూర్వుల సంప్రదాయం ఉన్నది. అక్షరసమామ్నాయములో మొదటి అక్షరము అ-మొదలు చివర అక్షరము హ-వరకు బిందువుతో కలిసి అహంకారమైనదని, ఇది శివశక్త్యాత్మకమైనదని, సర్వసృష్టికి బీజభూతమని విజ్ఞులు చెప్తారు. ఇవన్నీ అలౌకికమైన విషయాలు. తెలియనివాళ్లు వ్రాయడం మంచిదిగాదు కాబట్టి, ఈ అక్షరసమామ్నాయము బ్రహ్మరాశి అని పతంజలి చెప్పిన మాట శాస్త్రాంతరంలో కూడా ఉన్నది అని చెప్పి ఊరుకుంటే మంచిది. ఇంతకూ శిష్టుడనేవాడు మచ్చుకి ఒకడైనా కనబడితే అంతా నమ్ముతారు.
వరకూ ఎన్ని చెప్పినా లాభంలేదు.



# స్మృతిపాళి

## = శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి =

స్మృతు లన మార్గశీర్షమున శ్వేతగులాబు లటంచు నెవ్వడో
వెతలె యెఱుంగబోవని కవిప్రవరుం డనినాడు—నిక్కువ
మ్ము తదమృతోక్తి, ఒంటిదనపుం బరువెక్కు ఎడందలో సుధా
భృతసుమ సౌరభాలు గురిపించునెడన్ స్మృతిపాళి తీయగా!

కాని స్మృతుల్ సమస్తమును కా వతిలోక మనోహరమ్ము: చిం
తానికృతంబు కొన్ని, భయదంబగు కొన్ని, మనస్సు నిండుగా
మానని గాయముల్ సలిపి మారణవేదన నింపు కొన్ని, క్రూ
రానలభీకరార్చుల హృదంతర మెల్ల రగుల్చు నీస్మృతుల్.

తీయగ స్వప్నలోకముగతిం జను కాలము కొంత; దివ్యశో
భాయుత పూర్ణచంద్రికల బండిన కాలము కొంత; పూవులన్
సోయగముల్ వెలార్చెడు వినూత్న వసంతపువేళ కొంత; కా
నీ, యివె జీవితాధ్వమున నెల్లపు డట్టులె నిల్చిపోవునా;

భ్రాజదనంతకాంతిమయ భాస్కరబింబము శ్యామనీరము
గ్రాజిపరీతమైనపుడు, కాళతమస్సులు కప్పినప్పుడున్,
రోజులు కొన్ని దుఃఖమయలోకములన్ బరువౌ పదాలతో
బూజులు నిండి జారిపడు పోడిమితో గదలాడు భీదమై!

జీవితమెల్ల శూన్యమయి, శీర్ణమహాశల నిండుకొన్నదై
తావులు లేనిదై, హృదయ దారకమై చను ఆ దినాల దుః
ఖావిలమా స్మృతుల్ హృదయమం దెపుడే గదలాడబోవ? శో
భావృత మార్గశీర్ష కుసుమావళులా అవి, కంటకమ్ములా?

అది కుహూతమిస్రావేళ యైనగాని- అమృత చాంద్రీ విలసితత్రియామగాని,
మిగులనేబోదు! హృదిని తత్స్మృతియె- మిగులు! నీలినీడలో-పండువెన్నెలల చలువో?
ఇంతకును, వసంతమ్మొ, హేమంతమొ, శిశిరమొ, శరత్తొ, గ్రీష్మమ్మొ, వర్షమొ, నితాంత
మేదయిన నిల్చునేమి? తత్స్మృతులు మటుకె-హృదయ వీథుల సారెసారెకు కదలును.

* శ్రీమతి కృష్ణహతీసింగ్ రచించిన 'With no Regrets' లో 'Memories' అను ప్రకరణము చదివి.

# కళాపూర్ణోదయము - దాని మూలములు

శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ =

కళాపూర్ణోదయము సూరనయుపజ్ఞ కాదని యెవరందురు? అది ముమ్మాటికి సత్యము. బాలవ్యాకరణము సూరియుపజ్ఞ కాదా! కాని దానికిఁ జింతామణీ వికృతివివేకములు మూలములు కావనవచ్చునా? అంతమాత్రమున దాని గౌరవము తొలఁగునా! తగ్గునా! ప్రభుసమ్మితములగు వేదములలోని గాథలు మిత్రసమ్మితములగు పురాణములనుండి కాంతాసమ్మితములగు కావ్యరూపముల విలసిల్లినవి. ఇందలి కల్పనములు గవి ప్రతిభకుఁ దార్కాణములు. ఆ ప్రతిభాముద్రితమగు కావ్య మాతని యుపజ్ఞయనుట నిర్వివాదము. కాని దానికి మూలమే లేదనుట సమంజసము కానేరదు. భారతీయుల చరిత్రములు వేదములై పురాణములై యితిహాసములై చివఱకుఁ బ్రబంధములైనవి. అభిజ్ఞానము కాళిదాసుని యుపజ్ఞయైనను శాకుంతలము మాత్రము కాదు. ఋగ్వేదదేవీభాగవతభాగవతమార్కండేయపురాణ *కేదారఖండములందున్న హరిశ్చంద్రకథ తెనుఁగున గౌరన మున్నగువారిచే నెట్లు సముచితకల్పనములతో రసవత్తరముగ వెలసినదో హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికఁ జూచినవా రెఱుఁగుదురు.

పురాణకథలను, ప్రబంధములను బరిశీలించి కవులు దమ ప్రతిభావిశేషమున నవ్యకల్పనములతోఁ గావ్యములు నిర్మించిరి. గరుడపురాణమును దెనిఁగించిన సూరన పురాణవిజ్ఞానమును శంకించుట కాని పని. పెద్దనమనుచరిత్ర యెక్కడిది? దానిని, దాని మూలమును లెస్సగాఁ బరిశీలించి సవరించుటయేకాక పెక్కుతావుల పెక్కువిధముల నున్నగాథల నేర్చికూర్చి వానినైక్యమును సమకూర్చు నూతనమార్గమున వెలువడిన యీ కావ్య మపూర్వము కాక మఱేమగును? మూలమున్నప్పుడు కథయంతయు నందుండనక్కఱలేదు. ఒక చిన్న విషయమునే ప్రతిభాశాలి మహాకావ్యముగ నిర్మింపగలడు. తుదకు పాఠకులను దీనికి మూలమే లేదనిపింపఁగలఁడు. సూక్ష్మ పరిశీలనమునఁగాని యవి వెలువడవు. అట్లు నిర్మింపఁగలవాఁడే మహాకవి. అతనిసృష్టియే యీ కళాపూర్ణోదయము. అట్టియెడల నిందలి నారదగాన విద్యాభ్యాసకథకు లింగపురాణమునఁగల మూలమును బ్రకటించి సూరనకథారహస్యము నొకదానిని మాగురువులు ౧౯౫౮ డిశెంబరు భారతిలోఁ బ్రకటించిరి. అది భ్రాంతిమూలకమని శ్రీమల్లాదివా రనుచున్నారు. ఇట్లనుట సరిగాదని చెప్పుటయేగాక యింకను మూలములు గలవని సూచించుటయు నీవ్యాససారాంశము.

ఈ కథ నారదుఁడు నాలుగేళ్ళు శ్రమపడి గానవిద్య నేర్చుకొన్నట్లతనిని ద్వారకకు చేర్చుటకును, ఆసమయమున కలభాషిణీమణికంధరులు శ్రమలేకుండగా సంగీతములో సంపూర్ణజ్ఞాన మార్జించిరనుటకు నుపయోగపడుచున్నది. ఇందు కలభాషిణి గానవిద్యావిశారద యను నంశము మూలకథతో సంబంధించియు

* దీని ప్రసంగ మందు లేదు.

న్నను (ఆ గానమునకై యీకథ కల్పించనక్కరలేదు. అది తొలుతనే యావిద్యలో ప్రవీణురాలని యెక్కడ చెప్పినా చెప్పవచ్చును.) ఈ ౩౯ పద్యములను పుస్తకములోనుండి తీసివేసి పూర్వోత్తర సందర్భమున కొక్క వాక్యము వ్రాసి విడిచినా కళాపూర్ణోదయ మూలకథకు లేశమైనా లోపమురాదు. లేశమైనా హాని కలుగదు.

ఇవి భావప్రకాశికా కర్తవాక్యములు. వీరిట్లు వ్రాయుట వింత యనిపించకపోదు. కాని వారన్నట్లు తమ పరిష్కరణమునమాత్ర మీమార్పులు చేయకుండుటచే నింతవఱకు సూరనతోపాటు పాఠకులును ధన్యులు. ఒకవేళ వారు వ్యాఖ్యానములో శంకించుకొనుటకు ముందే దువ్వూరివారి వ్యాసము వెలువడినచో నట్లు చేసి యుందురేమో. కలభాషిణి గానవిశారద యని చెప్పుటకే యీకథ కల్పింపఁబడె ననుచున్నారు. సరియే. ఈకథ యనగా నేది? నారదతుంబురుల కలహ కథయా? నారదుని గానవిద్యాభ్యాస కథయా! ౩౯ పద్యములలో నున్న దేది? కలభాషిణి గానవిశారద. నారదుఁడు నాలుగేండ్లు శ్రమపడెనని తెలుపుటకుఁ దోడ్పడున దేది?

ఇట్లు నారదుని గానమాత్సర్యవృత్తాంత మెంతయు సైజముగా వెలసి ప్రధానకథకుఁ బ్రధానాంగమగుట కథారచనయందలి చమత్కృతి విశేషము. శ్రీవిష్ణువు గానలోలుఁడగుట తెలిసి సర్వదా యతని సన్నిధిని పాడుచుండు భాగ్యమును మణికంధరుఁ డపేక్షించుట పూర్వోక్తకథకు ఫలము............ఇదంతయు భావికథాకల్పనకుఁ బరమసాధనము. ఇవి కళాపూర్ణోదయము. ౧౦౯, ౧౧౧ పుటలలోని భావప్రకాశికా కర్తవాక్యములు. ఏనికి, నేఁటి వ్యాసమునకుఁ గల విరోధమును జదువరులు గ్రహింతురుగాత

ఈ కలహకథ గానవిద్యకయి నారదుఁడు నాలుగేండ్లుకాదు, యుగములుకూడ శ్రమపడె ననుటకు మణికంధరునకు నిత్యవిష్ణుసాన్నిధ్యాభిలాష కలుగుటకు నది కారణముగఁ దపముచేయుటకు దాని భంగింప రంభవచ్చుటకు నప్పుడు కలభాషిణి నలకూబరుని జేరుటకును బరంపరగా కారణమగుచున్నది. దీని ప్రధాన ప్రయోజనమును ౨ ఆ ౧౦౫ వ పద్యములోఁ గవియే సూచించినాఁడు.

కలభాషిణి రంభారూపము ధరించుటకు మాయారూపము వీడినపిదప వారి ప్రేమ సత్యమును నిర్ణయమునకు మూలమగు నారదగాన విద్యాభ్యాసకథ యెట్లు పరిత్యజింపనగును? ప్రధానకథకుఁ బీఠికయై చిలుకతొలిపుట్టువును దెలుపునది కలభాషిణి చరిత. దానికి జీవగఱ్ఱ యిది. దీనిని దీసివేయుట మూలమును ఛేదించుట యని తెలియనగును. ఇందలి యేకల్పనముగాని, కథగాని తొలఁగినఁ బ్రధానకథ కుంటువడును. అట్టిపని నెవ్వరు చేయరు.

పయినిఁ జూపెన యుపాఖ్యానభాగమే కలభాషిణీ చరితమునకు మూలముగా సంఘటించుకొనఁబడినది......లేనేలే దనుకొన్న మూల మించుకేని లభించినపుడు ప్రకటించుట యావశ్యకమని యీ ప్రసంగము కావించితిని. ఇవి కలభాషిణీకర్త వాక్యములు. ఇందు భ్రాంతిని కలిగించున దేమున్నది? ఎవరు భ్రాంతిపడిరి? "కళాపూర్ణోదయము, మూలము లింగపురాణము" నను వారి వ్యాసశీర్షికయే వీరి యీ వ్యాసమునకు మూలమగుచున్నదా! ఇందుకు "వెనుక నెపుడో భారతిలో నొక వ్యాసము ప్రకటించియున్నా"రని దీని నిపుడారంభించిరి కాని వ్రాయుటకు మున్నొకసారియైన నా వ్యాసమును గాని, ఇందుకు వారి భావప్రకాశికనుగాని ఆసాంతము తిలకించినచో నీ వ్యాసము వెలువడి యుండదు.

ఇందలి కథయే లింగపురాణమునఁ జేరినదని వీరి యూహ. వసుచరిత్రము సంస్కృతములోనికి వచ్చుట దానికిఁ బ్రమాణము. రెండును బ్రమాదములే. కళాపూర్ణోదయమును సంస్కృతీకరించువాఁడు కేవలనారదగానవిద్యాభ్యాసకథనే కైకొనె ననుటకంటెఁ బరిహాస్యము కలుగదు. బసవపురాణముగాని, వసుచరిత్రగాని సమగ్రముగా సంస్కృతములోనికి వచ్చినవేగాని యందుండి కొన్ని భాగములుమాత్రమే రాలేదు. పోనీ, మతాభినివేశము గల పండితులు దీనిని బురాణమున కెక్కించి రందమన్న, నీకథలో నట్టి మతపక్షపాత శంక లేశమును లేదు. నిష్పక్షపాతముగా సంస్కృ

టాంధ్రములలోని యీకథలనుజూచువారికది మూలము, నిది పరివర్తనము నని గోచరింపకతప్పదు. సూరనకు సహజమగు కథాకథనవైచిత్రియు విశదమగును. అది ప్రకటితమగుటచే నిట విస్తరింపనక్కరలేదు. శివపురాణము వాయవీయఖండమున నారదతుంబురుకలహప్రసంగము శివప్రసాదమున గానవిద్యావిశారదుఁడై నారదుఁడు తుంబురుని బ్రహ్మసభలో జయించుటయుఁ గలదు. తుంబురుప్రసంగము లేదుగాని శివుఁడు గానవిద్యతోఁ బాటు నారదునకు వీణఁగూడ నిచ్చినట్లు కేదారఖండము 22 వ అధ్యాయమునఁ గలదు. ఇవి యన్నియుఁ బ్రక్షిప్తము లనఁగలమా! నారదతుంబురులను, వారి గానమహిమను, స్పర్ధను మనకుఁ దెలిపినవి పురాణములే. అట్టియెడ నిది ప్రక్షిప్తమనుట యుక్తిసహము కాదు. అందలి కథకే సూరన వన్నెచిన్నెలు దిద్దె ననుట సముచితము, సత్యము నగును. ఇంతఁగాకున్నఁ గొంతవఱకైన నిందలి కథలకుఁ, గల్పనములకు మూలము లనఁదగినవానిని సాధ్యమగునంత సంగ్రహముగఁ జూపెదను. విశేషములు వలయువారి నాయాతావులఁ బరిశీలింపఁగోరెదను.

౧. శక్తిభద్రకవి రచించిన యాశ్చర్యచూడామణి యందు సీతాపహరణమునకై శూర్పణఖారావణులు సీతారామరూపముల ధరించి వారిని వంచించిరి. రంభానలకూబరుల రూపములు ధరించిన కలభాషిణీమణికంధరులు బరస్పరము వంచితులే. కాని యీవంచనము గూడ నానందకరమగుటయేగాక చిరవాంఛితసిద్ధిదాయకమగుట యిందు విశేషము. ఇందలి చూడామణియు నంగుళీయకమును మునిదత్తములై విలక్షణమహిమమును గలిగినవి. పరికింపఁగా నీమణియే మణిహారములోని మణికిని బీజమని తోఁచును. ఇది ధరించి మాయారూపుల స్పృశించిన వారి స్వరూపము వెలువడును. దానిని హృదయమున ధరించి స్మరించినమాత్రమున సకల విషయములు విదితములగును. కాఁగా సూరనకల్పనము దానిని సవరించుచున్నదనుట విమర్శకులకు విశదము. ఈతఁడు మలబారుప్రాంతమువాఁ డనియు, శంకరాచార్యుల శిష్యుఁ డనియుఁ జెప్పుచు నీకృతి పదవశతాబ్ది ప్రారంభమునకుముందే వెలువడెనని శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు పీఠికలో నిర్ణయించిరి.

౨. సేతుఖండము చక్రతీర్థమాహాత్మ్యమున నీకథ గలదు. ఉదంకుని శిష్యుఁడు కక్షివంతుఁ డనువాఁడు గురూక్తమంత్రమును జపించుచు మూఁడేండ్లు నియమవర్తియై యగస్త్యతీర్థమున నుండి తుద కందుండి వెడలిన చతుర్దంతగజము నెక్కి దేశములు చరించి తద్దేశాధిపుఁడగు స్వనయభూమీశ్వరునిచేఁ బూజితుఁడై యా రాజుకూఁతుం బెండ్లియాడి చిరకాలము సుఖముగ రాజ్యమేలెను. ఉదంకుఁడు గౌతముని శిష్యుఁడు. అల్లుఁడు. విప్రుఁడు. ఇతని చరిత్రను నన్నయ తిక్కన లిరువురును వ్రాసిరి. ఇతని శిష్యుఁడగు కక్షివంతుఁడు రాజయ్యెను. మణిస్తంభుఁడు స్వభావుని యల్లుఁడు. శిష్యుఁడు. ఇతనికి రాజును గావలెనను కోరిక పుట్టినది. కాని యది యతనికి సిద్ధింపక యతని కొడుకగు కళాపూర్ణునకు సిద్ధించినది. ఆతనికి గురుప్రసాదమున నేనుఁగు వచ్చినది. ఇతనికి సింహము వచ్చినది. స్వభావుఁడు తన గురుని దత్తాత్రేయుని ఖడ్గ మడుగఁగా నతఁడు "నీవంశ మిఁకఁ గ్రమముగా క్షత్రవంశమగు" ననెను. ఇందు క్షత్రియుఁడుగా విప్రుఁడు మారుటకు హేతువును, గ్రమమును గలదు. కక్షివంతుఁడు రాజగుటకిట్టి హేతువు లేదు. మఱియు మణిస్తంభుఁడు హ్రదమునుండి సింహముతో వచ్చునపుడు ౪ ఆ ౧౫౬ ప. "గంభీరహ్రదము న్వడి న్వెడలి యాకాశంబు నన్ బాఱు నాకుంభిద్వేషిని మెచ్చి......నానొప్పుచున్" అని చెప్పిన యిందలి కుంభిద్వేషిపదము అగస్త్యతీర్థమున వెలువడిన కక్షివంతుని చతుర్దంతకుంభిని స్మరింపఁజేయుచున్నది.

౩. ప్రసిద్ధమగు నిలమహారాజు చరిత్రను బరిశీలించినచో నిందు మణిస్తంభుఁడు వనితయై కొడుకుఁ గనుట వింత గాదు. ఆతఁడు స్త్రీయై బుధునివలన పురూరవశ్చక్రవర్తిని గనెను. ఇతఁడు పురుషుఁడైన తన భార్యవలననే కళాపూర్ణచక్రవర్తిం గనెను. పురుషుఁడు స్త్రీ యగుటయేగాక స్త్రీకూడ పురుషుఁడగుటయు వారంతకు ముందును దంపతులైయుండుటయు నిందు విశేషము. ఇలుఁడు వనితయైపుట్టి కొడుకును గన్న పిదపఁ బురుషుఁడైనట్లు గొన్నింటను, పురుషుఁడుగనే జన్మించి పార్వతీశాపమువలన స్త్రీయై కొడుకును గని యాగ

విశేషమున మరలఁబురుషుఁడైనట్లు గొన్నింటనుగలదు. పురుషులు స్త్రీలై సంతానము గన్న కథలు మన పురాణములఁ బెక్కుగలవు. విష్ణువు మోహినియవతారమున శివునివలన భైరవునిగనెను. విష్ణుమాయవలన నారదుఁడు వనితయై పుత్రులంగాంచెను. సీమంతిని సోమవారవ్రతోద్యాపనమున దంపతివేషముల ధరించిన విప్రకుమారులు నిజముగ నట్టివారైరి. ఆనుశాసనిక పర్వము ౨వ యాశ్వాసములో ధర్మజుఁడు భీష్ముని సంగమదశయందు స్త్రీపురుషులలో నెవరి కెక్కువ సుఖమని యడుగఁగా నతఁ డాతనికి భంగాస్వనుఁడను రాజుచరిత చెప్పెను. సారాంశము స్త్రీలకే సుఖ మెక్కుఁవ యని. దానిని బరామర్శించుచున్నట్లు కళా. ౫ ఆ ౧౦౭ ప "అదియునుగాక యంగనల కంగజసంగరకేళికావిశేషదశల యందు నెక్కుడఁట సౌఖ్యగతుల్" అను పద్యము కన్పించుచున్నది.

౪. కాళహస్తిమాహాత్మ్యము ౨ ఆ. ౧-౨౨ పద్యములలో వాణీచతుర్ముఖుల శృంగార గాథ కలదు. (౧౩ వ పద్యము) "వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వం బసాధారణం, బాచోద్యం బతిలోక మప్రతిమ పర్యాయంబు వర్ణింపఁగా నీ చెల్వం బిది నిక్కమిట్లయినగానీ నాకు నీవంక వాంఛాచాపల్యము తీరనేరదు మనోజక్రీడలం గోమలీ" (౧౪ ప)" నాశారిక లీడేరఁగఁ గ్రొత్తనవలె నీవు ప్రమదగౌరవకృత భాషాకృతులు నూటినటువలెఁ గైకొంటివయేనిఁ జెప్పఁగలదే మనినన్" ఇవి బ్రహ్మవాక్యములు. ఆమె యట్లు సేయుటయు నట్లొదవిన వాణీశతరూపములవలని సౌఖ్యమున నతఁడు శతానందుఁడై, (౧౬ ప) "ఆరామంబులఁ గేళిశైలముల సౌధాగ్రమ్ములన్ స్వర్ణదీ, తీరోపాంతనికుంజపుంజములలో దేశంబు కాలంబు నాచారంబు న్వివరింపఁగా మఱచి హృజ్జాతాంధకారాంధుఁడై నీకే జాసనుఁ డిచ్చనుండె శతవాణీభోగ నిర్మగ్నతన్" (౧౯ ప) "తరుణీశతకముబింబాధరమాధుర్యంబు లాను తఱిఁ దమలోనన్ బరమేష్ఠినాల్గుమోములు వరుసలు వెట్టుకొనుఁజెప్పవశమే ధూర్జటిన్" "బహుబంధరతికిలోబడి చొక్కుకొని గళరవశ్రవణంబుచేత నెచ్చరిక నొందు."

౧౩,౧౪. పద్యములు పరికించినచో నెంత సరసముగ నూరనతన వాణిని నూరురూపములఁగై సేసెనో తెలియఁగలదు. వాంఛాచాపల్యము తీరనేర దనుదాని నాస్యచతుష్టయయోగపద్యచుంబనముగఁ జిత్రించుట ఎంత సుకుమారముగ, నెంత మనోహరముగ నున్నదో తిలకింపుఁడు. ప్రమద గౌరవ భాషాకృతులు వాణి ధరించెననుటను చిత్రశ్లేషకథారూపమున దిద్దితీర్చెనా యనిపించుచున్నది. ౧౬వ పద్యమున వాణీసంభోగమగ్నుఁడై విధిదేశకాలాచారములు మఱచె నని కలదు. ఇది యిందలి వాణీచతుర్ముఖుల దివాసంగమ కథనమునకు మూలమని చెప్పక చెప్పుచున్నది. ౧౯ వ పద్యమందలి పరమేష్ఠి నాల్గుమోములు వరుసలు వెట్టుకొను నను దానిఁ గించుక మార్పుతోఁ బ్రణయకలహబీజము గావించుట యెంత మనోహరము! ౨౦ వ పద్యమునఁ గల గళరవశ్రవణంబుచేత నెచ్చరిక నొందు ననునది ప్రణయకలహము నెచ్చరించి ప్రధాన కథను చెప్పించినది. ఇందు సూరన బ్రహ్మ సరస్వతిని నాలుగుమోములతో ముద్దుపెట్టుకొనుటను రెండుమాఱులు వర్ణించినాఁడు. మొదటిది ౫-౧౭ పద్యమునఁ గలదు. అది మణితమునకు హేతువైనది. రెండవది (౩౦ ప) "వదనములు నాలుగింటికి వరుసగలియు, మెలపుతో దన కంఠంబు మలఁచి మలఁచి, యొసఁగె దధరపానమహోత్సవంబు, గళము కౌగిలితోన చెక్కులు నిమురుచు." ఇది యారాజు తల్లి మగడి, తండ్రి యాడువాఁడు నని వాణియొనర్చిన నర్మలీలకు దరువాత ఘటిల్లినది. "నాల్గుమోములు వరుసలు వెట్టుకొను జెప్పవశమే ధూర్జటిన్" అనుదాని కిది వివరణమనుట సాహసము కాదు. ధూర్జటి చెప్పిన వాణీచతుర్ముఖవిలాసమును, దీనిని బరికించినచో దాని కిది వివరణమని తోఁపకమానదు. విస్తరభీతిచే విడిచితి గాన యాఘట్టమునందుఁ జూడఁగోరెదను. ౧౬ వ పద్యమునందు "సూర్య్వరంబొంది సుధాధరగ్రహణభూరిసుఖంబుల నొందుచున్ శతానందుఁడు" న బరగువానినిందు. (౫ఆ ౨౯ ప) "అనర్మలీలచేత శతానందుం డధికసంభృతానందుండై" అని చెప్పుట స్పష్టముగా దాని బరామర్శించుటను దెలుపుచున్నది. కాంచీ మాహాత్మ్యము ౧౭-౨౨ అధ్యాయములలో సరస్వతీ బ్రహ్మల సంవాదము కలదుగాని యది యిట్టిది గాదు.

౫. మార్కండేయపురాణము ౨-౩ ఆశ్వాసములలో మదాలసచరిత్ర గలదు. ఇది ప్రసిద్ధము. దీనిని సవరము నారాయణ ప్రబంధమొనర్చెను. మదాలస పోలిక లభినవ కౌముదీకలభాషిణీ మధురలాలసలయందు గలవు. ఈమె విశ్వావసు వను గంధర్వరాజు కూఁతురు. పాతాళ కేతువను రాక్షసుఁ డీమెం గామించి యెత్తుకొనిపోయి వివాహకాలము నిర్ణయముసేసి పాతాళమున డాచెను. ఆమె వాని నొల్లక మరణింప నుద్యోగించుటయు సురభి "యీరక్కసుఁడు భూలోకమున కేగినవాఁడు వీని నేసినవాఁడు నీకుఁ బతియగు"నని చెప్పి యామె నాప్రయత్నమునుండి మరల్చెను. ఆశ్రమరక్షణనియుక్తుఁడగు కువలయాశ్వుండు సూకరరూపమున నటకు వచ్చిన యారక్కసు నేసి వాఁడు పరుగిడఁగా వెంబడి పాతాళముం జేరి వానిం గానక చివఱకు మదాలసం జూచెను. అతఁ డామెను జేరుటకు నిమిత్తమగు కుండల యను మదాలసచెలికత్తెవలన వారు పరస్పరవృత్తముల నెఱిఁగికొనిరి. అంత మదాలస కులగురువగు తుంబురుఁడటకు వచ్చి వారికిం బెండ్లిసేసెను. ఆరాజామెం దీసికొనిపోవుచు నడ్డపడు రక్కసుల పాతాళకేతు సహితముగ వధించి సుఖముగా నిలుసేరెను. అభినవ కౌముది దివ్యవనిత. తుంబురుశిష్యురాలు. ఆమెను శలలాసురుఁడు కామించి వెన్నంటెను. ఆమె "నిన్ను జంపినవానిగాని వరింప"నని శపథముచేసి చివఱకు మృగేంద్రవాహనయుపదేశమున మణికంధరుఁ డను గంధర్వనందనునిచే వానిం జంపించి యనంతరజన్మమునఁ గళాపూర్ణమహారాజైన యతని వరించెను. తుంబురు శిష్యురాండ్రగు దివ్యవనితలు దమ్ముఁ గామించి బలాత్కరింపనెంచు రక్కసులఁ జంపిన రాకుమారుల వరించుట రెంటను సమానము. ఇది మదాలస పూర్వకథా భాగమనవచ్చును. ఇంతవఱకే యభినవకౌముదికి సామ్యము గలదు.

పిదప నారక్కసుని తమ్ముఁడు తాళకేతువు పగదీర్చుకొన వేచియుండి కువలయాశ్వము నెక్కివచ్చిన యారాజును మునివేషమున నర్థించి వాని కంఠహారమును గొని యతనిఁ దన యాశ్రమరక్షణమున నిలిపి యతఁడు మరణించెనని మదాలస కా హారము నిచ్చి వచ్చెను. ఆమాట వినఁగనే యామహాపతివ్రత మరణించెను. కువలయాశ్వుఁ డిలుజేరి జరిగిన వృత్తము నెఱిఁగి మదాలసయందలి ప్రేమమున దిరిగి పెండ్లిచేసికొనలేదు. అపు డాతనికిఁ గొందఱు నాగకుమారులు మిత్రులైరి. నాగరాజగు నశ్వతరుఁడు తన సుతులవలన నారాజుకథ విని గానమున శివుని మెప్పించి యతని వరమున జాతిస్మర పరమయోగిని యయి పూర్వవయోరూపకాంతి విలసనమ్ములతో మదాలసం బుత్రికగాఁ గాంచి కువలయాశ్వు రప్పించి యతని కర్పించెను. పిదప నామె తన పుత్రుల కుగ్గుబాలతోఁ దత్త్వము నుపదేశించి పతి నిరోధమునఁ జివరివాఁడగు నలర్కునకు క్షాత్రధర్మము నుపదేశించి చివఱకు వాఁడును దత్తాత్రేయుశిష్యుఁడగు నట్లు సంఘటించి పతితో నరణ్యముల కేగి పరమపద మందెను. ఇది యుత్తరకథాభాగము. పతికంఠమణిహారమును జూపి యతని మరణము దెలుపఁగనే మరణించిన మహాపతివ్రత మదాలస. ప్రియుని యాసన్నమరణము నెఱిఁగి తాన ముందుగ శక్తికి బలియైనది కలభాషిణి. రెండవ జన్మమున జాతిస్మరపరమయోగిని యైనది మదాలస. మణిహారవిశేషమున జాతిస్మరయై యద్భుత కథలను వివరించి మహాయోగములను, పుట్టి రెండునెలలైన కాకమునందే, యుపన్యసించినది కలభాషిణి. రెండు కథలను దత్తాత్రేయప్రసంగము, మణిహారసంబంధము కలదు. ఈ పోలికలను, విశేషములను సహృదయులు పరిశీలింతురుగాక.

౬. వరూధిని దేవలోకభోగిని. మానవుని బ్రేమించినది. తాను బ్రేమించినవానిని గలియలేదు. కాని వాఁడు తన్నుఁ గామించినవాఁడు. కన్నులు కప్పి కోరిక నెఱవేర్చుకొన్నాఁడు. కలభాషిణి భూలోకవేశ్య. దివ్యపురుషుని బ్రేమించినది. తాను గలిసిన దప్పుడు దాఁ బ్రేమించినవాఁడు గాకున్నను దుర్లభుఁడనుకొన్నవాఁడును బూర్వము దాను గాఢముగాఁ బ్రేమించినవాఁడును దన్నునటుల ప్రేమించినవాఁడు నగుట విశేషము. కన్నులు తెఱచికొన్నను గలభాషిణి యప్పుడు తెలిసికొనలేదు. వాని నిజస్వరూపము దెలియుట మిక్కిలి యానందదాయకమగుట యింకొక విశేషము. ఇట్లు వరూధిని యొఱింగినఁ జచ్చు

టకైన వీలు లేదని యింకొకసారి విచారించుటకన్న మార్గము లేదు. రసాభాస మక్కడవలె నిక్కడ నున్న దన్నను ఇందు శీలభంగము లేదు. ఆ కొలఁది పొరపాటును సరస్వతీశాపహేతుకము. అందు నాయిక యొక్కతెయే మోసపోయినది. ఇందిరువురను మోసగింపఁదలఁచి మోసపోయిరి. ఈ సంఘటనము నిజముగా సూరన పెద్దన మనుమరాలి పెనిమిటియే యనిపించుచున్నది. మాయాప్రవరుఁడు తన రూపము బయటపడుననియే కదా యామెను దేశాచారమని కన్నులు మూసికొమ్మనెను. కలభాషిణీమణికంధరులు కన్నులు తెఱచుకొనియే యున్నను, వారి మాయారూపము లేల బయలుపడలేదో. ఇరువురు కామరూపులయిన బయల్పడ నవసరము కలుగదా. సూరనకే ధర్మము తెలియదా? అమంగళము శాంతించుఁగాక. అతఁడు బహుపురాణమర్మవిదుఁడు. కొందఱు దీనికిఁ దపమును, నారదుని వరమును గారణము లందురు. కాని వేఱొకటియు కలదు. భారతమునఁ బాండురాజు వధించిన మృగములు మునిదంపతులే కదా. వారి మృగరూపములు బయల్పడకుండుట చేతనేగదా యాతఁడు భ్రాంతిచే వాని నేసినది.

ఇట్లు బహుపురాణకావ్యసముద్రముల మథించి గుణదోషము తేర్పరించి తానీప్రబంధరత్నమును వెలయించెనో యన సూరన దీనికిఁ గళాపూర్ణోదయ మను పేరు గల్పించినాఁడు. కృష్ణుఁడు రుక్మిణికిఁ బారిజాత కుసుమము నిచ్చినందులకు గోపించిన సత్యకుఁ బారిజాతమునే తెచ్చి సమర్పించినాఁడు. వాని శిష్యుఁడు కళాపూర్ణుఁడు. మధురలాలస కిచ్చెదనన్న వీణె నభినవ కాముదికి వాగ్దానముచేసి యది తెలిసి కోపగించిన మధురలాలసకు నృపాలశిరోరత్నముల నందియలుగాఁ గూర్చెను.

ఈ కథాకల్పనముల సామ్యములు సూరనబహుపురాణకావ్యపరిశీలనావిశేషము, నత్యద్భుత సంఘటనము, నమేయవిజ్ఞానమును జాటునేకాని యాతని ప్రతిభకు లోటు రానీయవు. ప్రభావతీ ప్రద్యుమ్నమునఁ గూడ నితఁడీమార్గము ననుసరించెను. కాని యింతగా లేదు. అందుఁ బ్రధానముగా శ్రీనాథుని సంబంధము గాన్పించును. ఇట్టి యపూర్వపద్ధతిని వెలసిన కావ్య మిదితక్క యింకొకటి వెలువడలేదనుట నిర్వివాదము.



లీలా చిట్నీసు
లక్సుటాయిలెట్ సబ్బుతో
ప్రతిదినము తాను చేయుచున్న
సౌందర్య క్రమమును
మీకు చూపుచున్నది

లక్సు టాయిలెట్ సబ్బు
యొక్క నురుగు బాగాతెప్పించి
నాచర్మములోనికి నెమ్మదిగా
అదుముకొనెదను...

పిమ్మట నురుగంతయు
స్వచ్ఛమైన చన్నీళ్లతో
కడుగుకొనెదను...

ఆఖరున మృదువైన
తువ్వాలుతో తడిపోవునట్లు నెమ్మదిగా
ముఖమును ఒత్తుకొనెదను

LUX
TOILET SOAP

సినిమాతారకు సుందరమైన చర్మము ఆవశ్యకము. మీ మనోహరత్వమునకు మీరు ప్రాముఖ్యత నిచ్చినచో, మీకుకూడ అదిముఖ్యము. భారతదేశపు సుప్రసిద్ధ సినిమా తారల అమూల్యమైన ముఖవర్చసులను కాపాడు మృదువైన సంరక్షణను మీచర్మమునకు యేల నివ్వకూడదు? సులభమైన ఈ సౌందర్య సాధనను మీరే ముప్పది దినములు పరీక్షించండి — లక్సు టాయిలెట్ సబ్బుయొక్క మీగడవంటియు, పరిమళముతో కూడుకొన్నటువంటియునైన నురుగునకు మీరు యిష్టపడెదరు. అది చర్మమును, నవీనముగను, మృదువుగాను, పరిశుద్ధముగాను చేయును.

సినిమా తారలకు సౌందర్యము నిచ్చు సబ్బు

LTS. 153-50-40 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

# తిక్కన కావ్య నిర్మాణ వైభవము

= శ్రీ గడియారము వెంకటశేషశాస్త్రి =

తిక్కన కావ్యనిర్మాణ వైభవ మనఁగా నది యొక అఖండశబ్దప్రపంచసృష్టి — ఊహాతీత భావనా ప్రపంచ చైతన్యము — హృదయోన్ముద్రకళానుభూతి పరమార్థము. కొందఱు దాని బాహ్యసౌందర్య ముగ్ధులై విస్మయ వికచ నేత్రములతో దూరదూరాన నిల్చినవారు పోఁగాఁ, గొందఱు లోనికిఁ జొచ్చి పదపదార్థ నిర్వచనముతో, భావతాత్పర్య ప్రవచనముతో ధన్యులైన వారును గలరు. కాని, దాని ఆంతరికసౌందర్య సాక్షాత్కారముఁ బొంది యానందానుభూతి నందినవారెవరో — మహానుభావులు! ఎందుకనఁగా: ఆ యానందానుభూతి వాక్కుల కందరానిది. ఆ కావ్య దివ్య జ్యోతి బ్రహ్మ సాక్షాత్కార సధ్రీచీన మైనది. సాధకులు — ఉపాసకులు తమతమ యనుభూతి విశేషములను దెలిపినట్లే నేనును ఒక కోణమునుండి నేఁగన్న విశేషములు మనవిచేయుదును.

లోకవ్యవహారమునఁ దిక్కన సాంగవేదాధ్యయనముఁ జేసినవాఁడు. క్షుణ్ణముగా శాస్త్రములు చదివినవాఁడు. మనుమసిద్ధి యాస్థానమునఁ బండితుఁడు. మహామంత్రి. ఇంతేకాదు — అవసర మైనచోఁ గవచఖడ్గధారియై రణరంగముల వీరవిహారముఁ జేసిన సేనాపతి యనియుఁ గొందఱందురు. ఒకప్పుడు మనుమసిద్ధి రాజ్యముఁ గోల్పోవఁగా కాకతిగణపతిరాజుసాయముచే ఆతనిని రాజ్యపునఃప్రతిష్ఠితునిఁ జేసిన రాజనీతికోవిదుఁడు. కవియై నిర్వచనోత్తర రామాయణము రచించి, కృతికన్యను మనుమసిద్ధి కొసఁగి, ఆ మహారాజుచే వియ్యపుమర్యాదలందుకొన్న మామ. శిష్యుఁడై మార్కండేయ పురాణము రచించిన మారనతో గురువిద్యావంశమునకు ఆనృణ్యము సంపాదించుకొన్న దొడ్డ గృహస్థు. సారస్వత పోషణభారము వహించిన యానాఁటి భూనాయకుల భుజస్కంధములకు విశ్రాంతి నొసఁగుచుఁ, దాను కృతికర్త యగుటయే కాక కేతన దశకుమార చరిత్రమునకుఁ గృతిభర్తయై మారనాదిశిష్యప్రశిష్యులద్వారా సారస్వతాభివృద్ధి సేయుచున్న కులపతి. ఇంతమాత్రమే కాక యజ్ఞముఁ జేసి సోమయాజియై భారతామ్నాయము నాంధ్రీకరించిన వైదికకవి.

కొందఱు సంస్కృతాంధ్రమహాకవుల ఇయత్త కొలిచి చెప్పుటలో "నన్నయ లేకఁ బుట్టఁగ-తిక్కనలు మరలఁ బుట్టవచ్చు"నన్నారు. మఱికొందఱు "కాళిదాసే భారత మాంధ్రీకరించియున్నచోఁ దిక్కన స్థానమేది?"అని పరీక్షించుచున్నారు. ఇఁకఁ గొందఱు "వాల్మీకి రామాయణరచనము చేతఁబట్టుటతో వ్యాసునకు- తదనుయాయి తిక్కనకు ఊరుపేరులు దక్కిన" వందురు. కొందఱు "అసలు వ్యాసుని పెట్టుబడి లేనిచోఁ దిక్కన బండారమెంతటి"దని పెదవివిఱుచువారును గలరు. వారివారి యూహలలో నేదోయొక కొలతబద్ద—ఒక మానపాత్ర ఉండక పోదు. కాని ఇదంతయు అభిరుచిభేద మనుట యుక్తము. కావున ఎవరెవ రేమి తక్కువవారు! మన కందఱును బూజ్యులే. తీరికయు, నోపికయుఁ గలవారు తారతమ్యపరీక్ష చేయుచుందురుగాక. మనము తిక్కన కావ్యానందరసానుభూతి నందుకొందము. అయినను ఇక్కడ నొక్కమాట చెప్పకతప్పదు. కావ్యనిర్మాణము నెవరెవ రెట్టి సామగ్రితో, నెట్టి విలక్షణసరణితో, నెట్టి ప్రత్యేకశక్తులతోఁ దీర్చినను, దత్కావ్యపరమప్రయోజనము ప్రజాహృదయములందే ఫలింపవలె ననుటలో నెవరికి నభిప్రాయభేద ముండదనుకొందును. ఆ దృష్టితోఁ జూచినచో సంస్కృతకావ్యముల నట్లుంచి తెనుఁగు పొత్తములలోఁ, దిక్కనభారతమువలెఁ దెలుఁగువారి డెంద

ములలో ఇంత సుస్థిరముగ, నింత సుప్రతిష్ఠితముగఁ బీఠము వేసికొన్నది మఱొకటి యుండదని అనుభవ పూర్వకముగఁ జెప్పవచ్చును. ఎందుకనఁగా: ఇన్ని శతాబ్దములతరబడి ఎన్నో ఒడుదుడుకులతోఁ గడచిన యీ కాలములో నేఁటికిని ప్రజాహృదయములలో నేదో యొక మెత్తనిచోటఁ జల్లఁగఁ దావుచేసికొనికూర్చుండి వారి నూరడించుచు, ఉత్సాహపఱచుచు, దారి చూపుచు, ధార్మికనిష్ఠఁ గఱపుచుఁ, జెదరక నిలఁబడి యున్నదికదా తిక్కనభారతము! "వింటే భారతము వినవలె-తింటే గారెలు తినవలె" అను నీ సామాన్య లోకోక్తికూడ నీ విషయము నెంత విస్పష్టముగనో చాటుచున్నది. ఇంతకుఁ దేలిన సార మేమనఁగా—! లోకశాస్త్రకళాజీవనరహస్యములను విజ్ఞానవివేకమందరముతో మథించి, ప్రజాభద్రజీవితమునకు శాశ్వతముగా నమృతకలశము నందించిన ఆ మహాకవి మనకుఁ ద్రికాలములయందు నారాధ్యమూర్తి. ఈ మహత్త్వము ఆయనలో-ఆయన యుభయకవిమిత్రతలో-ఆయన హరిహరోపాసనాతాత్పర్యములో - "ఆంధ్రావళి మోదమున్ బొరయ" కావ్యనిర్మాణము చేయుటలో నిమిడి యున్నది.

ప్రకృతము కావ్యమునుగూర్చి కొంత ముచ్చటింతును. నేఁడు మన నిత్యజీవితావసరవస్తువులలోఁ గావ్యమున కేసామాన్యస్థానముగాని, ఆవశ్యకతగాని యున్నట్లు కనఁబడదు. ఎందుకనఁగా, అది లేకున్న మన ఆహారవిహారాదు లేవియుఁ గుంటుపడుటలేదు. కనుకనే వాని ఉత్పత్తి వినిమయములగూర్చియు, ఎగుమతి దిగుమతులఁగూర్చియు, ధరలు నియమించి యందించుటఁగూర్చియు ఏ ప్రభుత్వముగాని యెట్టి చర్యయుఁ దీసికొనుటలేదు. ఉప్పుతో ముప్పదిమూడు వస్తువులకు నింతగా ధరలు పెరిగిన యీ రోజులలో మన కావ్యపు సరకునకు చిగురు కదలినంత చలనముగాని, జీవముగాని యున్నట్టులేదు. కడకుఁ దెల్లకాగితము కావ్యముద్ర పడుటతోఁ గరుడుకాగితమై పాతికపఱకబేరాలకుఁ బాల్పడుచున్నది. కాని, యిప్పుడిప్పుడు కొందఱు పెద్దలు ఈ కావ్యపుసరకును అక్కఱ వస్తువుగాఁ దయారుచేయుటకును, దానికి ఒకపాటిగానైన బజారువిలువ కట్టించుటకును పాటుపడుచుఁ బ్రజాభ్యుదయమున ముందడుగు వేయుచున్నారు. ఇది సంతోషింపఁదగిన విషయము. కాలధర్మముకూడ! "రాజా కాలస్య కారణం" కదా!

మన కీనాఁడు ఒంటఁబట్టిన విజ్ఞానమును జూడఁగా అన్నవస్త్రములు కొఱతపడకుండ ఆహారవిహారాదు లనుభవించుటే యానంద మనుకొన్నట్లు తోఁచును. కాని, ఇదే సవ్యమార్గ మనలేము. ఈ మాత్రపు జీవనము ప్రాణిసామాన్యమైనది. మానవుఁడు తక్కిన ప్రాణులవంటివాఁడు—ఉత్తముఁడు. ఆ యుత్తమత్వ మాతని యవయవనిర్మాణమునందే గోచరించుచున్నది. ఆతని కార్యములయందుఁ బరిస్ఫుట మగుచున్నదికూడ. కనుకనే అతనిది ప్రాణులలో నుత్తమశ్రేణి. ఆ శ్రేణిలోసైత మాతని యుత్తమస్థానము దైవత్వమునకుఁ బ్రతినిధి. ప్రతినిధి యేమి-అగోచరమగు దైవత్వమును గూడ నచ్చటనే చూడఁగలము. అట్టి మానవుని జీవితవిహారపరిధి అన్నమయ ప్రాణమయ మనోమయ కోశముల వఱకే నిలిచియుండదు. కనుకనే అతనికిబాహ్యజగత్తుతోఁ బాటు ఆంతరికజగత్తేదో యొకటి ముఖ్యనివాసముగ—ఉచితకార్యస్థానముగ - నిత్యవిహారభూమిగ నుండక తప్పదు. ఈ బాహ్యాభ్యంతర జగత్తుల కేదో యొక రాచబాట వేసి పూలపాన్పు పఱచి, ఉచితసంవిధానములతో సంధానములతో రెండు జగత్తులను భాగ్యవంతములఁ జేసి, అచ్చటఁ బరిపూర్ణమానవత్వమునో-దైవప్రాతినిధ్యమునో-దైవత్వమునో సుకుమారముగఁ బ్రతిష్ఠింపఁగలదేదో అది కావ్యజగత్తు. ఆ కావ్యజగన్నిర్మాతలే కవిబ్రహ్మలు.

ఈ కావ్యజగత్తున భౌతికప్రపంచమందువలెనే యెన్నో పట్టణములు, పల్లెలు కలవు. మహారణ్యములు, దివ్యోద్యానములుఁ గలవు. మహోన్నత పర్వతశ్రేణులు-చిన్నగుట్టలు, దివ్యవాహినులు, అల్పసరస్సులు, రాలగనులు-రత్నాలగనులు—ఇట్లే ప్రకృతిసంభారసర్వస్వమంతయుఁ గలదు. వీనిని వేదవేదాంతములు మొదలు వీథిభాగవతములవఱకుఁ బోల్చుకొనవచ్చును. భేద మొక్కటియే. అది తైజసప్రకృతి-ఇది భౌతికప్రకృతి. మానవజీవితసౌభాగ్యమునకు వలయు పదార్థజాతము

నంతయు రెండు జగత్తులలోని ప్రతియొక మూర్తియు యథాసంభవముగఁ దయారుచేయుచున్నది - యథార్హముగ నందించుచున్నది. శివుని జటాజూటమునుండి దిగజాఱిన భాగీరథీప్రవాహమువలె వేదశిరస్సులనుండి జాలువాఱిన విజ్ఞానరసతరంగిణి స్వర్గమర్త్య పాతాళముల నాక్రమించి, తాను మెట్టినచోటు పునీతముగఁ బుష్కలజీవనసంపన్నముగఁ జేయుచున్నది. కాని, యీ రెండుజగత్తులయందును, ముఱికిగుంటలును, మఱుగుదొడ్లను గట్టినవారుండకపోరు-ముండ్లపొదలును, ముష్టిపండ్లును లేకపోవు. వానివాని యౌచిత్య మెఱిఁగి వాడుకొనుటే మనము చేయవలసిన పని.

ఇట్టి కావ్యజగన్నిర్మాణమునుగూర్చి మన ప్రాచీను లిట్లు పలికియున్నారు: "నియతికృతనియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం, నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీకవే ర్జయతి"-ఇందులోని "నియతికృతనియమరహితాం-హ్లాదైకమయీం"అను పదములఁబట్టి కొందఱు 'కావ్యరచనఁగూర్చి నియమమక్కఱలేదనియు, 'ఆకావ్య మానందైకప్రయోజన' మనియుఁ బలుకుట వినుచున్నాము. కాని "దీనియర్థమిదేనా? ఇది యనుభవమునఁ గుదురునా"యని నా సందేహము. నియమము-తాను గల్పించుకొన్నదో, యితరులు కల్పించినదో, యేదైనఁగావచ్చు-అట్టి దేదియు లేక తాను నడుచుకొనుచున్నాఁడా? తనయింటిలోనైనఁ-గేవలము తన్నుఁగూర్చియైన నేనియమము లేక నడువఁగలఁడా ? కడకు 'నియమ మక్కరలే'దను నియమమైన నతని నంటుకొని యుండలేదా? "ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి"అన్న గీతావాక్యమున కర్థమేమి? ఈవాక్యమును బలికిన గీతాచార్యునివలెఁ దాను ప్రకృతివిజేత యైనపుడుకూడఁ బరహితము సాధించుకొఱకైనఁ బ్రకృతినియమ మంగీకరింపక తప్పదుకదా! కావ్యమానందైకప్రయోజన మనుటలో సత్యమున్నది. కాని, ఆ యానంద మేది? ఎవరికి ?-శ్రేయఃప్రాప్తి ఆనందము. అది విశ్వప్రజకు. అందులో నొకఁడైన తనకుఁగూడ నని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. 'కావ్యము నాయానందము నకే-ఇతరులతోఁ బనిలే'దని యెవరైన ననవచ్చును. కాని, అది భారతీయసంప్రదాయము కాదు. ఏ సత్కావ్యపఠనము-ఏ సారస్వతగోష్ఠి జరిగినను ముగింపునందు "స్వస్తి ప్రజాభ్యః...లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"అని ఫలశ్రుతి చెప్పుట నేఁటికిని ఖిలము గాని యాచారము. "విశ్వశ్రేయః కావ్యమ్", "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే"-ఇత్యాదిగఁ బెద్దల సూక్తులు ఈ విశిష్ట ధర్మమునే బోధించుచున్నవి. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్"-ఈ నిషేధవాక్యము సంప్రదాయవిరుద్ధమైన యసత్కావ్యవిషయమని వ్యాఖ్యాతలు వివరించియున్నారు. ఈ విధమున మానవజీవిత వివిధమార్గములలో దివ్యజ్యోతులు వెలిఁగించి, వారికిఁ దుష్టిపుష్టి నిర్వాణముల సమకూర్చు నుత్తమకావ్యములు సముద్రప్రయాణమున దిక్సూచకదీపస్తంభములవలె నక్కడక్కడ నొక్కొక్కటియైన స్థిరముగ నిలిచియుండుట యెంతయేని యావశ్యకము. ఈ పరమార్థమును భావించియే మన తిక్కన భారతాంధ్రీకరణమునకు గంటముఁబట్టినాఁడు.

"భారతము కావ్యమా? ఇతిహాసముగదా! అందులోని బంగారము వ్యాసమహర్షిది కదా—తిక్కనదేమున్నది?" అని కొంద ఱనవచ్చును. దీనిని విమర్శించుకొందము. ఒకవిధముగ వేదములు మొదలుకొని సారస్వతభాగము లన్నియు కావ్యములే. దాని వ్యుత్పత్తియే యా భావమును దెల్పుచున్నది. అధికారమునుబట్టియు, నంతస్సారమునుబట్టియుఁ, బ్రవచనపద్ధతినిబట్టియు వేదములనియు, శాస్త్రములనియుఁ, బురాణములనియుఁ, గావ్యములనియుఁ బలురకములుగఁ బెద్దలు ప్రత్యేక నిర్వచనముఁ జేసియున్నారు.

"యద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం
శబ్దప్రధానా చ్చిరం
యచ్చార్థప్రవణాత్ పురాణవచనా
దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతాసమ్మితయా యయా సరసతా
మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యేకుతుకీ బుధో విరచిత
స్తస్యై నమస్కుర్మహే"

వేదము శబ్దప్రధానమై ప్రభుసమ్మిత మైనది. పురాణము అర్థప్రధానమై సుహృత్సమ్మిత మైనది. కావ్యము భావ ప్రధానమై కాంతాసమ్మిత మైనది. ప్రభువువలె శాసింపక, మిత్రునివలె సలహానిచ్చి యూరకుండక, కాంతవలె సుకుమారముగ మనసు గరగించి, మానవుఁడు తనకుఁ దానే కర్తవ్యమునకుఁ గడంగునట్లు ప్రేరేచునది కావునఁ గావ్యశక్తి యుత్తమమని పెద్దల యాశయము. భారతము వ్యాసుని తక్కిన యష్టాదశ పురాణములవలెఁగాక విశిష్టమైన యితిహాసమై యతని రచనయందే కొంత కావ్యత్వమును దక్కించుకొన్నది. "మహత్త్వాత్ భారవత్త్వాచ్చ" మహాభారతమైనది భారతమును గూర్చి నన్నయభట్టారకుఁడు "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు, నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు సర్వ లక్ష్యసంగ్రహమని, ఐతిహాసికు లితిహాసమనియు, పరమపౌరాణికుల్ బహు పురాణ సముచ్చయం బని"......కొనియాడిన భారతమును బరాశరాత్మజుండు విశ్వజనీనమై పరగునట్లు చేసినాఁ డని ప్రశంసించినాఁడు. ఇంతటి యుత్తమ సాహిత్యమును నా తెలుఁగువారికి తంగేటిజున్ను చేసి బంతివిందులు పెట్టెదనని నడుముగట్టి, సముద్రమున కేతము నెత్తిన ఆ వాగనుశాసనుఁడు మనకుఁ బ్రథమారాధ్యుఁడు. ఆ మహాభాగుని శుభారంభము చేతనే తెనుఁగునకు భారతవర్షము భాషలలో భారతమును ప్రథమముగా నవతరింపఁజేసికొన్న గౌరవము దక్కినది. రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుఁడును, అవిరళజపహోమతత్పరుఁడును, సంహితాభ్యాసుఁడును, నానా పురాణవిజ్ఞానిరతుఁడును అయిన ఆ ప్రథమాచార్యుఁడు తన సహజగంభీర గీర్వాణశైలీపరిణతమైన రచనతో వ్యాసభారతమును తెనుఁగున మనకు నితిహాసముగానే ప్రసాదించినాఁడు. మూడుపర్వములతో ముగియక ఆ గంటమే అష్టాదశపర్వములను నిర్వహించియుండినచో నెట్లుండెడిదో! కాని, భారతమును గావ్యముగాఁ జదువు భాగ్యము తెలుఁగునాడు నోఁచినది. దానికై కవిబ్రహ్మ యవతరించినాఁడు. అప్పటి తెనుఁగుబాస అమృతసేచనమునఁగాని నన లుకొనలు సాగుచుఁ దెలుఁగుఁదనము నలువైపుల గుబాళింపఁ జేయఁజాలినది కాకుండెను. ఆ నాఁడు ఊరి కొక దొరయై గడియ కొక గండమై యుడికిపోవు ప్రజాహృదయముల నూరార్చుటకును, ఉత్సాహపఱచుటకును, భవిష్యన్మార్గము భాగ్యవంతము చేయుటకును చక్కని చిక్కని తెనుఁగుఁదనముతోడి జాతీయరచన ఎంతయేని అవసరమై యుండెను. ఇంతయుఁ దడవికొనుచుఁ దహతహపడుచుఁ, దీవ్ర తపస్సుచేఁ దెలుఁగు నుడికారములఁ గరగిపోసికొనుచు, భావనాదృష్టిచేఁ బ్రజాహృదయముల నంతరాంతరముల నాకళించుకొనుచున్న తిక్కన సోమయాజియై, అవభృథస్నానమున శుద్ధుఁడై బుద్ధుఁడై హరిహరోపాసనమున బ్రహ్మవర్చస్వియై, సంస్కృతమున ఇతిహాసమైన భారతమును తెనుఁగునఁ బోతపోసి మహాకావ్యముగా మనకుఁ బ్రసాదించినాఁడు. "నానృషిః కురుతే కావ్యం" అను సూక్తికిఁ దార్కాణగా నిలిచినాఁడు. అదియే మనతిక్కన మహాకావ్యము. అదియే ఆంధ్ర మహాభారతము.

ఇఁకఁ దిక్కన కావ్యనిర్మాణమును బ్రశంసింతును. "తఏవ పదసంఘాతా స్తాఏవ వార్థవిభూతయః, తథాపి ముఖభేదేన కాపికాపి సరస్వతీ" అన్నట్లు భారతములోని యితివృత్తమంతయు వ్యాసుని బంగారమే కాని అది తిక్కనచేతి శిల్పమున నమూల్యాలంకారాభరణమైనది. కావ్యనిర్మాణమునకు వలయు సామగ్రి కవులకందఱికి నొకటే. దానిని విపులముగా లాక్షణికులు వర్ణించియే యున్నారు. అందచందములు తీర్చుటకై ఆలంకారికులు రకరకములైన సామ్ములు తయారుచేసి జాబితాలు ప్రకటించియున్నారు. కాని వాని నేర్చి కూర్చుటలోఁ దీర్చి దిద్దుటలో మాత్రము లోనివెలుఁగు చేతిపనితనము ప్రత్యేకవ్యక్తి విభిన్నమై కావ్యము దేని యంతకది ప్రత్యేకమై విలక్షణముగాఁ దయారగుచుండును. ఒక పద్యము కావ్య మన్నాఁడు ఒకాయన. రసాత్మకమైన వాక్యమే కావ్యమన్నాఁడు మఱియొకరు. వాక్యముగానీ, పద్యముగానీ వ్రాయునపుడు సాధారణముగా నేమేమి కావలెనో మనకే తెలియును. ఏదో యొక విషయము—దాని కొక భావన—దానికిఁ దగిన శబ్దార్థములు— అవి నడుచుట కొక ఛందస్సు—(లాక్షణి

కులు చెప్పినది కాక పోయినను మన మనుకొన్న ఛందస్సు—అది కాకున్నను దానికి సహజముగా నున్న యేదో యొక నడక) అనుకొన్న భావము సరిగా నున్నదా లేదా—దాని నీ పదార్థాలు సరిగాఁ జెప్పుచున్నవా లేదా— అని తెలిసికొనుట కేదో కొంత లోకశాస్త్ర జ్ఞానము—ఇంతమాత్రపు సరకుతో రచన సాగింపవచ్చు. దీనికిఁ గొన్నాళ్లు కొంత గరిడీసాము చేసిన సరిపోవును. దీనితోఁ బ్రతియొకఁడు వాక్యకర్తయుఁ, బద్యకర్తయుఁ గావచ్చును. కాని, ఒక పద్యముగాని ఒక వాక్యమే గాని విశ్వశ్రేయము సాధింపవలసి వచ్చినప్పుడు దాని పరిణాహము-పరిణతి-పరికరము కొంత విస్తృతము కావలసియుండును. "నేను రసము-నేను ఆనందము" ఈ వాక్యమే కావ్యమై విశ్వశ్రేయమును సాధింపలేదు. దానికి వ్యాఖ్యాన ప్రాయము గానైనఁ గొంత ప్రపంచము కావలయును. కనుకనే పెద్దలు కవితాబీజములుగ "శక్తి ర్నిపుణతా లోకకావ్యశాస్త్రాద్యవేక్షణాత్, కావ్యజ్ఞ శిక్షయా చేతి ఇతి హేతు స్తదుద్భవే" 'అని సూత్రించుచు, ప్రతిభ-వ్యుత్పత్తి-ఉపజ్ఞ-సంస్కారము—ఇట్లే మరికొంత సామగ్రి కావలెననియు, వీనిలోఁ గొన్ని మనము తెచ్చికొన్నను, మరికొన్ని పుట్టుకతోనే రావలసినవి కలవనియు నుపదేశించియున్నారు. దీనినిఁ బట్టి ఈ జన్మలోఁ గాక జన్మాంతరమునఁ గూడ గూడఁబెట్టిన కొంత సామగ్రి యున్నపుడే కావ్యనిర్మాణదక్షత యేర్పడునని తెలియుచున్నది. కొందఱు "శాస్త్రము పదపదార్థములను ఛేదించునది-దాని సంస్కారము కావ్యరచనకుఁ బ్రతిబంధక"మని యందురు. నిజమే! శాస్త్రము వేఱు-కావ్యము వేఱు. కాని కళావేత్తయైన కవిని శాస్త్ర మరికట్టలేదు. శాస్త్రసంస్కారమును కావ్యమునం దంతర్వాహిని చేయునది కళ. ఒక శాస్త్రసంస్కారమునే కాదు-ప్రకృతిలోని భౌతికాంశము నంతయు విడఁగొట్టి, అందులో సారభూతమైన సౌందర్యమును రసమయముఁ జేసి కావ్యమున మెదుపునది కళ. ఈ కళాప్రభుత్వమునఁ గళోపాసనమున నాలుగు పురుషార్థములు కూడఁ దమతమ సాధనామార్గములందుఁ గటుత్వముఁ దొలఁగించుకొని సుందరములై సుఖసంసేవ్యము లగుచున్నవి. వివిధజలాశయములనుండియు, విభిన్న భూములనుండియు సూర్యకిరణములచేఁ బొంగిన యావిరి ఆకాశమున వాయుసంపర్కముచే ఘనీభవించి విద్యుత్కాంతులతో విహరించుచు, వాయుసంచాలనముచేఁ గరఁగి వర్షబిందువులుగా సురిగి భూమినిఁ దనిపి సముద్రమునఁ జేరుచున్నది. ఇట్లే వివిధమానవసంఘ సంప్రదాయ వ్యవహారములనుండి వివేచనాబలముచే సంగ్రహింపఁబడిన విజ్ఞానము సుకవిభావనాపథమున రసమయమై కరుడుగట్టి కళాదీప్తుల విలసిల్లుచు కవితామార్గమునఁ గావ్యమై యమృతము కురిసి ప్రజాహృదయములఁ దనుపుచు విశ్వసాహిత్యమున విశ్రాంత మగుచున్నది. ఇన్ని తెఱఁగుల సామగ్రి సంపన్నముగ నిలువచేసికొన్న సుకవి సత్వస్థుఁడై, సమాధిస్థుఁడై కావ్యరచనమునకుఁ గలము బట్టుచున్నాఁడు. ఉత్తర రామాయణ రచనమునాఁటికి మన తిక్కనయు నిట్టివాఁడు. ఇంతే కాదు. ఆయనభాండాగారము పుష్కలమైనది. భావసంస్కారము పారావారమువలె నగాధమైనది.

తిక్కన "అమలోదాత్తమనీష నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునఁ బారగుఁడఁ గళావిదుఁడ"నని చెప్పికొనుచు నిర్వచనోత్తర రామాయణరచన నారంభించినాఁడు. "ధీరోదాత్తనృపోత్తముఁడు రామధరణీపతి సద్వృత్తము సంభావ్య"మగుటచేఁ దన ధర్మోపదేశము ఫలించుననియుఁ, దన కుభయలోకప్రతిష్ఠ సిద్ధించుననియు నాతని యాశయము. శ్రీరాముని ఉదాత్తనాయకునిఁగ ధర్మ్యమైన సాంసారికసౌఖ్యము ననుభవించువానిఁగా, "ఉదాత్తవృత్తితో మహి నేలెడువానిఁగా, ఎట్టి కష్టములందును నిర్లిప్తుఁడై "ఎక్కుడు దిగ్గను" లేనివానిగా, ధర్మానుష్ఠానమునకు, ధర్మపాలనమునకుఁ బుట్టిన రాజుఁగా నెంతో చక్కఁగాఁ దీర్చిదిద్దినాఁడు. పదబంధము కూడ సుందరమై "లలితపదహృద్యపద్యంబులన కథార్థంబు ఘటితపూర్వాపరమై, అలతియలతితునియలు గాహాల సంధించిన విధంబున" నమరినది. కాని, తా ననుకొన్నంతగా నా రామాయణము ప్రజాహృదయమునకుఁ బట్టినట్లు లేదు. అందలి రాముఁ డలౌకికుఁడైన దేవుఁడును గాదు-ప్రాకృతసముఁడై ప్రజలలోఁ దిరుగు మానవుఁడును గాకపోయినాఁడు. తన ధర్మోపదేశ మా రచనలో నదుకలేదని కనుఁగొన్నాఁడు. ఆతర్వాత

జరిగిన సారస్వతతపస్సే, భావసంస్కారమే, లోకధర్మ సమన్వయమే భారతాంధ్రీకరణమునకుఁ బాదులు గట్టినవి. నన్నయ భారతమును జదువుకొన్నాఁడు. అప్పటి తెలుఁగుదేశమును—భాషను – బరిస్థితులను బరిశీలించినాఁడు. ఎక్కడవతక్కడవలను సవరించుకొన్నాఁడు. "జనాభ్యర్చితమైన భారతము—నానేర్చుకొలంది సెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిఁ" అని సంకల్పించి భారతమును జేతఁబట్టి "శ్రీయన గౌరినాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి 'విష్ణురూపాయ నమశ్శివాయ'యని పల్కెడు భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిఁ" అను నాందీపద్యముతోఁ దెనుఁగునేతకుపక్రమించినాఁడు. ఈ నాందీపద్యమే ఆయనరచనలో స్వతంత్రతను, విశిష్టతను, ఔచిత్యమును జాటుచున్నది. తిక్కన తన యిష్టదైవమునకు హరిహరనాథ రూపకల్పన చేయుటయందే ఆయన హృదయపాకము, సర్వసమభావము, భారతరచనోద్దేశము తెల్లమగుచున్నది. చూడుఁడు: ఆయనదేవుఁడు హరియు—హరుఁడును గాఁడు; శూన్యము గాదు; వ్యక్తము గాదు-అవ్యక్తమును గాదు—అన్నియుఁ గావచ్చును. ఈ సమన్వయము చాల గొప్పది. ఆధ్యాత్మికమునఁ గూడ నెంత రాజనీతిచతురత! వైదికధర్మనిష్ఠ కెట్టి పునాది! మతవివాదముల కెంత చక్కని 'రాజీ'పద్ధతి! కర్మభక్తిజ్ఞానముల కెట్టి సమన్వయము! ఇది సమభావమో! అద్వైతభావమో! ఏదైన నేమి, మొదటినుండి తుదివరకు దీనిని తిక్కన చక్కఁగ నిర్వహించినాఁడు. ఈ భావమును బాఠకులకు బోధించుటేకాదు, ప్రతి ఆశ్వాసాద్యంతములయందును జక్కని వృత్తములతోఁ, గమ్మని పలుకులతో హృదయములోఁదూటిపై సమభావమునే తట్టి జ్ఞప్తిచేయుచుండును. తిక్కన హరిహరనాథుని ప్రశ్నించు ఈ శ్లోకమును వినుఁడు: "కిమస్థిమాలాం కిము కౌస్తుభంవా పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం, కిం కాలకూటం కిమువా యశోదాస్తన్యం తవ స్వాదు వద, ప్రభో మే"—నీ అలంకారమునకు అస్థిమాల కావలెనా? కౌస్తుభమణి కావలెనా? నీ ఆహారమునకుఁ గాలకూటమా-యశోద చనుబాలా? ఏది నీకుఁ జవిగానుండును?—ఈ అడుగుటలో నెంత యమాయకత్వమో అంత చాతుర్యము—ఎంత భక్తియో అంత విరక్తి-ఎంత ఆవేశమో అంత అద్వైతభావము! ఆహా! ఏమి నేర్పరితనము! పేరునకు హరిహరనాథు నడుగుచుండినను నిజమునకుఁ దన సమభావమును లోకమునకుఁ జెప్పుచున్నట్లులేదా! చూపులు దేవునివైపు, హృదయము లోకమువైపు-ఈ వ్యంగ్యమర్యాద యెంత మధురమైనది! ఇందులో నీ గడుసుదనముఁ జూడుఁడు: తా నెన్నఁడో వ్రాసికొన్న ఈ యొక శ్లోకమును వినఁగనే స్వామి సంతోషించి మెచ్చికొని "ఈ గ్రంథమును నా కంకితముసేయు"మని యడిగెనఁట! ఎన్నఁడో వ్రాసికొన్న పద్యమే యింత హృద్యమై, సామాన్యరాజు గాదు-హరిహరనాథునంతటివాఁడు అంకితముకోరుటలో నెంత ధ్వని యున్నది? ఒక శ్లోకమే యిట్లున్నచో నిఁక గ్రంథమంతయు నెట్టిదిగా నుండవలయును-ఈశ్వరుఁడే యిట్లడుగునపుడు సామాన్యమానవు లాగ్రంథమునకై యెంత యువ్విళ్ళూరుదురు! ఎంత బతిమాలుకొందురు?—ఈ స్వప్నవృత్తాంతముతో గ్రంథము మొదటియాకునందే తిక్కన యెంత దివ్యచిత్రమును మన కన్నులకుఁ జూపుచున్నాఁడు! ఈయనరచన యంతయుఁ దుదిమొదలుగా నిట్లే యుండును. ఒక చిన్నమాటతో నొక గొప్పభావమును-ఒక చిన్న సంవిధానముతో గొప్ప ప్రయోజనమును సాధించుచుండును. తిక్కనపద్యరచనయే ఒక రకమైన యెతుగడ గలది. వేయిపద్యముల రాశిలోఁ దిక్కనపద్య మెక్కడనున్నను అతని శైలి విన్నవాఁడు వెంటనే 'యిది తిక్కనపద్య'మని యెత్తిచూపఁ గలఁడు. అలతియలతిపదములు, నట్టివే సమాసములు-వాక్యములు, వాక్యాంతమందు భావస్ఫోరకమగు నేదో యొక కాకుస్వరము – భావము సంగ్రహించుటలో, సూటిగఁ జెప్పుటలో నొక ప్రత్యేకత-సందర్భ సాక్షాత్కారము చేయుటలో నొక విశిష్టత—ఇట్టి వెన్నియో ఆయనకు సొంతసొమ్ములై యితరుల కనుకరింపరాని గుణములు గలవు. చూడుఁడు :-

"ఇది యొక పెద్ద గట్టిమొన;
యీమొనముందట గోగణంబుతో

నదియొక యల్పసైన్య; మట
  యాతల వేఱొక కొంతసేన; అ
ల్లదె యిటు పంచిపెట్టఁజనె;
  నన్నిటిలోన వృథాభిమాన దు
ర్మద బహుభాషియైన కురు
  రా జెచటన్ జనుచున్నవాఁడొకో !"

ఈ విస్పష్టవివరణము చూడుఁడు :—

"వచ్చినవాఁడు ఫల్గునుఁ; డ
  వశ్యము గెల్తు మనంగరాదు; రా
లచ్చికినై పెనంగిన బ
  లంబులు రెండును గెల్వనేర్చునే!
హెచ్చుగుఁ గుందుగున్; దొడరు
  నెల్లవిధంబుల కోర్చునట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కెడయి
  నిఁ దక్కఁ బొందదు చేతయున్ దగన్"

తిక్కనరచనలోని శబ్దప్రపంచ సౌభాగ్యము వర్ణనాతీతమైనది. ఒక మానవుఁ డింత సృష్టి చేయఁ గలఁడా యని యాశ్చర్యము కలిగించును. తెలుఁగులో నింతటి యమూల్యపదములు-మృదువులై, మధురములై, మనసులోని భావమును సూటిగఁ జెప్పఁగలిగినవి-కర్ణపేయములై కూర్పునం దాణిముత్యాలవలె నదికి యందగించఁగలవి ఎక్కడివి? తిక్కనకుఁ బూర్వ మేగ్రంథమున నివి కనఁబడవే! తర్వాతి కవు లెంత యత్నించినను ఆ గని వారికి దొరకలేదేమో! అది యంతయు నాయన సొంతఆస్తి. పట్టణములలో-అంతకంటె ముఖ్యముగఁ బల్లెలలో నిత్యవ్యవహారమున నిగనిగలాడునవి-మాఱుమూలల మరుగుపడినవి అన్నియు సేకరించినాఁడు. మాసిపోయినవానికి మెఱుఁగులు దిద్దినాఁడు. వికృతములైనవానికి వేసముఁ దీర్చినాఁడు. అవసరమైనచోట వదనుఁబట్టి యనువుగా సృష్టించుకొన్నాఁడు. అప్రయత్నముగా దొరలిపడినవి దక్కించుకొన్నాఁడు. అన్నిటికి రూపమును బట్టి, గుణమునుబట్టి, అక్కఱఁబట్టి కులగోత్రముల నేర్పఱచుకొన్నాఁడు. పుష్పజాతులు కొన్ని, ఫలజాతులు కొన్ని-రత్నజాతులు కొన్ని, లోహజాతులు కొన్ని-జాతీయములు కొన్ని, సామెతలు కొన్ని-అన్నియు రాసులుపోసి దొంతులుతీర్చినాఁడు. వానివాని పలుకుబడి వేఱు-నుడికారము వేఱు. సందర్భమునుబట్టి ఆ ధ్వని కొక యర్థము-ధ్వనినిబట్టి యాసందర్భమున కొక భావము వచ్చునట్లును, ఒక పదము తన సొంత వెలుఁగుతో నిరుగుపొరుగువానికి జీవముపోయునట్లును, ఇరువైపుల పదములు నడుమనున్న మూఁగదానికి మేలిమాటలు నేర్పునట్లును, దంటలుగూర్చి చెండులుగట్టి వింత సోయగముతో విన్నాణములఁ దీర్చినాఁడు. అన్నింటను దెనుఁగుదనము, తియ్యఁదనము నిండి తొనికిసలాడు నట్లు పుంజుకొన్నాఁడు. భారతరచనలోఁ గవిబ్రహ్మ చేసిన శబ్దసృష్టి అనన్యసామాన్యమైనది. ప్రబంధ పరమేశ్వరుఁడు ఈ రచననుగూర్చి "తన కావించిన సృష్టి తక్కొరులచేతన్ గా"దని ప్రశంసించినాఁడు. తిక్కన యీ తెలుఁగునుడికారమునకు భారతమంతయు నుదాహరణమే. ఇదియని దేని నెత్తిచూపఁగలము!

ఈ పద్యముఁ జిత్తగింపుఁడు:—

"ఇది గడు ముద్దరాలు; పను
  లేమియుఁ జేయఁగనేర; దెంతయున్
మృదు; వొక కీడుపాటునకు
  మేకొనఁజాల; దుదాత్తచిత్త; యొం
టిఁ దిరుగు దాని కోర్వ;దొక
  టిన్ దనుఁదా సవరించుచొప్పెఱుం
గదు; తగ నొండులన్ గొలువఁ
  గా వెఱనెమ్మెయిఁ గల్గునక్కటా !"

ఇట్లని తిక్కనకు సంస్కృతరచన సహింపదని, చేతఁగాదని యనుకోఁగూడదు. సందర్భమునుబట్టి సంస్కృతము నెంతో గంభీరముగా నడుపఁగలఁడు.

"దుర్వారోద్యమబాహువిక్రమరసా
  స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీరనిర్మథన వి
  ద్యాపారగుల్ మత్పితుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దో
  ర్లీలన్ వెసన్ గిట్టి, గం
ధర్వుల్ మానముఁ బ్రాణమున్ గొనుట త
  థ్యం బెమ్మెయిన్ గీచకా !"

ఒకప్పు డన్నియు సంస్కృతదీర్ఘ సమాసములే కూర్చును. చూడుఁడు:-

"భీష్మద్రోణకృపాది ధన్వినికరా
  భీలంబు, దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరా
  కీర్ణంబు, శస్త్రాస్త్రజా

లోమస్ఫార చతుర్విధోజ్జ్వలబలా
త్యుగ్రం, బుదర్ణధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిది యేఁ
జేరంగ శక్తుండనే!"

మఱియొకప్పుడు విడివిడి సంస్కృతపదములతో నడచుచుఁ దటాలునఁ దెనుఁగునడకలోనికి దిగును: చూడుఁడు:—

"అకుటిలుఁ, డార్యసమ్మతుఁ, డ
హంకృతిదూరుఁడు, నీతినిర్మలా
త్మకుఁ, డనవద్యశీలుఁడు, స
ధర్ముఁడు, దాంతుఁడు, గొంతిముద్దుసే
యుకొడుకు, మేను లేఁత, తన
యుల్లము మెత్తన; యిట్టియాతఁ డె
ట్లొకో యొరు నాశ్రయించు! విధి
యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్ !"

మఱియొకసారి తెలుఁగునుడుల కూర్పు నందముగ నడుపుచు నడుమనడుమ సంస్కృతపదముల నదుకుట యదొక వింతగా నుండును.

"తగవునఁ బోక రాజు బెడి
దంబులఁ బల్కెనయేని సైఁచి యొ
ప్పుగ నిలుమీ! గురుత్వము ప్ర
భుత్వమునున్ గల పెద్దనారి మా
ట గొనమి యాసుయోధను క
డన్ నిలువన్, మనమెల్ల గారవం
బుగఁ గురువృద్ధుపల్కుతల
పున్ జననిచ్చిన మెచ్చరే జనుల్ !"

తిక్కనార్యుని విచిత్రవిహారములతో నిట్లెంత సేపైన నానందింపవచ్చును. కాని మనకు వ్యవధి చాలదు. అక్షరధ్వన్యాత్మకముగా వీనులవిందు సేయుచున్న యీ బాహ్యసౌందర్య మింత కమనీయముగదా! ఇఁక భావార్థగౌరవాది పరిపాక పరిణతమైన ఆంతర మాధురి నాస్వాదింతము. అది యొక చిద్విలాసము! తిక్కన యెంత గంభీరార్థమునైనను తేఁటగాఁ బిడిచి యియ్యఁగలఁడు—తేలికగా నొలిచిపెట్టఁగలఁడు. ఎంత సామాన్యవిషయముపైనైన వెలితిపేదఱికములు లేక గంభీరోపన్యాసము చేయఁగలఁడు. చెప్పవలయునది మానఁడు—మానఁదగినది చెప్పఁడు. చెప్పునప్పటి యా మెలఁకువ యాయనతోనే పుట్టిన దనవచ్చును. విషయము నెత్తికొనుటలోనే యొక క్రొత్తపోకడ. నడుమ నడుమఁ దానే యొక ప్రశ్న వేసికొని సమాధానముఁ జెప్పికొనుచున్నట్లుగాఁ బోవును. ఒక విచిత్రమైన కాకుస్వరముతో బ్రహ్మాండమైన భావమును బెల్లగించును. మొగము చూచుచు మనసుతో మాటలాడును. మనసు గిల్లుచు మొగమున నవ్వును. ఇష్టానిష్టము లేవియు వాచ్యముగఁ జెప్పక యేఁతలయూపుతోనో, కన్బొమ కదలికతోనో, పెదవులు విప్పుటతోనో సూచించును. ఏ విషయముఁ జెప్పుచున్నను ఆ సందర్భమునకు నాపాత్రమునకుఁ దగినట్లుగాఁ దనదే యొక ముద్ర వైచి, ఆలంకారికులు చెప్పిన ఉక్తివైచిత్ర్యముల కన్నింటికిని—భరతముని చూపిన యభినయ విశేషముల కన్నిటికిని ఉత్తమ లక్ష్యముల నిచ్చుచుండును. అన్నిటికంటె నాయనసందర్భశుద్ధియు, ఔచితీపోషణము ఒరవడిగా గ్రహింపఁదగినవి. ఒక ఘట్టమును దేనినైన వర్ణింపవలసివచ్చినపుడు కథను, సన్నివేశమును రెండు మాటలతో సూచించి అది యొక రంగముగాఁ గల్పించును. సంభాషణక్రమములోఁ దక్కిన సంగతులన్నియుఁ బాత్రలనోటనే పల్కించును. అది శ్రవ్యకావ్యమే యైనను పద్యమయమైన దృశ్యకావ్యముగాఁ జిత్రించి మన కన్నులయెదుటఁ బెట్టును. ఈ నాటకఫక్కిరచనలోఁ దిక్కనపైపుణ్య మద్వితీయము. తర్వాతి కవులలో ఈ ఫక్కి సాధించినవారు చాల తక్కువ. తిక్కనకవితాశిల్పము నిట్లే తడవికొనుచు నెంత దూరమైనను సంతోషముతోఁ బ్రయాణము చేయవచ్చును. ఉదాహరణముగ నెన్ని పద్యములైనఁ జూపవచ్చును. మచ్చున కొకటిరెండు చిత్తగింపుఁడు:—

"ఆపద గడపం బెట్టఁగ,
నోపి శుభంబైనదాని నొడఁగూర్పఁగ మా
కీపుట్టువునన్ బాండు
క్ష్మాపాలుఁడు నిన్ను జూపి చనియె మహాత్మా!"

ఇందు పూర్వార్ధము సాధారణము. ఉత్తరార్ధమునఁ బ్రతియొకపద మెంతో భావమును గర్భీకరించుకొన్నవి. "మేము తండ్రిలేని బిడ్డలము. అన్నివిధముల నీవే మా కాదరువు"అని ధర్మరాజు చెప్పుచున్నాఁడు. అవును: మానవుఁడు తా నెన్నిరీతుల నెంత పెద్దవాఁడైనను ఈశ్వరునియెదుట నింతటివాఁడుగనే నిలఁబడును గదా! "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ"

అను భాగవతధర్మమిదియేగదా! "ఈపుట్టువునన్" అన్నప్పుడు "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అను గీతావాక్యము ధ్వనించుచుండలేదా! "పాండు క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె"—ఈ చూపిచనుటలో ఒప్పగింతయు, పాండు క్ష్మాపాలుని యందలి పితృకర్తవ్యమంతయుఁ గృష్ణునిపై మోపుటయు నెంత సుకుమారము! మఱియు "గురూపదేశమునఁగాని యీశ్వరునిఁ గనుఁగొనఁజాలఁడు. తానసహాయుఁడైనపుడుగాని యీశ్వరునివైపు మనసు త్రిప్పఁడు" ఈ భావము లెంత గంభీరముగా ధ్వనించుచున్నవి! "మహాత్మా"—"నీవు పరమాత్ముఁడవు-నేను జీవుఁడను. ఈ జన్మమున గురూపదేశమున నిప్పుడే ఆత్మ సాక్షాత్కారము చేసికొనుచున్నాను"-ఈ భావమెంత సంప్రదాయసిద్ధమైనది! పద్యము కథచెప్పుచున్నను, తిక్కన పదప్రయోగము ఈ సందర్భమున హృదయతంత్రుల నన్నింటిని గదిపి మధురభావాలాపన చేయుచున్నది.

"మనమునఁ బక్షపాతగతి
మాదెస మానుము; ధర్మనీతివ
ర్తనములు రెండు దిక్కులహి
తంబును పెంపును గల్గునట్టి చొ
ప్పున విదురాదిసజ్జనుల
బుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పున పగుసందనంబునను
భూపతులెల్ల నెఱుంగనాడుమీ!"

ధర్మరాజు స్వకార్యమునే చెప్పుచున్నాఁడు. అయినను "మా దెస పక్షపాతము వలదు-ధర్మనీతి వర్తనములు-రెండువైపుల హితముపెంపు గల్గునట్టి చొప్పు గమనించియే నడువు"మని అసిధారావ్రతముగా ములు ముగ్గనిరీతిగా ధర్మమునేచూచి పల్కు అతని యుదాత్తత యెట్లున్నదో చూడుఁడు! పోనీ-స్వకార్యమున నేమఱుపాటు గలదా? "విదురాదిసజ్జనుల బుద్ధికి రాన్-ఉచితంబుతోడి మెల్పునన్-పగుసందనంబునను-భూపతులెల్ల నెఱుంగన్"—ఈపదము లన్నియు ఒకవైపు న్యాయపక్షమును సమర్థించుచున్నను, మఱియొకవైపు ప్రతిపదము స్వకార్యసిద్ధికొఱకుఁ బ్రత్యేకప్రయోజనముల గర్భీకరించుకొని సుకుమారముగ సూచన లిచ్చుచున్నవి.

"మమ్మెఱుఁగు,దెదెరి నెఱుఁగుదు;
నెమ్మియెఱుఁగు, దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి యెఱుఁగుదు,
పామ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులుసెప్పన్"

"అన్నియు నీవే యెఱుఁగుదువు; నీకు బుద్ధులు సెప్ప నే నెంతటివాఁడను, పోయిరమ్ము" అనుచున్నాఁడు ధర్మరాజు. పాపము! తా నేమియు నెఱుఁగఁడఁట—చెప్పవలసిన దేమియు లేదఁట! ఇంకను జెప్పవలసినదని యేమే మనుకొన్నాఁడో! ప్రతియొక చిన్నవాక్యమునందును దాను జెప్పవలసినదంతయుఁ గొసరుముగ్గలతో నూఁది చెప్పుచునేయున్నాఁడు. పైఁగాఁ జల్లగా సమ్మోహనాస్త్రమును బ్రయోగించుచునేయున్నాఁడు. ఔరా! చాతుర్యము! "బుద్ధులు సెప్పన్"అని ఒక ఛలోక్తి విసరుచు-"ఎఱుఁగుదు"అను ప్రతిచోటను "ఎఱుఁగుము" అని మార్చి చదువుకొమ్మని ఉపాధ్యాయునివలె సూచించుచుఁ గృష్ణుని హృదయములోనికిఁ దొంగిచూచుచున్నట్లు లేదా! తిక్కన ఉక్తివైచిత్రి యంతయు భారతము నిండ నిట్లే యుండును. భారతమున నుద్యోగపర్వము—అందు కృష్ణరాయబారము ఇట్లే ప్రత్యేక జాగరూకతతోఁ జదువఁదగినవి. ఈ ఘట్టమున ద్రౌపది ఒక యసాధారణ వ్యక్తి. పరాభవమును బొందిన భారతవీరపత్ని—భారతవీరమాత; ఈమెకు వ్యాసుఁడు పురుడుపున్నెములు తీర్చి పెంచి పెద్దచేసినను, తిక్కన తీర్పులో ఆమెకు ఆర్యత్వము, ఆంధ్రత్వము నిలువెల్ల వెలసినవి. కథలో ద్రౌపది పాండవపంచకమునకు ధర్మపత్ని—భావములోఁ బ్రాణపంచకమునకు జీవశక్తి. భారతకథా జీవయాత్రలో నామె ఇచ్ఛాశక్తి-జ్ఞానశక్తి-క్రియాశక్తి స్వరూపిణియై ప్రవర్తించినది. స్వరాజ్యసిద్ధికై రాయబారము పంపునపు డామె పాండవులకుఁ, గృష్ణునకు నడుమ నిలిచి జీవాత్మకుఁ, బరమాత్మకు నడుమ ఆదిశక్తియై అద్భుతవిహారము సలిపినది. ఆయావిశేషము లన్నియు భావుకులు, రసజ్ఞులు భారతమును ప్రత్యేకముగాఁ జదివి ప్రతిపద్యమునను చవిచూడఁగలరు. ఇట్లే భారతమున విరాటపర్వ మొక ప్రత్యేక కావ్యమనఁదగినది. అజ్ఞాతవాసముతోఁ బ్రారంభమై ఉత్తరా వివాహముతో మంగళాంతముగా ముగిసినది. మహాకావ్యత్వసిద్ధినంతయు నందుఁ జూడఁగలము. అందలి పాత్రపోషణము, రసపుష్టియు మిక్కిలి హృద్యములైనవి.

ఇతివృత్తమునందలి పాత్ర లేవి యెప్పు డెట్లు నడుచుకొన్న స్వభావసిద్ధులై మన యనుభవములను దలంపునకుఁ దెచ్చుచుండునో అట్లు చిత్రించుట పాత్ర పోషణము. భారతరచనయం దీకార్యము మిక్కిలి కష్టమైనది. ఎందుకనఁగా: అది యొక సముద్రమువంటి గాథ. పాత్రలు అసంఖ్యాకములు—వివిధములైన అర్హతలు, అంతరములు గలిగి, ఒకటిరెండు తరముల వఱకు కథవెంట నడచినవారు పెక్కురు గలరు. ఆయా సన్నివేశములలో ఆయాదశలలో వారివారి భావరూపచేష్టాదులను భావనాపథమునఁ జిత్రించుకొని, అందరి జాతకచర్యలకు సహజమైన, అనుభవసిద్ధమైన ఫలితములు వ్రాసిచూపుట చిన్నపని కాదు. తిక్కన నిజమైన దైవజ్ఞుఁడు-నైష్ఠికుఁడు. కావుననే తనకు రావలసిన సంభావన యెట్లున్నను దాను జేయవలసిన పని ఉత్తమముగా నిర్వహించి కృతార్థుఁడైనాఁడు. పలుతావుల మూలమున కెన్నో మెఱుఁగులు దిద్దినాఁడు. కొందఱు ద్రౌపదీ పాత్రపోషణమునందు వ్యాసుని-నన్నయను-తిక్కనను-పోతనను బోల్చుకొని హెచ్చుతక్కువలు కొలుచుచుందురు. కాని వీరందఱు నొక శకమువారా, ఒక శతాబ్దివారా? ఒక తరమువారిలోనే ఎన్నో మార్పులు మనము చూచుచున్నాముగదా! కనుకనే యెవరి గొప్పను వారిలోఁ జూచి సంతోషించుటే మంచిది.

తిక్కన భారతాంధ్రీకరణము మూలమునకు సరిగా లేదనియుఁ, గొన్నిచోట్ల వికృతమైన దనియుఁ గొందఱు విమర్శించినారు. ఇది సాహసము. భారతమును 'మక్కికిమక్కి'గా వ్యాఖ్యానాంశములతోఁ గూడఁ దెలుఁగునఁ బెట్టితినని తిక్కనయుఁ జెప్పలేదు. అది స్వరసమును గాదు. ఆ కాలమున నెవరి యాంధ్రీకరణపద్ధతియు నట్టిది కాదు. మూలమునకు స్వేచ్ఛానువాదస్వాతంత్ర్యమే యందఱు నవలంబించిరి. వారిలోఁ దిక్కన యగ్రగణ్యుఁడు-సిద్ధహస్తుఁడు. కథాసంవిధానము, పాత్రౌచితి, సందర్భశుద్ధి-ఏదియుఁ గొఱత పడకుండఁగనే చక్కఁగఁ దీర్చినాఁడు. భారతమును జదువునప్పు డందలి పాత్ర లేదో కథ నడుపుచున్నట్లు గాక, అందలి బ్రదుకు తాము బ్రదుకుచున్నట్లుగాఁ దోపించి, మన హృదయానుభవములను మేల్కొల్పుచు వారితో మనకుఁ దాదాత్మ్యము గలిగించుచుందురు. తిక్కన తన పాత్రలకు ఇట్టి జీవకళ పోసి నిర్మించినాఁడు. కనుకనే అతని రచనలో భారతము కావ్యమైనది. అప్పుడుగూడ నది తన ఇతిహాసత్వము, పంచమవేదత్వము పోఁగొట్టుకొనలేదు. మీఁదుమిక్కిలి ఆయన తెనుఁగు పలుకుబడిలో మెదిగి అందలి సర్వసామగ్రియుఁ దెలుఁగువారి సొమ్మైనది. ఆ భారతవీరులు-వీరమాతలు మన కుటుంబములోనివారైనారు. భారతధర్మము మనయింటి యాచారమైనది. మన తెనుఁగుతోఁట నందనోద్యానమై పరిమళించి ఫలించినది. తిక్కనయే భారతము నాంధ్రీకరించియుండనిచో-లేక 'మక్కికిమక్కి'గాఁ జేసియున్నచో ఆంధ్రజాతికి, ఆంధ్రభాషకు నిజముగా నెంతనష్టము కలిగియుండెడిది! ఆ పరమస్వతంత్రుని ఆ తెలుఁగుఋషిని దీవించి, ఆయన చేతినుండి ఆంధ్రభారతమును దనచేతఁ బెట్టించుకొని, దానిని మన చేతిలోఁ బెట్టి మనకు, మహాసాహిత్యభాండారమును బ్రసాదించిన ఆ హరిహరనాథునికి ఆంధ్రజాతి యంతయుఁ దీరని యప్పు పడియున్నది.

కొందఱు "తిక్కనకు సంస్కృతము రాదు, ఆయన పాత్రౌచిత్యముఁ జెఱచినాఁడు, భావస్ఫోరకముగా వాక్యరచన చేయలేఁడు" ఇట్లే కొంత విమర్శ చేసియున్నారు. తిక్కన అందందు తన రచనలో నిరువది నవ్వులు నవ్వినాఁడఁట. వానిలోఁ గొన్ని ఈ విమర్శనములకు బదులు సెప్పఁగలవు.

ఆంధ్రసాహిత్యమున నున్నతోన్నత స్థానము నాక్రమించిన మహాభారతసాగరమును గడముట్ట నీఁది పూర్ణకాముఁడై, సుప్రసన్నహృదయముతోఁ జేతులు జోడించుకొని "హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁ జూడు మెప్పుడున్"—అని స్వామి యెదుట నిలిచి వేఁడుకొనుచున్న ఆ కవిబ్రహ్మకు-మన తిక్కనసోమయాజికి భక్తిపూర్వకముగ ధన్యవాదము లర్పించుచున్నాను.

(నెల్లూరులోని వర్ధమాన సమాజమువారు ఇటీవలనే జరిపిన 'తిక్కనజయంతి' సందర్భమున చదువబడిన వ్యాసము)



# కీ. శే. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

(పుణ్యస్మరణ)



— శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ —

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు లింగైక్యము పొంది తొమ్మిదేళ్ళ యినది.

శ్రీపంతులుగారు ఆంధ్ర దేశానికి చేసిన సేవ ఇంతా అంతా కాదు; అపారమైనది. ఆంధ్ర పత్రిక పెట్టి "ఆంధ్రం మాటాడేవారందరూ, ఆంధ్ర దేశ వాసులందరూ ఐక్యం కావాలి; ఆంధ్ర దేశం ఒక ప్రత్యేక రాష్ట్రం కావాలి. ప్రత్యేకాంధ్ర రాష్ట్రం లేనంతవరకు ఆంధ్రులు అభ్యుదయం పొందలేరు." అని ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకతను మొట్టమొదట తన పత్రిక ద్వారా ఎలుగెత్తి చాటిన మహనీయు డాయన.

నాగేశ్వరరావు పంతులుగారు తనజీవిత మంతా ఆంధ్రాభ్యుదయం కోసమే పాటు పడ్డారంటే అది అతిశయోక్తి కాదు. ఆంధ్ర దేశం ముక్తకంఠంతో ఈమాట చెప్పింది; ముందు చెప్పగలదుకూడాను. ఆయన ఏ పని చేసినా ఆంధ్రుల అభ్యుదయంమీద, పురోభి వృద్ధిమీద లక్ష్యముంచే చేసేవారు. ఆంధ్రుల కళాసంస్కృతులు చాలా గొప్పవి; మళ్ళీ ఆంధ్రకళ విశిష్టత గడించాలి. ప్రాచీనాంధ్ర సాహిత్యం చాలా గొప్పది. నేటి పరిస్థితు లలో హృదయంగమమైన నవ్య సౌందర్యం సేకరించుకొని నవ్యాంధ్ర సాహిత్యముకూడా తోడి దేశభాషాసాహిత్యాలలో గొప్ప పేరు సంపాదించాలి; ఆంధ్ర సంస్థలలో ఆంధ్రుల వ్యాపారనిర్వహణప్రజ్ఞ కానరావాలి; ఆంధ్ర సంస్థలద్వారా ఆంధ్ర దేశ ఔన్నత్యం లోకా నికి విశదం కావాలి; ఈ ప్రజా ప్రభుత్వ

యుగంలో ఆంధ్రులలో రాజకీయ పరిజ్ఞానం వృద్ధిపొందాలి; కుల భేదము, మత భేదము ఆంధ్రుల రాజకీయాభివృద్ధికి ఆటంకం కారాదు-అని ఈ విధమయిన ఆశయాలతో శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు తమ జీవితసర్వస్వాన్ని ఆంధ్రదేశానికి సమర్పించారు. పంతులుగారి జీవితానికి ఈ ఆశయాలే మూల సూత్రాలు. ఇది అర్థమైతే ఆయనజీవితం మనకు సుబోధకమవుతుంది.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి ఆర్థిక సాహాయ్యం పొందని ఏ సంస్థాలేదు ఆంధ్ర దేశంలో. ఖాదీనిర్మాణ సంస్థల కెన్నెన్నిటికి సాయం చేసినారో చెప్పలేము. ఆ విధంగానే దేశంలో విద్యావ్యాపనానికి పాటుపడే గ్రంథాలయా లెన్నిటికి ఆర్థిక సహాయము చేసినారో పంతులుగారు. శ్రీ పంతులు గారి సాహాయ్యసంపత్తిని ఏదో విధంగా బడసిన సాహిత్య సంఘాలూ ఉన్నవి. చెన్నపట్నం వచ్చి పంతులుగారి మెప్పూ, గౌరవమూ పొందని ఉత్తమ ఆంధ్రనటులుకాని, నాటక సంఘాలుకాని అరుదు. తమకు తోచినరీతిని యువచిత్రకారులను ప్రోత్సహించారు; నవ్య యువకవులను ప్రశంసించారు; తెలుగునాటిలో బయలుదేరినప్రక్రొత్తఉద్యమముగాని, తెలుగువారి అభ్యుదయానికి కృషిచేసే ఏ సంస్థకాని శ్రీ పంతులవారి ఆదరానికీ, అభిమానానికీ లక్ష్యంకాకుండాపోలేదు. అట్టిది పంతులవారి ఆంధ్రత్వము; అట్టిది పంతులవారి ఆంధ్రాభిమానము. శ్రీ పంతులవారు తమలో ఆంధ్ర దేశాన్నీ, ఆంధ్రదేశములో తమనూ సందర్శించిన మహానుభావులు, పుణ్యమూర్తులు.

నిజమే, శ్రీ నాగేశ్వరరావు పంతుల వారిది అఖండ ధనజాతకం. ఆయన పట్టినదల్లా బంగారమయ్యేది. అయితే అఖండ ధనజాతకు లెందరు లేరు? జమీనుదారులు వేలూ లక్షలూ రాబడివచ్చేవా రెందరులేరు? కాని అందరికీ శ్రీ పంతులవారికున్న ఆశయము లున్నవా, లక్ష్య మున్నదా ? ఉన్నప్పటికీ వారు తమ ధనాన్ని శ్రీ పంతులవారి వలె సద్వినియోగంచేసినారా? చేయగలిగినారా? ఆ సాహసం అందరికీ రాదు. పంతులవారిది సంపాదనలో ఎంతటి దీక్షో సంపాదించిన ధనాన్ని త్యాగము చేయుటలోను అంతటి దీక్షే; ధనసంపాదనలో ఎంతటి మమతో త్యాగంచేయుటలో అంతటి నిర్లిప్తత. అదొక మహాగుణము. శ్రీ పంతులవారు ఒక మహాత్యాగశీలి. తిరుగ వర్షరూపముగా భూమికిచ్చివేయుటకే లోకబాంధవుడు సముద్రోదకమును సంగ్రహించేటట్టు శ్రీ పంతులుగారు కూడా వ్యాపారవిధానములో ధనమురాబట్టి ఆంధ్రాభ్యుదయము కోసము అనేక విధముల దానిని వెచ్చించారు. ఆ దానవీరుని త్యాగ సంపద కారణముగానే నేడాంధ్రదేశము ఇప్పుడున్న స్థితికి వచ్చినదంటే అది అతిశయోక్త్యలంకారము కాదు; పరమసత్యము.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు రాజకీయాలలో పనిచేశారు; గ్రంథాలయోద్యమ సభలలో పాల్గొన్నారు; గాంధీ మహాత్ముని సత్యాగ్రహోద్యమంలో ప్రచారంచేసినారు; ఆంధ్రుల సాహిత్య, రాజకీయ పరిజ్ఞానాభివృద్ధికి భారతి, ఆంధ్రపత్రికలు స్థాపించి కృషిచేశారు. చివరకి గాంధీమహాత్ముని ఆదేశానుసారము కారాగారముకూడాఅలంకరించారు. ఆయన ఆంధ్రదేశంలో తిరగని ప్రాంతంలేదు; అధ్యక్షత వహించని సభలేదు; ఆంధ్రాభ్యుదయం కోసం చేయని కృషిలేదు. ఆంధ్రుల

ఆనందము ఆయనఆనందము; ఆంధ్రుల విచారము ఆయనవిచారము.

ఆయనది నిత్యమూ సంతోషమే, నిత్యమూ విచారమే; నిత్యమూ ధనికతే, నిత్యమూ దారిద్ర్యమే; నిత్యమూ సంపాదనమే, నిత్యమూ త్యాగమే; నిత్యమూ ఐహిక లంపటతయే, నిత్యమూ తాత్విక విచారమే; నిత్యమూ ఐహికాసక్తే, నిత్యమూ ఆధ్యాత్మికదృష్టే - ఆయన పరమయోగి; ఆయన లోకారాధ్యుడు, ధన్యమూర్తి.

శ్రీ నాగేశ్వరరావు పంతులు గారు నవ్యాంధ్ర జాతీయ నిర్మాతలలో ఒకరు. ఈ విషయము కాదనేవా రెవరూ ఉండరు. తమకై, తమ అభ్యుదయానికై ప్రాకులాడిన, కృషిచేసిన శ్రీ నాగేశ్వరరాయని ఆంధ్ర లోకం ఎంతలో విస్మరించింది? తన వీరులను, తన జాతీయ సేవకులను, తన సాహిత్యనిర్మాతలను, తన జాతీయాభ్యుదయ కారకులను విస్మరించే జాతికి, గౌరవించని జాతికి ఎక్కడా ఏనాడూ అభ్యుదయమూ లేదు; అభివృద్ధీ లేదు. ఆంధ్రు లిది యెరిగి ప్రవర్తించవలసిన విషయం. మన జాతీయ వీరులను, జాతీయ మహాపురుషులను మనం గౌరవించుటలేదంటే అది వారికి గాదు, మన ఆత్మగౌరవాభిమానాలకే లోటు; మనకింకా సమ్యగ్దృష్టి కలుగ లేదనీ, మన మనస్సు ఇంకా సంస్కారము పొందలేదనీ దాని అర్థము. మనిషిచేసే, జాతి చేసే సర్వప్రయత్నాల లక్ష్యమూ ఆత్మ సంస్కారానికే, ఆత్మోన్నతికే. స్వరాజ్యమయ్యేది, అభ్యుదయ మయ్యేది ఈసంస్కారం మనం పొంది ఆత్మోపలబ్ధి పొందడానికీ, మనం తరించడానికీని. మనంచేసే ప్రతిప్రయత్నమూ ఇందు కుపకరించపోతే, మనఉద్యమాలూ, వివిధరంగాలలో మనముచేసే కృషీ మనలో ఈసంస్కారము కలిగింపలేకపోతే— ఆధునికయంత్ర సంపదతో, వైభవభోగ్యములతో తులతూగుతూ ఉన్నా—మనమింకా అనాగరిక స్థితినుంచి బయలుపడలే దన్నమాట.

శ్రీనాగేశ్వర రావు పంతులుగారి ఋణ మెప్పటికైనా తీర్చుకోగలదా ఆంధ్రదేశము? ఇప్పటికైనా ఆంధ్రదేశము శ్రీ నాగేశ్వర రావు పంతులుగారికి చూపవలసిన రీతిని ఆయనయెడల తన కృతజ్ఞతను చూపి గౌరవించినదా సముచితరీతిని? ఆయనను ఏటేటా కృతజ్ఞతతో స్మరించనైనా స్మరిస్తున్నదా? ఈనాడైనా ఆంధ్రులు ఈవిషయము నొక్కమారు ప్రశాంతముగా కూర్చుండి ఆలోచిస్తే చాలు, తన కర్తవ్యమేమిటోతలపోస్తే చాలు.

శ్రీ నాగేశ్వరరావు పంతులు గారు మహాపురుషుడు; మన మాయనను కృతజ్ఞతతో సంస్మరించాలనీ, గౌరవించాలనీ పాటుపడినవాడు కాదు ఆయన. అది తన ధర్మమని ఆయనవిధి ఆయన నిర్వర్తించాడు. ఆయన ఎవరికోసము తన జీవితసర్వస్వము సమర్పించాడో అట్టి మనముకూడా అనుష్ఠించవలసిన ధర్మము లేదా? మనము కూడా మనవిధి నిర్వర్తించవద్దా ?

# ఢిల్లీలో జరిగిన అఖిల-ఆసియా మహాసభ చిత్రాలు



పురాణఖిల్లా, ఢిల్లీ

ఈ చారిత్రక భవనాలలోనే గతమాసాంతాన అఖిల ఆసియా మహాసభ దిగ్విజయంగా జరిగింది.



మహాసభకు అధ్యక్షత వహించి ప్రసంగిస్తున్న శ్రీమతి సరోజినీ దేవి.

# ఉత్తరగోగ్రహణము

[నాటిక]

శ్రీ సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మ

## ౧

### విరటురాచనగరు : విలాసభవనము

[రాజకుమారుడు ఉత్తరుడు—విలాసపురుషుడు; కళాప్రియుడు; తదేకదీక్షతో ఏదో చిత్తరువు వ్రాయుచుండును.

రాజకుమారి ఉత్తర; సఖులు వేర్వేరుపనులపై నుందురు. ఒకతే సన్నగా రాగముతీయుచు పాడుచుండును.]

ఏమే గులాబీ

ఏమే గులాబీ ! !

ఏమే !

వేరొకతె—(ఆనందంతో) అబ్బ ! నా హంస నడక నీ పాటకు సరిగా తాళం వేస్తోందే.

ఎవరే ఇచ్చినదీ

నీ కీఅందం.

చిలుక—అందం ! !

ఇంకొకతె—ఆ ! ఆ ! అట్లా.

ఏమే నీపరిమళయా

ఆఆఆఆఆఆఆ

ఉత్తర—(వికటముగా) ఆఆఆ! ఏమి టా నీ తలకాయపాట.

ఉత్తరుడు—(చురుకుగా, కొంచెం కోపంతో) అదిగో, అట్లా అనవద్దనే ఎన్నోసార్లు చెప్పినాను. ప్రతి వ్యక్తీ తనకు ఏకళయందు అభిరుచి వుంటే అది అభివృద్ధిపరచుకొని, దాని ద్వారా తన జీవితమును సౌఖ్యవంతం చేసికొనవలెను. దానికి అటువంటి పాటలంటే ఎక్కువ యిష్టం. అవి పాడకపోతే దాని జీవితానికి సంపూర్ణసౌఖ్యం ఉండదు.

ఉత్తర—పాపం ! ఇట్లాంటి పిచ్చిపాటలు పాడుతూ, అనవసరమైన పనులు చేస్తే ఆనందం కలుగుతుందికదూ ? లేకపోతే జీవితమంతా వృథాయే ?

ఉత్తరుడు—ఔను. ప్రతివ్యక్తీ ఎప్పుడూ ఆనందంకోసమే ప్రాకులాడుతాడు. ఆనందమేకదా జీవితాశ. ఒకవ్యక్తి తన జీవితంలో ఎంత ఆనందం, ఎంతసౌఖ్యం అనుభవిస్తాడో అతనిది అంత ఉత్తమజన్మ అన్నమాట.

ఉత్తర— మరి జీవితంలో ఆనందం, సౌఖ్యం అనుభవించలేనివారు వుంటే ? వారిది నీచజన్మ అంటావా ? వారు అట్లా ఎందుకు ఉండాలి ?

ఉత్తరుడు—అది వారివారి పూర్వకర్మానుసారంగా ఉంటుంది. ఎవరు ఎంత సౌఖ్యం అనుభవించటానికి అర్హులో దానికి తగిన చోట జన్మపొందుతారు.

ఒకతె—అవును. ఇప్పుడు మన సంగతి చూచుకో. మీరు రాజబిడ్డలై జన్మించారంటే దానికి మీరు పూర్వజన్మలో చేసిన పనులనుబట్టి అర్హులన్నమాట. మేము మీసేవ చేసి యింత ఆనందం పొందుతున్నామంటే పూర్వజన్మలో ఏదో కొంత మంచి, పుణ్యం చేసి ఉంటాము. కాని, చూడు, ఆ బీదవాళ్లు అంత దుఃఖంలో ఉన్నారంటే అది వారి పూర్వకర్మను బట్టే అయివుండాలి.

ఉత్తర—అయితే, మా ఆచార్యులవారు మరి అల్లా చెపుతారే ? జీవితానికో ఆదర్శం వుండాలనీ, మానవుడు తనలో వున్న కళను ఆ జీవితధర్మాన్ని,

ఆదర్శాన్ని సరిగా నిర్వర్తించేందుకు తగినట్లుగా అభివృద్ధిపరచుకోవాలనీ ఏమో, ఏమో.

ఒకతె—అంటే ?

ఉత్తర—ఊఁ. రాజుగా జన్మించినవాడు తన సౌఖ్యంకన్న తన ప్రజలసౌఖ్యమే ఎక్కువగా చూడాలనీ, తన ప్రజలకు మార్గదర్శిగా వుండాలనీ, ఎప్పుడూ అతడు ప్రజాభీష్టాన్నే నెరవేర్చాలనీ, అట్లానే రాణి కూడ వుండాలనీ, పూర్వజన్మలో చేసిన కర్మల బట్టి అలా వుండగలగని తోచినవారినే భగవంతుడు రాజ కుటుంబంలో పుట్టిస్తాడనీ, ఈజన్మలో అట్లా చేయక పోతే తర్వాత నీచజన్మ తప్పదనీ...

ఉత్తరుడు—మీ ఆచార్యుడూ, ఆయన నపుంసకత్వమూ! మొగా ఆడా కానివాడు చెప్పే మాటలు నమ్మమని ఎవడు చెప్పాడు ? తన తోక తెగిన నక్కట, అడవిలో నక్కలన్నింటిని తోకలు తెగకోసుకోమందట ! ఇదా ఆయన నేర్పుతున్న చదువు ? మరి ఆయన నాట్యం నేర్పటం ఏం ఉద్ధరించటానికి ?

ఉత్తర—నాట్యంకూడాను విలాసానికి కాకుండా జాతీయంగా వుండాలిట. నిరుత్సాహులైన ప్రజలలో కోరికలను రేకెత్తించటానికీ, వారిని కార్య నిర్వహణానికి ప్రోత్సహించటానికీ తగినటుగా నాట్యాన్ని మార్చివేస్తే, అది ఇప్పటివలె కొద్దిమందికి గాక, జనసామాన్యానికి రుచించి, దేశాభ్యుదయానికి చాలా ఉపయోగపడుతుందట.

(వార్తాహరుడు ప్రవేశము)

వార్తా—జయము. జయము. యువరాజా ! మన పట్టణమునకు ఉత్తరపొలములలో నున్న గోవులను శత్రువులు తోలుకుపోవుచున్నారు.

ఉత్తరుడు—మంచివార్త తెచ్చావు. ఉత్తర పొలములలోని గోవులా ? అవన్నీ కలిసినా నే గీచే యీ బొమ్మకనుబొమలంత విలువ చెయ్యవు. చూడు, ఆ చిలుకముద్దుమాటల అందం వాటి కేదీ ? ఆ హంస నడకలో వుండే ఠీవి వాటి కేదీ ? అయినా ఎవరో ఆవులను తోలుకుపోతుంటే సైన్యాధ్యక్షునికి చెపితే సైన్యం పోయి విడిపించుకురారూ ? ఇంతకీ అంత ధైర్యం చేసిన శత్రువు లెవరూ ? వాళ్లకి ప్రాణాలు దక్కవని తెలియదు కాబోలు, పాపం.

వార్తా—అవధరింపుడు, యువరాజా. ఇదివరకే దక్షిణమున నున్న గోవుల నన్నింటినీ తోలుకుపోతుంటే విడిపించటానికి మహారాజుగారు సర్వసైన్యసమేతులై వెళ్లినారు. ఇప్పుడక్కడ యుద్ధం జరుగుతున్నది. పట్టణంలోని సైనికులందరూ ఆ యుద్ధంలోనికి వెళ్లారు ప్రభూ. ఇప్పుడు పట్టణంలో ఒక్క సైనికుడుగాని సారథిగాని, రథంగాని లేవు ప్రభూ. అందువలననే తమకు మనవిచేసుకుంటున్నాను.

ఉత్తరుడు—అరే ! అందరూ ఆవులను తోలుకు పోయేవాళ్లను అడ్డగించటానికే ? అసలు అక్కడ వున్న గోపాలురూ, కావలివారూ చాలరూ వాళ్లను తరిమి వేయటానికి ?

వార్తా—కాదు ప్రభూ. కౌరవులందరూ బల సమేతంగా వచ్చి ముట్టడించినారు ప్రభూ. వారి సైన్యం ఎటు చూసినా అంతులేకుండా వుందండి. అందరూ బాగా ఆరితేరినవారు ప్రభూ.

ఉత్తర—అసలు పట్టణంలో కొంతమైనా లేకుండా అందరూ ఎలా వెళ్లారు యుద్ధానికి ?

ఉత్తరుడు—(గర్వంతో) ఆ ! వాళ్లకు తెలియదూ నేనున్నాననీ. నా ప్రతాపం ఎరుగరుకనుకనా ?

ఉత్తర—అరె. నువ్వు యుద్ధం చేయటం ఎప్పుడు నేర్చుకున్నావు ? యుద్ధం అంటే బొమ్మలు గీయటం, పాటలుపాడటం, నాట్యం చేయటంతో సమానమేనా ?

ఉత్తరుడు—అసలు ఒక వ్యక్తి ఒక కళలో ఎంత సమర్థుడో మిగతా అన్నికళలలోను అంతే సమర్థుడౌతాడు. నేను ఎంత నేర్పుతో బొమ్మలు గీస్తానో, అవసరమైతే అంత నేర్పుతో యుద్ధం చేస్తాను.

వార్తా—రక్షించాలి ప్రభూ. ఆలస్యం అయితే అక్కడ వున్న కొద్దిమంది ప్రాణాలూ పోతవి.

ఉత్తరుడు—నీవు పోయి సారథిని రథం పూన్చి తీసుకురమ్మను. ఓ. అందరూ యుద్ధానికే వెళ్లారన్నావు

కదూ. (విసుగుగా) అబ్బా. ఒక తగిన సం వుంటే కౌరవసేనయేగాదు, మూడుజగాలు ఎత్తివచ్చినా నిలిపివేయనూ? ఛీ! ఒక్కడూ లేకుండా పోవట మేమిటి?

ఉత్తర—మా ఆచార్యులు బృహన్నలవారు సారథ్యం చేస్తారుట అన్నయ్యా. ఇదివరకు ఆయన అర్జునునకే సారథిగా పనిచేశారట. ఇప్పుడు నీ వాయనను ఎందుకు తీసుకువెళ్లకూడదు?

ఉత్తరుడు—ఆ. నేనా? ఒక నపుంసకుని సారథిగానా? హాస్యాస్పదము. బృహన్నలసారథ్యమా? బహుశః ఇటువంటి సారథి వుండబట్టే అర్జునునకు సారథి అవుసరమే లేకుండాపోయింది.

ఉత్తర—అది కాదన్నయ్యా. ఆయనకు రథం నడపటం చాలా బాగా చాతవునని సైరంధ్రికూడ చాలా మార్లు చెప్పింది. ఎవరూ లేనప్పుడు ఆయనను ఎందుకు ఉపయోగించుకోకూడదు?

అందరు—అవును. ఇప్పుడు ఎలాగైనా శత్రువును జయించటం ముఖ్యం. మిగతావిషయాలు గమనించకూడదు.

ఉత్తరుడు—అబ్బ. సరే. మీరందరూ ఇంత గట్టిగా చెపుతున్నారుగాబట్టి సరే. ఐనా సారథి ఎవడైతేనేమి? నా పరాక్రమంముందు శత్రుసేన ఎంత?

ఉత్తర—నేను పోయి, సైరంధ్రితో యీ విషయం చెప్పి, ఇద్దరం ఆచార్యులవారిని ఒప్పించి రథం తయారుచేసి తెమ్మని చెపుతాము.

## ౨

## విలాసభవనము ముందు: రథముతో

## బృహన్నల

[లోపల ఉత్తరుడు యుద్ధమునకు పోవు వీరుని వలె వేషము. హడావుడిగా అటుయిటు తిరుగుచుండును. ఉత్తర చెలికత్తెలు, సైరంధ్రికూడా వుందురు.]

ఉత్తర—అయితే అన్నయ్యా, నువ్వు శత్రువులనందరినీ జయిస్తా వన్నమాటేనా?

ఉత్తరుడు—నా శక్తిమీద మీ కింకా నమ్మకం లేదులాగుంది. మీకే తెలుస్తుంది నావిజయోత్సవం జరిపేటప్పుడు. అంతకన్న ముందుగానే తెలుస్తుంది కౌరవులకు నా బాణాల శక్తి. పాపం, అమాయకులు పాండవులనుకొన్నారు కాబోలు.

ఉత్తర—మరి యుద్ధంలో బాణం నీకే తగిల్తే.

ఉత్తరుడు—అస లెప్పుడూ అట్లా జరగనేజరగదు. అది ఓడిపోయేవాడికి జరిగే పని. ఏమిటి ఇంత ఆలస్యం. రథం తయారైందేమో చూసిరండి.

(ఒక దాసి పోయి చూచివచ్చును)

దాసి—అయిందండి. బృహన్నలవారు తమ కోసమే ఎదురుచూసున్నారు.

(అందరు నడుతురు. ఉత్తరుడు హుషారుగా పెద్దపెద్ద అంగలు వేస్తూ ముందుగానే రథమును చేరును. బృహన్నలను చూసి కొంచెం అసహ్యంతో మొహం ముడుచుకొని, ఇష్టంలేనివానివలె రథం ఎక్కును. సఖులు ఉత్తరునకు హారతిఇత్తురు.)

ఉత్తరుడు—నేను యుద్ధంచేసి గెలిచివస్తాను. చూస్తానుగదా మీరు నావిజయోత్సవం ఎంత గొప్పగా చేస్తారో.

ఉత్తర—మరి యుద్ధం చేసి గెలుస్తావుకదా నాకేమి తెస్తా వన్నయ్యా.

ఉత్తరుడు—(నవ్వుతూ) పిచ్చిదానా. యుద్ధరంగంఅంటే ఏం బజారనుకున్నావా? అక్కడ తెగిన తలకాయలు, కిందపడిన కిరీటాలు, విరిగిపోయిన రథాలు, చచ్చిన ఏనుగులు, గుర్రాలు ఎన్నెన్నో వుంటాయి. విజయోత్సవమప్పుడు చెప్పు. నీ కేం కావాలో తెప్పిస్తాను.

ఉత్తర—మరి సైరంధ్రి చెప్పింది: దుర్యోధనుడు కిరీటంలో పెట్టుకునే తురాయి చాలాబాగుంటుందట. అది తెస్తే బొమ్మల పెళ్ళిళ్ళలో నాబొమ్మకి పెట్టుకుంటాను.

ఉత్తరుడు—ఓస్, ఇంతేకదా. తప్పకుండా తెస్తాను. ఇంకా ఏమడుగుతావో, రథం పట్టుకుందో

పట్టదో అనుకుంటున్నాను. భలే కోరికే కోరావులే. పోనీవోయ్ రథం.

(నిష్క్రమణ)

(ఊరి వెలుపలి బయలు. రథము తోలుచూ బృహన్నల; అటూ యిటూ చూస్తూ ఉత్తరుడు.)

ఉత్తరుడు—పోనీ. త్వరగా పోనీ. లేకపోతే శత్రువులు పారిపోగలరు.

బృహన్నల—అప్పుడే నగరం విడిచి చాలా దూరం వచ్చాము. ఇంకా త్వరగా పోతే గుర్రాలు అలసిపోయి, యుద్ధరంగములో సరిగా పనిచేయలేవు.

ఉత్తరుడు—(విసుగు, కోపముతో) సరి. సరి. బాగుంది నీ సారథ్యం. ఇక యుద్ధరంగంలో ఏమి చేస్తావో నాకు బోధపడటం లేదు. (దూరంగా ఏదో చూసి) అదేమిటి. అంత ఎత్తుగా లేస్తోంది ?

బృహన్నల—(నిర్లక్ష్యంగా) అదా? శత్రు సైన్యాలు కదులుతుంటే లేచిన దుమ్ము.

ఉత్తరుడు— ఆ! (ఆశ్చర్యంతో) సైన్యాలు కదులుతుంటే అంత దుమ్మా ! పెద్ద మేఘమల్లే వుంది.

బృహన్నల—మరి కౌరవసైన్యమంటే ఏమను కున్నారు. (ఇంతలో [illegible] యునకు దగ్గరగా వత్తురు. సైన్యము సరిగా కనుపించును.)

ఉత్తరుడు—అమ్మో, అంత సైన్యమే ! అన్ని గుర్రాలే ! అన్ని రథాలే ! అన్ని ఏనుగులే ! వీటన్నిటితోను నేను ఒక్కడనా పోరాడేది ? అమ్మో ! (మిక్కిలి భయంతో) అందరూ తలొక బాణం వేస్తే నామీద ఒక బాణాలపర్వతం నిలిచిపోదూ. అన్ని బాణాలు నా శరీరానికి తగిలితే అసలు చర్మం అనేది కనపడుతుందా ? (వణుకుతూ) అమ్మయ్యో, యుద్ధం వద్దు, ఏమీ వద్దు. బృహన్నలా, రథం త్వరగా వెనక్కు మరల్చు.

బృహన్నల— అదేమి యువరాజా! తమరు యుద్ధం చేసి జయించి వస్తారని అందరూ కొండంత ఆశ పెట్టుకొని వున్నారే. ఇప్పుడు తిరిగి వెడితే మనని చూసి నవ్వరూ ? మీ విజయోత్సవం జరపటానికి ప్రజలు ఎంతో సంబరంగా వున్నారే. ఇట్లా వెడితే మనకు ఏమి ఉత్సవం చేస్తారు?

ఉత్తరుడు—ఉత్సవం సంగతి తరువాత మాద్దాం. ముందు ఇంటికి పోనివ్వవయ్యా. ఇంత సేనతో నేనొక్కడనేనా యుద్ధం చేసేదీ. అందులోను ఇంతవరకు బాణం విడవటం ఎట్లాగో తెలియదే. ఏదో సరదాగా వుంటుందనుకున్నాగాని. బాబోయ్. నేను యుద్ధం చేయలేను. తిప్పు బృహన్నలా, వెనక్కు తిప్పు! (సరకు చేయక తోలుచుండును) అబ్బ, తిప్పవయ్యా వెనక్కు. ఈ బృహన్నలను ఏరికోరి తెచ్చుకున్నందుకు బాగానే చేస్తున్నావ్. వాళ్ళేం చేస్తారో తెలుసా నీకు ? బాబోయ్. నేను ఒక్క క్షణం రథంలో వుండలేను. (దూకి పరుగెత్తును. బృహన్నల రథము ఆపి పరుగెత్తి పట్టుకొనును) అబ్బ ! వుండు బృహన్నలా. నాకు భయం వేస్తోంది. నేను యుద్ధం చేయలేను. ఇంటికి పోదాం రా.

బృహన్నల— రాజకుమారా ! ఎంత పౌరుషహీనమైన పని చేస్తున్నావో చూడు. ఎదుట ఎందరు రాజకుమారులు నిన్ను చూసి నవ్వుతున్నారో చూడు. ఇంతమందిలో పరాభవింపబడి బ్రతికివుండేకంటె యుద్ధరంగంలో నీ దేశంకోసం, నీ రాజ్యంకోసం శత్రువులతో పోరాడుతూ మరణించటం మంచిది కాదా ? అది నీకూ, మీ వంశానికీ ఎంత కీర్తి తెస్తుంది.

ఉత్తరుడు—అబ్బ ! కీర్తి. మనిషే లేనప్పుడు కీర్తెందుకయ్యా బాబూ. మా తల్లిదండ్రులు నాకోసం ఎంతో బెంగ పెట్టుకుంటారు. ఇంటికి పోదాం పద.

బృహన్నల—ఇంటికి వెడితే నీవు తెచ్చిన పేరుకు మీ తండ్రిగారు సంతోషిస్తారు కదూ. మూర్ఖుడా, నీమూలంగా మీ వంశానికంతకూ తీరని అప్రతిష్ఠ కలుగుతుందనేనా ఆలోచింపవే. నీ పూర్వులను ఒక్కమారు స్మరించుకో. తమ రాజ్యంకోసం, తమ ప్రజల రక్షణకోసం రణరంగాలలో తమ ప్రాణాలనిచ్చినవారిని జ్ఞప్తికి తెచ్చుకో. రాజువై ప్రజలనుండి సేవలను పొందినవాడివి. అవుసరమైనప్పుడు వారికి సహాయపడటానికీ, రక్షించటానికేనా లేక పారిపోయి

దాగుకోటానికా? చూడు. నీ ఆవులను, గోపాలురను పట్టుకుపోవటమే కాదు, త్రోవలో ఎన్ని గ్రామాలను కొల్లగొడతారో, ఎంతమంది అమాయిక ప్రజలను హింసించుతారో, వారిని శత్రువులబారినుండి తప్పించలేని వాడివి నీవు రాజుగా నుండుటకు ఏ విధంగా తగుదువు? రాజుగా పుట్టింది చుట్టూతా దాసీలను కూర్చోపెట్టుకునేందుకూ, అర్థంలేని బొమ్మలు గీస్తూ కాలక్షేపం చేసేందుకూ, అందుకై ప్రజలనుండి సొమ్ములాగేందుకూనా? ఈ నాడు నీవే ఈ యుద్ధం చేసి గెలిచి నీ దేశాన్నీ, నీ ప్రజలనూ రక్షించితేనే నీవు రాజధర్మాన్ని సరిగా నెరవేర్చావన్నమాట. అప్పుడే ప్రజలకు రాజుగా నుండుటకు తగుదువు. లేకపోతే నీ అధికృత ఏమిటి? ఊరికే శత్రుసైన్యం చూసి పారిపోయేవాడివి నీవు ప్రజలకు ఆదర్శంగా ఎట్లు ప్రవర్తించగలవు? నిన్ను చూ[సి] వారు ఏమి నేర్చుకుంటారు? నిన్ను ఎలా గౌరవిస్తారు? నీకూ, ఒక సామాన్య పౌరుడికి తేడా ఏముంది? బహుశః వారిలోనే ఎక్కువ పౌరుష ముందేమో నీలోకన్న! రాజకుమారా, ఆదర్శపురుషుడిగా నీవు నీ ప్రజలకు కనపడినప్పుడే నీకు రాజ్యం నిలుస్తుంది. నీవు సుఖపడటానికై తమ చెమట నోడ్చిన ప్రజలను శత్రువులనుండి రక్షించటానికై వారి సేవతో పెంచిన నీ శరీరము నియ్యలేవా? చావో బ్రతుకో, నీ దేశంకోసం, నిన్ను నమ్మిన నీ ప్రజలకోసం, నీవు కాపాడవలసిన నీ వంశగౌరవం కోసం నీ వేత్యాగమైనా చేయుటానికి ఎప్పుడూ సంసిద్ధుడవై ఉండాలి. (మాట్లాడుతూ మాట్లాడుతూ ఒక్కమారు అర్జునుడుగా మారిపోవును.)

ఉత్తరుడు—(ఆశ్చర్యముతో నమస్కరించును. వినయముతో) మహానుభావా. తా మెవ్వరోగాని సరిగా అర్జునునిగురించి నే విన్నదానికి తగినట్లుగా నున్నారు. నాలోని పిరికితనమును రూపుమాపి నాకు కర్తవ్య ముపదేశించి నాకండ్లు తెరిచినారు. నేను మీ శిష్యుడను. మీరు ఏమిచేయమంటే అదిచేస్తాను. నా దేశానికీ, ప్రజలకూ, రాజ్యానికీ ఏమిచేయవలసినా జంకులేకుండా చేస్తాను. దారిచూపండి.

అర్జునుడు—కుమారా, నీవన్నట్లు ఆ మధ్యము పాండవుడను నేనే. ఈ నాటితోనే మా అజ్ఞాతవాసము పూర్తియైనది. నా సోదరులు, ద్రౌపది మీ కొలువుననే ఉన్నారు. (ఉత్తరుడు ఆశ్చర్యముతో వినుచుండును) పద, ఇప్పుడు యుద్ధంచేసి, గోవులను మరల్చుకొని రాజధానికి పోదాము. అదుగో ఆ శమీవృక్షము పైననే మా ఆయుధము లున్నవి. భయంలేదు. ఇక రథం నీవు తోలు. నేను యుద్ధం చేస్తాను. ముందు గాండీవం తీసుకోవాలి. పద.

## విరటు రాజదర్బారు : విజయోత్సవము

[మహారాజు, పరివారము ఆసీనులైయుందురు]

మహామంత్రి—సామంతులారా! పౌరులారా! వీరభటులారా! ఈ నాడు దక్షిణగోగ్రహణమున మనకు అఖండవిజయలక్ష్మిని చేకూర్చటానికి పాటుబడ్డ ప్రతి సైనికునికి మహారాజు తమ కృతజ్ఞతనూ, వారందరికీ రాజకుటుంబమునందూ, రాజ్యమునందూగల భక్తికి తమ సంతృప్తిని, సంతసమును వెలిబుచ్చుచున్నారు. ఈ సందర్భమున మహారాజులు తమకు తమ ప్రజలయందు గల ప్రేమనూ, వారిని సర్వవిధముల రక్షించుటకు తమ సర్వస్వమును త్యాగముచేయుటకు తమకు గల మనోనిశ్చయమును వెల్లడించుచున్నారు.

("జయ్‌మహారాజ్‌కీ జయ్—మహారాజు చిరకాలం వర్ధిల్లాలి" అని కేకలు)

ఒక సామంతుడు—మహారాజా! మీ రాజవంశమునందును, ఈ రాజ్యమునందును, ఈ ప్రజలయందును మాకు గల గౌరవ, భక్తి, ప్రేమలనూ, మీ సేవకై మా సర్వస్వమును వినియోగింప మా నిశ్చయమునూ, ఈ రాజ్యపురోభివృద్ధియత్నములందు మా సంపూర్ణసహకారమునూ ఈ విజయోత్సవసందర్భమున తమకు మీ సామంతులందరితరఫున మనవిచేయుచున్నాను.

("మహారాజాధిరాజ విరటమహారాజుకూ జయ్" అని కేకలు.)

ఒకపౌరుడు—మహారాజా! తమ చల్లని పరిపాలనయందు మే మనుభవించుచున్న సౌఖ్యములకు, సౌకర్య

ములకు, రక్షణకు - ముఖ్యముగా సర్వనాశనము నుండి ఈ నాడు మా కొసగబడిన సర్వరక్షణకు మా కృతజ్ఞతనూ, మాకు మీ రాజకుటుంబమునందు గల భక్తి గౌరవవిశ్వాసములనూ తమకు మనవిచేసికొను చున్నాను.

("జయ్ మహారాజాధిరాజ విరాటమహారాజాకు జయ్." అని కేకలు.)

సైన్యాధ్యక్షుడు—మహారాజా! ఈ సింహాసన మునకును, ఈ ప్రజలకును ఎట్టి శత్రువునుండియైనను ఒక్క సైనికుని బొందిలోనైనా ప్రాణమున్నంతవరకు ఎట్టి ఆపద రాజాలదని యీ సేవకుడు విన్నవించు చున్నాడు.

("జయ్‌మహారాజుకూ జయ్- మహారాజు చిర కాలం వర్ధిల్లాలి" అనికేకలు.)

విరటుడు—సామంతులారా, పౌరులారా, వీర భటులారా. ఈరోజు యుద్ధమునందు మీరు చూపిన శౌర్యమునకు, అంతకుమించి యిప్పుడు మీరు మారాజ వంశమునందు, రాజ్యమునందు వెల్లడించిన భక్తిగౌరవ ములకు నే నెంతయు సంతసించుచున్నాను. మన ప్రజల ధన ప్రాణములను కాపాడిన వీరభటనికాయము యొక్క శౌర్యము అభినందనీయము. కాని యీ విజ యోత్సవసందర్భమున ఉత్తరగోగ్రహణమున కేగిన మన రాజకుమారుడు తిరిగి ఇంకనూ రాకుండుటచే నా మనస్సు పరిపరివిధముల పోవుచున్నది. అనన్యసేనా సమేతులైన కౌరవు లెక్కడ, బాణమునైన సరిగ సంధింపలేని యీ పసిబాలు డెక్కడ......

(ఒక వార్తాహరుడు వేగా ప్రవేశించి నమస్కరించి నిలుచుండును)

ఏమిరా, హార్తలేమి?

వార్తా—యువరాజు ఎవరో మహానుభావుని సహాయముతో యుద్ధము గెల్చినారు; గోవులను మర లించినారు. ఆమహానుభావుని వెంటబెట్టుకొని యువ రాజు పట్టణము ప్రవేశించుచున్నారు.

("ఉత్తర కుమారునకూ - జయ్. యువరాజు వర్ధిల్లాలి" అనికేకలు)

విరటు—ఆహా, ఈనాడుగదా నేను నిజముగా గర్వపడుచుంటిని. కౌరవులనందరినీ జయింపగల కుమా రుని గని నేను ధన్యుడనైతిని. పట్టణమునందెల్ల ఉత్తర గోగ్రహణ విజయోత్సవము చాటింపుడు. ఉత్తరకుమా రునకు అఖండస్వాగత మొసగుటకు, మహామంత్రీ, ఇప్పుడే ఏర్పాటు చేయవలయును.

కంకుభట్టు—మహారాజా, విజయలక్ష్మీసమేతు డైన యువరాజునకు సుస్వాగతము. కాని యువరాజు వెంటనున్న ఆమహానుభావు డెవ్వడో అతనికి మనము బ్రహ్మాండమైన స్వాగత మొసగవలెను. వింట నారిని సంధింపలేని బాలు డెక్కడ, కౌరవసేన ఎక్కడ. ఈ విజయము ఆ మహానుభావునిదే అయియుండవలెను.

విరటుడు—(కోపముతో) ఆ. ఏమీ. ఉత్తర కుమారుని చులకనచేసి మారాజవంశమునకు అవమానము చేసెదవా. ఇది సహింపరాని నేరము. (తన చేతిలో నున్న సారెను విసరివేయును. అది కంకుభట్టుతలపై కొద్దిగాయమును చేయును. వెంటనే సైరంధ్రి ప్రవే శించి కంకుభట్టుతలను పట్టుకుని రక్తమును తుడుచు చుండును. వేరొక ప్రక్కనుండి ఉత్తరుడు, అర్జునుడు ప్రవేశము.)

ఉత్తరుడు—ఆ. ఆ. ఆగుము. తండ్రీ. ఆమహా నుభావుడెవ్వరనుకున్నారు? ఐనను నేను విజయమును సాధించుటకు ఈ మహానుభావుడేగదా కారణము.

విరటుడు— (వినిపించుకొనక) నాయనా, సంతోషము. వయసున పిన్నవయ్యు, నీవొనరించిన యీ ఘనకార్యమునకు నేనెంతయు గర్వించు చున్నాను. ఈ మనరాజధానీప్రజలు విజయలక్ష్మీ సమేతుడవైన నీకు సుస్వాగత మొసగుచున్నారు.

("జై మహారాజకుమారునకూ జై, ఉత్తరకుమా రునకూ జై" అనికేకలు)

ఉత్తరుడు—పౌరులారా, వీరభటులారా. ఈ మీ స్వాగతమున కెంతయు కృతజ్ఞుడను. దేశరక్షణకు, దేశస్వాతంత్ర్యమునకు పాటుబడుట దేశమునందు జన్మిం చిన ప్రతివ్యక్తికి విధియైయున్నది. అందు మీకన నేనొనర్చిన దేమున్నది? ఇన్నాళ్ళూ విలాసప్రియుడనై

యుండి దేశమునకు తీరని అపకారమొనర్చితిని. నా విధిని నేను మరచితిని. దేశరక్షణకు నాకు అవకాశము లభించుసరికి పిరికిపందనై తిని. కాని ఈ మహానుభావుని బృహన్నలదయవలన నావిధిని గుర్తించితిని. ఈ రోజు జరిగిన యుద్ధము మన గోవులకొరకు గాదు; మన రాజ్యరక్షణకు. ఈ యుద్ధమునందు మనము జయింపకున్న ఈపాటికే మనదేశము, మనప్రజలు, వారి సర్వస్వము హస్తగతమై యుండెడివి కదా. దేశస్వాతంత్ర్యమునకై ప్రతివ్యక్తియు తన స లనూ వినియోగింపవలెను. స్వాతంత్ర్యసమరము పేరు విన్నంతనే అబలులు సబలులు గావలె; పిరికిపందలు శౌర్యవంతులై పోవలె; భోగలాలసులు రణోన్మత్తులు కావలె; వేషాలు, ఉత్తరులు, బృహన్నలలు అర్జునులై పోవలె. ఆనాడే తమ దేశమునకు, తమ సోదరులకు, తమ పితరులకు తమ విధ్యుక్తధర్మము నెరవేర్చినవారౌదురు. ఇదియే ఈ విజయోత్సవసందర్భమున మనకు అమృతసందేశము. ఈ సందేశమును సర్వదా ఆదరించుటకు, ఆచరించుటకు నేను సంసిద్ధుడను.

("మహారాజ కుమారునకూ జై - యువరాజు వర్ధిల్లాలి" అని కేకలు)

ఈ మహానుభావుడే మన రాజ్యరక్షణకు కారకుడు. ఈయన మనము రోజూ చూచుచున్న బృహన్నలయే! కాదు కాదు. ఎవని నామము కౌరవసేనను కంపింపజేయునో ఆసవ్యసాచి యీ మహానుభావుడే!! అజ్ఞాతవాససందర్భమున పాండవులేవురూ, ద్రౌపదియు మన రాజ్యమును పవిత్రమొనరించిరి. ఆ మహానుభావుడే ధర్మరాజు. ఆ వలలుడే భీమసేనుడు. వారే నకుల సహదేవులు. ఆయమయే ద్రౌపది. (అందరు ఆశ్చర్యమును సూచింతురు.)

విరటుడు—(సింహాసనము దిగి ధర్మరాజునకు మోకరించి) మహానుభావా, నన్ను క్షమింపుడు. ఈ సంవత్సరమునుండి అజ్ఞానుడనై మీచే సేవలు గొన్నందుకు నాకూతును మీ కోడలిగా గైకొని నన్ను ధన్యుని చేయుడు.

ద్రౌపది—అన్నా, అట్లే యగుగాక. ఉత్తర అభిమన్యుకుమారుని సతీతిలకమై వర్ధిల్లుగాక.

(ప్రతీహారి ప్రవేశించి విరటునకు నమస్కరించి) జయము, జయము, మహారాజా! దుర్యోధన చక్రవర్తి రాయబారి తమ దర్శనార్థము వచ్చియున్నాడు.

విరటుడు—సత్వరము ప్రవేశపెట్టుము.

(ప్రతీహారి నిష్క్రమణ)

(రాయబారి ప్రవేశించి విరటునకు, పాండవులకు నమస్కరించును.)

విరటుడు—ఏమి నీ రాయబారము?

రాయబారి— జయము, జయము మహారాజా. తమ కొలువునందు పాండవులున్నారని మా చక్రవర్తిగారు కనుగొని, అజ్ఞాతవాసనిబంధన ఉల్లంఘనమునకు వారలు మరల అరణ్యవాసము, అజ్ఞాతవాసము చేయవలెనని ఉద్దేశపడుచున్నారు.

(అందరు కోపముతో చూచుచుందురు)

అర్జునుడు—(కోపముతో) ఓహో. అటులనా! పాపము, నిన్నటితోనే అజ్ఞాతవాససంవత్సరము నిండినదని మీ రాజునకు తెలియదు కాబోలు. దానితోపాటు అతని ఆయువుకూడ నిండినదని చెప్పుము.

(భీముడు మాట్లాడబోగా వారించి)

ధర్మరాజు—అది అంతయు నేల? నామాటలుగా మీరాజునకు ఇట్లు చెప్పుము. అడగియుండు రోజులు, ఆశ్రయించు రోజులు గడచిపోయినవి. ఈనాడు స్వరాజ్యమునకై పాండవుల సేనయు సంతృప్తిపరుపజాలదు. కుయుక్తులు, భేదోపాయములు పరిస్థితిని మరింత విపరీతమొనరింపగలవు. ఈనాడు స్వదేశము, స్వరాజ్యము చేకూరకున్న పాండవుల యొక్క క్రోధాగ్ని ప్రజరిల్లి నిన్నూ, నీదేశమునూ, రాజ్యమునూ కాల్చివేయగలదు. ఈఅంతిమపోరాటమునందు తమ సర్వస్వము ధారపోయుటకు పాండవులు సంసిద్ధులై యున్నారు. స్వరాజ్యమో, వీరస్వర్గమో, ఇదే పాండవుల నిశ్చయము.

# భా వ ల హ రి

## — శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి —

జీవిత మెంత నాటకము చేసితివోయి నటావతంస ! మా
భావములోని వర్తనము పల్కుల కందదు పో ; యెడందలో
లో విషభాండముల్ కనులలో మధుకోశము లెన్న, సత్యపుం
తావగు నయ్య నాలుక, ప్రణాళిక కుత్తుకకోతలున్ ప్రభూ !

ప్రతివా డొక్కొక వేదమూర్తి యయి సంభాషించు శాస్త్రార్థముల్,
శతధానీత్యవినీతివర్తనల భాష్యమ్ముల్ పచారించి జీ
వితలక్ష్యమ్ములు పుణ్యపాపములు చూపించున్ మహర్షిక్రియన్
క్షితిలోమాత్ర మధర్మతాండవములే చిత్రమ్ము విశ్వప్రభూ !

ఈ రుద్రాక్షుల పిల్లి తావళముతో నేరామనామమ్ము, నే
ర్పారంబూని ముముక్షుయోగిజన విఖ్యాతిన్ విడంబించెడిన్ ;
క్రూరారంభములోన సౌబలుని కర్ణున్ రాక్షసస్వాములన్
మీరంజాలిన బుద్ధిశాలి యిత డేమీసృష్టి ! విశ్వప్రభూ !

గణికయుపాటి సత్త్వగుణగౌరవమందని దేవతార్చనా
నిరతుల తామ్రపేటికల నీరసజీవన మేల? నిత్యసుం
దరసువిశాలవిశ్వభవనమ్మున నిల్చి జగజ్జనావనా
పరత వహించి దుఃఖితుల పాపుల నీహృది జేర్పు మోప్రభూ !

అందరు పుణ్యకార్యకరణాభిరతుల్, పరమార్థచింతనా
స్పందవిరాగచిత్తులు, విశాలమతుల్ విషయోపభోగక
ర్మాదులు, దివ్యజీవనపరాయణు లౌదురు నేటి లోకమం
దిందరిలోన నే నొకడనే దురితాత్ముడ; ప్రోవు నన్ ప్రభూ !

---

# ఆంధ్ర కథానక కావ్యములు: భోజరాజీయము

= శ్రీ బులుసు వెంకటేశ్వర్లు =

ప్రాచీనాంధ్రసారస్వతమునఁ బురాణ ప్రబంధ కావ్య నాటకాదులతోపాటు చక్కని పద్య కథానకవాఙ్మయమును బ్రబలియున్నది. ఈ కథానకములలోఁ గూడ నితరశాఖలవలెనే యనువాద కావ్యములు, స్వతంత్రకావ్యములును గలవు. ఈ స్వతంత్రపద్యకథానక కావ్యములలో నాంధ్రకవిపుంగవులు కథాకథనచాతుర్యము, నూతనకల్పనానైపుణ్యము ప్రతిభావ్యుత్పత్తులతో జోడించి యద్వితీయకథాసాహిత్యమును మనకుఁ బ్రసాదించియున్నారు.

ఈ కథానకకావ్యములలో శాలివాహనగాథాసప్తశతి, సింహాసనద్వాత్రింశిక, విక్రమార్కచరిత్రము మున్నగు కథానకములు సంస్కృతకథానక కావ్యానువాదములు. భోజరాజీయము, హంసవింశతి, శుకసప్తతి, కళాపూర్ణోదయము మున్నగు కథానకము లాంధ్రకవిచంద్రుల స్వకపోలకల్పితములు, నద్వితీయ శిల్పప్రతిభాసకములు. కళాపూర్ణోదయము పద్యనవలారాజమని ప్రఖ్యాతి నార్జించినది. ఇఁక, శుకసప్తతి హంసవింశతుల కేదియో మూల మున్నదని యెవరో యూహించిరి కాని, యది సత్యమునకు సన్నిహితము కానిమాట. ఈ రెండు కథానకములందలి కథాచమత్కృతి, నిరుపమానశిల్పము, నందు ద్యోతకమగు లోకజ్ఞానము, కల్పనాపాటవము, హృదయాకర్షణశక్తి ప్రత్యేకవ్యాసముల నిరూపింపఁదగియున్నది.

ఇఁకఁ, బరమపవిత్ర కథానిధి యనఁ దగు భోజరాజీయము కేవలము స్వతంత్రకథానకకావ్యము. ఇందుఁ దద్రచయిత యగు ననంతామాత్యుఁడు గడిదేఱినకథారచయితగ గోచరించుచుండును. ఈతని కథారచనమందలి యాదర్శములు, కథాశిల్పము, నందలి మెలఁకువలు, కథానకములందలి జనరంజకత్వము పరిశీలించినచోఁ గవిత్రయమునకుఁ దరువాతివాఁడును, బ్రబంధకవులకుఁ బూర్వుఁడును నగు ననంతామాత్యుఁడు కొన్నివందల సంవత్సరములకుఁ బూర్వమే యద్వితీయకథాసాహిత్యమును మనకుఁ బ్రసాదించియుండుట గోచరము కాఁగలదు.

అనంతామాత్యుఁడు తాను బుధచకోరచిత్తప్రియుఁడననీ, సంతతవాణీప్రసాదానులబ్ధ వాగ్విభవుఁడననీ చెప్పుకొని తనయాశయమును జాటి సజ్జనరంజకత్వమే తన కృతికిఁ గావలయునదని పేర్కొనియున్నాఁడు. కవిత్వప్రాశస్త్యము, కృతుల యాదర్శములు తా ననుసరించినవిధమున నిట్లు వాక్రుచ్చియున్నాఁడు:

"సకలవిద్యలయందుఁ జర్చింపఁ గవిత యు
త్కృష్టమంచునది నిత్యకీర్తికొఱకు
నర్థాప్తికొఱకు నా వ్యవహారలక్షణం
బెఱుఁగడికొఱకు ననేకవిధము
లగు నమంగళముల హరియించుకొఱకు ను
చితనిత్యసౌఖ్యసంసిద్ధికొఱకు
ఒనరఁ గాంతాసమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హితమాచరించుకొఱకు
నయ్యెఁ గానఁ బెద్దలాచరించెద రంచు
నేర్పుకొలఁదిఁ గృతి యొనర్పఁ బూని,"

ఇట్లు కృతియొక్క పరమార్థమును వక్కాణించి తాను భోజరాజీయమును రచించుట కింకను గారణము లిట్లుగాఁ గవి పలుకుచున్నాఁడు :

"నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల
సంతతసేవ్యమై జరుగు ననియు
నాదిరాజసమానుఁ డగు భోజభూపతి
చరిత మీ కవితాప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడి కథ లిన్నియు నోలిఁ బ్ర
శస్తధర్మోపదేశంబు లనియు
నఖిలజగన్నాథుఁ డగు నహోబలనాథుఁ
డీపుణ్యకృతికి నధీశుఁ డనియుఁ
బృథివి గల్లజనులు ప్రియభక్తియుక్తిఁ బా
టింతు రనియు నూఱడిల్లి......"

అధికాసక్తితో నీకృతి రచించినట్లు చెప్పినాఁడు. ఇందు ముఖ్యముగా గమనింపఁదగిన కథానకాదర్శములు, ౧. నూతనత్వము. ౨. పురాతనకృతిసామ్యత. ౩. ప్రశస్తకవితాప్రసంగము. ౪. ధర్మోపదేశకత్వము. ౫. సజ్జనరంజకత్వము. ఈ యైదుసుగుణములు నద్వితీయముగాఁ బట్టినవి కనుకనే యనంతామాత్యుని భోజరాజీయము సారస్వతమున శాశ్వతత్వము నందఁ గన్నది. ఒక్క మాటలో నాతఁడు మరలఁ దన కథాప్రసంగము నిట్లు క్రోడీకరించినాఁడు :

"సూత్రకథ భోజరాజు చ
రిత్రమయా నడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్."

ఇందు ధర్మరీతులు నీతులు చిత్రకథలై శ్రోత్రపేయముగా నుండుటచే కథానకప్రధానాశయ మని వక్కాణింపఁగాఁ బల్కి యనంతామాత్యుఁ డీపలుకుఁ దన కృతియందుఁ బరమసత్యము గావించినాఁడు. అందుచేఁ బూర్వోదాహృతము లగు గుణములను స్థాలీపులాకన్యాయమున నాతనికృతిలోఁ గాంచిన నవికథానకమున కెంత శోభావంతములో తెలియఁగలదు.

## కథాసంవిధానము : నవీనత

భోజరాజీయము 'నూతనం బయ్యుఁ బురాతనకృతులట్ల సంతతసేవ్య' మనియు,

"దత్తాత్రేయప్రోక్తము
దాత్తసుకృతభోగవిభ్రుతసునీతిపథా
యత్తంబై యితిహాసము
శ్రోత్తగదే భూమి..."

ననియు, నీకృతి సంతతశ్రావ్యము, "వివిధకథానూత్నగణ్యభూమణాభిరామము" నని కవి తెల్పియుండుటచే నిందలి కథాభాగములు నూతనకల్పితములే కాని పురాతనములు కావన్నట్లు సుస్పష్టము. సంస్కృతమందలి భోజచరిత్రమునకును, దీనికిని పోలికలు లేకపోవుట యింగులకు మఱియుఁ బ్రబలతార్కాణము.

## పురాతనకృతిసామ్యత

కాని, కొన్నికథాభాగములు పూర్వపురాణకథానుకరణములై గ్రంథప్రాశస్త్యమునకుఁ గొంతి కారణభూతమైనవి. భారతమునందలి "ఋతుప్రాప్తి సుచుచు నెడనెడ గుడుపక యొప్పు నాతండు నిత్యోపవాసి" "ఋతుకాలముల నాత్మసతి గూడి క్రీడించి పరగు నాతఁడు సదాబ్రహ్మచారి" యనువాక్యములు గైకొని కవి యాశ్చర్యసుందరముగ నిం దరుంధతీవసిష్ఠు లగస్త్యుని నతిథిగాఁ బూజించిన కథాసందర్భము మహోన్నతముగ వివరించినాఁడు. పావకలోముఁడు హంసయంత్రము నేసి యనుమతిని బరిణయ మైన కథాభాగము మత్స్యయంత్రము నేసి ద్రౌపదిని బడసిన యర్జునుని చరిత్రమును స్మృతికిఁ దెచ్చుచున్నది. ఈ త్తమగుణవిరాజితుఁ డగు పావకలోముని కాళ్లు నఱుకఁబడుటయు, నాతనికిఁ బార్వతీపరమేశ్వరులు ప్రత్యక్ష మగుటయు సారంగధరచరిత్రముఁ బోలియున్నది. వంజరుఁడు తప మొనరించి గంగను భూమికిఁ దెచ్చుకథ గౌతమమహర్షి గంగను భూమికిఁ దెచ్చినకథకు రమ్యోదాత్తానుకరణ మగుట తోఁచును. ఇట్లే, కొన్నికథాభాగములకు మాత్రము పురాతనకథాభాగములు సూత్రప్రాయములై యనంతామాత్యుని పరిణతహస్తమున నౌచితీసుందరగను, నాతని

మృదుమధురభాషణమున సుశ్రావ్యతను గడించి సాన దేఱిన రత్నము లైనవి.

## ప్రశస్తకవితాప్రసంగము

కొంచె మించుమించుగా నీసుగుణము తరువాతి దగు ధర్మోపదేశకత యను సుగుణమున నంతర్భూతమై యున్న దని చెప్పవచ్చును. పరమప్రామాణ్యము లగు శ్రుతి స్మృతిపురాణేతిహాసాదులందుఁ బ్రతిపాదితము లగు సత్యము, ధర్మము, అహింస మున్నగు సుగుణములే యీ కవితాప్రసంగమునకుఁ బరమార్థములు. ఉత్తమ మైన ధర్మముల నుత్తము మైననీతుల నుత్తమ మైనమార్గమున బోధించుటచేతనే యీ కావ్యమున కింత వైశిష్ట్యము సంభవించిన దని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

## ధర్మోపదేశకత్వము

మహోపజ్ఞాకల్పితము లగు నిందలి కథాభాగములు ప్రశస్తధర్మోపదేశకము లగుట విశేషముల కెల్ల విశేషము. ఇం దేకథాభాగము నరసినను ప్రశస్తధర్మోపదేశకము, సునీతిపథాయత్తము నై పాఠకమానసముల నానందమగ్నములఁ జేయుచు ననంతామాత్యుని కావ్యపరమార్థదృక్పథమును దెలుపఁ జాటుచున్నది. రోగభూయిష్ఠుఁ డగు మహాచరిత్రమునను, మాఘకరప్రభావమును గుఱించిన దుష్టసహ, సత్పతి - వీరలచరిత్రమును, యోగికి వేఁడి పాయస మిడిన బ్రాహ్మణుఁడు, యోగికి మంటిముద్ద బిచ్చముగా నిడినయామెకథ, చండాలదంపతులచరిత్రము, సుశీలకథ మున్నగునవి "అవశ్య మనుభోక్తవ్యమ్ కృతం కర్మ శుభాశుభ"మ్మను నార్యోక్తికిఁ దార్కాణములై యలరుచున్నవి పుష్పగంధిచరిత్రము, మదనరేఖమహత్త్వము, అనుమతిచరిత్రము, అన్నదానపరుఁ డగు విప్రుని భార్యకథ మున్నగునవి పరమపాతివ్రత్యమాహాత్మ్యమును వేనోళ్లఁ జాటు శంఖారావములు. మఱియు, నతిథిపూజాప్రభావము, సత్యవాక్యపరిపాలనామహత్త్వము, అన్నదానమువలని యనంతఫలము నద్భుతముగా నద్ఘోషింపఁబడినవి. ఇట్లు దానధర్మసత్యశౌచముల ప్రభావ మనంత మని వివరింపఁబడినట్లే లుబ్ధత్వము, అధర్మము, అసత్యము, క్రౌర్యము, అశౌచము మున్నగుదుర్గుణము లెన్ని యిక్కట్టులు గొనివచ్చుననియుఁ దెలుపుటకుఁ గుంభిచరిత్రము, నన్నదానపరుఁ డగు విప్రుని పదినెలచరిత్రము మున్నగునవి సాక్షిభూతము లగుచున్నవి. అన్నిటికన్న మిన్నఁగా మహారాక్షసునిహృదయము, మహాకామాంధునిమనస్సు, మహాక్రూరసింహహృదయము మార్చివేసి యున్నతపరివర్తనమును గొనితెచ్చిన సత్యవాక్యవిజయ మీగ్రంథమున నద్వితీయముగా, నత్యద్భుతముగాఁ గొనియాడఁబడియున్నది. ఈ మహోత్కృష్టసుగుణసంపద నుజాటుకొన్న గోవ్యాఘ్రసంవాదకథ, పుష్పగంధిచరిత్రము, పావకలోమునికథ యాంధ్రసారస్వతమున కాచంద్రార్కముగ నిత్యనవచైతన్యము నొసఁగఁ జాలియున్నవి.

ఇట్టి మహనీయకథామధుర మగుటచేతనే భోజరాజీయకథాభాగమును శ్రీకృష్ణదేవరాయలు, పింగళి సూరనార్యునివంటివారె కొన్నిపట్ల ననుకరించియున్నారు. ఆముక్తమాల్యదయందలి మాలదాసరికథ మదనరేఖకథకును, కళాపూర్ణోదయమందలి సత్త్వదాత్మకథ చెప్పినబాలికథ యిందుఁ గల యన్నదానపరుఁ డగువిప్రునకు నన్నదానమాహాత్మ్యము నప్పుడే పుట్టిన బాలుఁడే చెప్పినకథ కనుకరణము.

## సజ్జనరంజకత్వము

అనంతామాత్యుఁడు :

"...సరసీరుహసంభవుఁ డిచ్చుఁగాత మ
త్కృతికిఁ జిరాయువున్ విమలకీర్తియు
సజ్జనరంజకత్వమున్ "

అని కోరుకొనియున్నాఁడు. వాణీపతియు నీగుణముల నీకవి కనుగ్రహించియుండుట కావ్యమున స్పష్టముగా గోచరించుచున్నవి. అనంతామాత్యుని కవిత్వము కడుమృదుమధుర మనియు, నుత్తమకవిత్వమునకుఁ గలప్రతిభావ్యుత్పత్తులు, నుత్తమశైలికిఁ గల మాధుర్యము, నర్థబోధకత మున్నగుసుగుణముల నది యద్భుతముగాఁ దలదాల్చుకొనె నను టతిశయోక్తి కాఁ జాలదు. ఈతనిశైలియందు గమనింపఁదగిన ముఖ్యాంశము లివి:

గానమాధుర్యము, అర్థసౌలభ్యము, సహజగాంభీర్యము, మార్దవము, ఔపదేశిక సంపన్నత మున్నవి. ఆమూలాగ్రముగా నొకేవిధమున మృదుమధురముగ నున్న భోజరాజీయమందలి శైలి తరువాతి యాంధ్రకవులలోఁ బలువుర కలవడెనని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. ఈ విషయము కూడఁ బ్రత్యేకముగనే విస్తరింపఁదగి యున్నది.

మఱియు నితరకావ్యములవలెఁ గాక భోజరాజీయమందలి ప్రతికథాభాగమును నీతులనిధి, ధర్మముల పట్టు, మంచికిమ్ముల్లు. ఇవియే సజ్జనరంజకత్వమునకుఁ బ్రధానకారణములైనవి.

ఈవిధముగ స్వకపోలకల్పితము లగు కథానక కావ్యములలో భోజరాజీయ మగ్రగణ్య మని చెప్ప వచ్చును. చిన్నకథల ప్రయోజనము, చిన్నకథల శిల్పము, వానియాదర్శములు, కథనసైపుణ్యములో మెలఁకువలు ననంతామాత్యుఁ డెఱిఁగి స్వతంత్ర సద్యఃకథానక కావ్యము నాంధ్రసారస్వతమునకు మొట్టమొదట నొసఁగినవాఁ డగుట నాతనితోపాటు మనము నాతని కృతికి శుభ మాకాంక్షింతము :

"అఖిలజగన్నేత్రమై భూమిపై నహో
బిలము దా నెందాఁక వెలయుచుండు
నాతీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశి
నీనది యెందాఁక నెగడుచుండు
నామహానందిపొంత నత్యంతపూజ్యమై
గరుడాద్రి యెందాఁకఁ గదలకుండు
నయ్యద్రిశిఖరంబునందు నెందాఁక
శ్రీనృసింహస్వామి స్థిరత నుండు
నస్మదీయకృతియు నందాఁక సంతత
ప్రాశస్త్యమై సమస్తశుభోదయంబు
విస్తరిల్లఁ గాత వివిధకథాగాత్ర
రత్నభూషణాభిరామ మగుట."



# గులాబి తోట

## = శ్రీ కవికోకిల దువ్వూరి రామిరెడ్డి =

[కలిమిలేములను గురించి సాదీకిని, అతని ప్రతిపక్షునకును జరిగిన వాదప్రతివాదములు.]

బయటికి దరిబేసివలె అగపడినను దరిబేసుల సద్గుణములు లేని యొకడు గోష్ఠియందు కూర్చుండియుండ నేను చూచితిని. ఆతడు భాగ్యవంతులను నిందించుచు వారి యక్రమములను తూర్పారబట్టుచు, తన పెద్దతనమును ప్రకటించుచుండెను. ఆతని మాటలు "నిరుపేదలకు శక్తిలేదు, భాగ్యవంతులకు ఇచ్చలేదు" అనునంతవరకు వచ్చినవి.

దయ గల్గువానికి ధనము శూన్యంబు
ధనమున్నవారికి దయ బండిసున్న.

నేను గొప్పవారి ద్రవ్యముతో పోషింపబడినవాడనుగాన ఆతని మాటలు కర్ణకఠోరములయి నన్ను బాధింప నిట్లంటిని: "ఓయి మిత్రుడా, భాగ్యవంతుడు బీదల రాబడి మూలము. యతులకు, సన్న్యాసులకు ధాన్యపు పాతర. అభ్యాగతులకు ఆశావలంబనము. బాటసారులకు ఆశ్రయము. ధనికులు ఇతరులకు సంతోషము చేకూర్చుటకు తాము భారము వహింతురు. సేవకులును, దీనులును అన్నము ముట్టనిదే వారు భుజింపరు. వారి భుక్తశేషములగు భక్ష్యభోజ్యములు అనాథలకు, ముదుసలులకు, ఆశ్రితులకు ఇరుగుపొరుగు వారికి పంచిపెట్టబడును.

విత్తవంతులు ధర్మకార్యములకు శాశ్వతాదాయము వచ్చు దానములు చేయుదురు. మ్రొక్కుబడుల చెల్లింతురు. అతిథులను సత్కరింతురు. భిక్షము పెట్టుదురు. పస్తున్నవాని యాకటిమంట దీర్తురు. బానిసలను బంధవిముక్తుల గావింతురు. జంతుబలులతో దేవుని తృప్తిపరతురు. అట్టివారి ప్రాభవము నీకెట్లు లభ్యమగును? దినమునకు రెండుమారులు నమాజుచేయుట తప్ప నీవేమియు నొనర్పలేవు. దానికిని నూరుగండములు.

ధనవంతులకు మంచిసేయు శక్తి గలదు. వారి ప్రార్థనములను భగవంతు డంగీకరించును. ఏలయన, వారి ధనము దానములకు వినియోగపడును. వారి కీర్తి నిష్కళంకము; హృదయము శాంతము. కమ్మని భోజనముపై భక్తిబల మాధారపడియుండును. పుణ్యశీలత పరిశుభ్రమైన యుడుపులవలన కలుగును. పస్తుపడి కడుపు వెన్నుముక కంటుకొనియున్నవానికి స్థిరమైన భక్తి యెట్లు కుదురును? రిక్తహస్తునకు ఎట్టి మానవత్వ ముండును? బద్ధపాదు డెట్లు విహరింపగలడు? ఆకలిగొన్నవాడు ఏమి మంచి చేయగలడు?

రేపటికి తిండిలేని దరిద్రు డెపుడు
కలతచెందని నిద్దుర గనడు రాత్రి;
సీతుకారున సుఖియింప చీమ లెరను
గొరత లేకుండ వేసవి గూడబెట్టు.

విశ్రాంతికిని, దినపస్తులకును పొత్తు కుదురదు. చిత్తశాంతికిని, రిక్తహస్తతకును సంబంధము పొసగదు. శాంతహృదయుడు సాయంకాలము నమాజుకు కూర్చుండ, ఆకలిగొన్నవాడు మాపటిపూట అన్నమునకై నిరీక్షించుచు కూరుచుండును. ఎప్పటికైన వీరిద్దరకు ఏమిపోలిక యుండును?

* పారసీక మహాకవి షేక్‌సాదీ రచించిన 'గులిస్తాన్' అను గ్రంథములోని సప్తమాధ్యాయమందలి ౨౦-వ కథ కనువాదము.

దేవతత్పరుడౌను దిన సున్నవాడు ;
బత్తెము లేకున్న జిత్త మల్లాడు.

భాగ్యవంతుల పూజాపురస్కారములు దేవునికి అంగీకారపాత్రము లగును. ఏలయన, వారి హృదయము వేదనాచలితముగాక శాంతముగను, ఏకాగ్రముగను ఉండును. జీవయాత్ర సుఖముగ గడపుటకు తగిన సౌకర్యములు సిద్ధమైయున్నవిగాన, ప్రతిదినము వారు పూజలందు నిమగ్నులు కాగలరు. ఒక యరబ్బీ యిట్లు చెప్పెను : "నిర్భరదారిద్ర్యమునుండియు, నే నిష్టపడని వాని సహవాసమునుండియు భగవంతుడు నన్ను రక్షించునుగాక !"

"ఇహపరములయందును దారిద్ర్యము నింద్యము" అను శ్రీసూక్తి 'ఖబరు'నందు కలదు.

ఈ మాటలు విని నా ప్రతివాది యిట్లనియెను : "ఈసూక్తినే వింటివిగాని 'దారిద్ర్యమే నాకు యశస్కరము' అను మహమ్మద్ ప్రవక్తవచనమును నీవు మరచితివి."

సాది :— ఊరకుండుము. సుఖదుఃఖముల నేకరీతిగ ప్రవర్తించుచు విధిశాసపరంపరకు గురియైన దైవతత్పరుల దారిద్ర్యమునుగురించి మహమ్మద్ ప్రవక్త అట్లు సెలవిచ్చెనుగాని, ధర్మకవళము సంపాదించుకొనుటకు పవిత్రమైన కుట్టబొంతను దొడుగుకొని నీచ జీవనము చేయు వేషధారులకు ఆ సూక్తి యన్వయింపదు,

పెద్దపెద్దగ నినదించు , నీదు
పటిమ యెందాక, శూన్యగర్భంబ పీపు !
దారిబత్తెంబు లేక నీ తాతిరమె
యుద్ధయాత్రల గష్టాల కోర్చి ప్రోగ ?
మనుజుండ వై తేని మాను యాచనము
వేయిపూసలమాల వ్రేళ్ళ ద్రిప్పకుము.

గాఢమైన మతవిశ్వాసము లేని దరిద్రస్థితి యతని పతితుని చేయునంతవరకు వదలదు. నిరుపేదలైనవాడు మతభ్రష్టు డగును. ద్రవ్యముండిననే తప్ప దిగంబరులకు కప్పడముల నిచ్చుటకును, బద్ధులైనవారిని చెరవిడిపించుటకును సాధ్యముకాదు. మనబోటి నిరుపేదలకు అట్టి ధనికుల యౌన్నత్య మెట్లు కలుగును ?

ఇచ్చునప్పుడు మీదైన యుదారహస్తమునకును తీసుకొనునప్పుడు క్రిందైన దీనహస్తమునకును ఏమి సంబంధము గలదు ? "ఈ తెగవారికి, అనగా యథార్థమైన ముసల్మానులకు దినబత్తె మేర్పాటుకాబడియున్నది" అని పవిత్రమైన ఖురానునందు సర్వోన్నతుడైన భగవంతుడు స్వర్గవాసుల భోగములనుగురించి సెలవిచ్చియున్నాడు.

దగనొన్న వానికి నగపట్టు, గలను,
జగమెల్ల సెలయూట బొగడు చందమున.

నే నిట్లు వచించినంతనే ఆ దరిద్రునికి ఓర్పు సడలి నోటికి అడ్డు ఆపు లేక, సిగ్గువిడిచి యిట్లు వదరెను:

ప్రతివాది :— 'నీవు మితిమీర అత్యుక్తులతో ధనవంతులను పొగడుటయు, మనసు నొచ్చునటుల మాటాడుటయు చూడ, ప్రతినికుడును దారిద్ర్యవిషమును హరించుటకు సంజీవనౌషధమువంటివాడనియో, లేక ధర్మశాలతలుపులు తెరచు తాళముచెవివంటివాడనియో యూహించిన ట్లున్నది.

ధనవంతులు మదమత్తులు ; గర్వితులు ; అహంభావులు ; అసహ్యవర్తనులు ; ఐహిక ధనభోగాసక్తులు ; సంపద్గౌరవతృష్ణాతప్తులు ; బతిమాలి భంగపడిననేతప్ప ఇతరులతో మాటలాడరు. అలక్ష్యతిరస్కారదృష్టులతో తప్ప ప్రసన్నవదనులై చూడరు. పండితులను బిచ్చగాండ్రని తలంతురు. ఫకీరులను తలకు మొలకు లేని దరిద్రులని నిందింతురు. గట్టి రొక్కమున్నదన్న కావరముచేతను, ఉన్నతపదస్థుల మన్న తలంపుచేతను, అందరకన్న మాది పైచేయి యని యుద్ధతులై ప్రవర్తింతురు. ఎవరి తట్టయిన తలయెత్తి చూడవలయునని తలంపరు. "వినయమునందు ఇతరులకంటె తక్కువగను, సంపదలయందు హెచ్చుగను ఉన్నవాడు బయటికి ధనవంతుడుగ నగపడినను యథార్థముగ అతడు దరిద్రుడే"నని తత్త్వవేత్తలు చెప్పినమాటలం వా రెరుగరు.

సాది :— భాగ్యవంతులను నిందింపకుము. వారు కరుణామయహృదయులు.

# భారత పరిశ్రమల ఆయువుపట్టు ఇంకను బ్రిటిషువారి చేతులలోనున్నది.

## మనమందర మైకమత్యముతో కలిసి కృషిచేసినప్పుడే అవి మనకు వశము కాగలవు.

తక్కువ పెట్టుబడితో, జాతీయ పరిశ్రమలు నెలకొల్పుటకు
బ్రహ్మాండమైన ప్రణాళిక.

★ మా సోడావాటర్ మెషినులను స్థాపించుడు.

★ పరిమళద్రవ్యములను, టాయిలెట్ వస్తువులను ఉత్పత్తి చేయుడు.

మేము చిన్నవి, పెద్దవి అన్ని రకముల సోడావాటర్ యంత్రములు, సుగంధ తైలములకు, టాయిలెట్ వస్తువులకు ఉపకరించే పరికరములు మిక్కిలి చౌకధరలకు సప్లయిచేయుదుము.

ఉచితముగా మీకు ప్రవీణుల సలహాకూడ నొసంగబడును.

## THE ESSENCE & BOTTLE SUPPLY AGENCY,

**14, Radha Bazar Street,**

**CALCUTTA.**

# పి. వి. రాజన్
## అండ్ కంపెనివారి




**శ్రేష్ఠమైన మదరాసు నశ్యం**
**R. S. సుగంధ ముక్కుపొడి.**

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.

రిజిస్టర్డు చేయబడి సర్టిఫికెట్లు పొందిన

# పాలసుగంధిలేహ్యం

ఇది రక్తశుద్ధిచేయు అనేకమూలికలతో తయారుచేయబడినది. స.వా మేహములు, మేహపొడలు, మచ్చలు, కురుపులు, చర్మవ్యానులు, కుష్ఠు, మలబద్ధము, కీళ్లవాపులు మొదలగు అనేకవిధములగు వ్యాధులను ఖండించుటలో అద్భుతమైనది. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బి రు. 2-0-0.

పోస్టేజి ప్రత్యేకము.

**పి. సి. ఏ. కంపెని,**

పెరిదేపి, (నెల్లూరు జిల్లా).

మదరాసు బ్రాంచి :

7. సీనుమొదలి వీధి. (మిద్దెమీద)
వెలెకు టాకీస్ ఎదురుగా, జార్జిటవున్.

## ఉజ్వలమైన సతీ ము



పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

## గర్భాశయరోగ నివారిణి

**అరుణ** ఋదుదోషములను పోగొట్టి. పరిపూర్ణ స్త్రీత్వమును ప్రసాదించగల స్వయం సంపూర్ణ మగు ఔషధము. అట్టిదానిని విడువక సేవించినట్లయితే, మిమ్ము ఆరోగ్యవంతులను జేయుటయే గాక. మీ జీవన పరమావధి యగు అమందానందమును తప్పక యొసంగును.



**ఆయుర్వేదాశ్రమ**
**టి-నగర్....మద్రాసు.**

ప్రతివాది:—నీవు అబద్ధము చెప్పుచున్నావు. వారు రూపాయలకు దాసులు. ధనికులు శ్రావణ నీల మేఘములే యగుదురుగాక, వర్షింపకుండిన నేమి లాభము? కాంతిప్రవాహము లయ్యును ఎవరిమీదను ప్రకాశింపకుండిన ప్రయోజన మేమి? సామర్థ్య మను గుర్రముపై నెక్కియు పరుగెత్తింపకున్న నేమి ఫలము? వారు దేవునికొరకైనను అడుగెత్తి యట్లు పెట్టరు. స్వప్రయోజనము నాశింపక చిల్లిగవ్వయైన నొకరి కియ్యరు. ఎంతయో శ్రమపడి ద్రవ్య మార్జింతురు. దానిని పదిలము చేయుదురు. తుట్టతుదకు బాధపడుచు, విధిలేక, అంతయు వదలిపెట్టి పోయెదరు. "లోభి కళేబరము భూమిలోనికి పోయినప్పుడు, వాని ద్రవ్యము భూమిలోనుండి పైకి వెడలును." అని పెద్దలు చెప్పియుండిరి.

ఒకడు నిరతము శ్రమలకు
జిక్కి ప్రయత్నించి నిలువచేసిన నిధి వే
రొక్కడు శ్రమ ప్రయత్నంబుల
నొక్కటియును లేక దాని నూరక గొనియెన్.

సాది:—భాగ్యవంతుల లోభిత్వమును యాచ నామూలమున తప్ప ఇంకేవిధమున నీ వెరిగియుండవు. ఆశాపాశబద్ధులు కానివారికి కరుణామయులును లోభులును ఒకేవిధముగ కనిపింతురు. బంగారు పీఠమైనది యొరపురాయి కనుగొనును. లోభి యెవడైనది బిచ్చగాడు కనుగొనును.

ప్రతివాది:—నేను అనుభవపూర్వకముగ చెప్పుచున్నాను. భాగ్యవంతులు ద్వారములయొద్ద సేవకులను కాపుదారియుంతురు. ప్రియస్నేహితులనైనను రానీయక అడ్డగించుటకు ఒశిష్టకాయులైన మొరకలను నియోగింతురు. వారు సజ్జనులయు, పండితులయు మెడపట్టల నొడిసిపట్టుకొని, "ఇచ్చట ఎవ్వరును లేరు" అని చెప్పుదురు. నిజముగా సత్యమే చెప్పబడినది.

తెలివితేటలు, యోచన, తెంపుదనము
స్వామికిని లేవటన్న భావము ధ్వనింప
నింట నెవ్వరు లేరు, పొం డెచటికైన
ననుచు యుక్తంబుగా ఒణిహారి పల్కు.

సాది:—వీలయన, యాచకుల పీడింపులకును, బిచ్చగాండ్ర యాచనాలేఖలకును తట్టుకొనలేక ప్రాణము విసిగి వా రట్లు చేయుచుందురు. ఎడారిలోని యిసుక యంతయు ముత్యములైనను, బిచ్చగాండ్ర కన్నులు నిండునని తలంచుట తెలియనితనము.

నూతులు నిండునె సీతున
రాతిరి బడు మంచునీటి రవలం తోరంగన్?
ఆతత ధనధాన్యాశా
చేతస్కుల కనులు నిండి చెందునె తృప్తిన్?

కష్ట పరంపరల ననుభవించి జీవితముపై విసుగు పుట్టిన మనుష్యుడు బుద్ధిపూర్వకముగ ఘోరకృత్యములందు తన్ను తానే పడద్రోసికొనును. భగవంతుని శిక్షకాతడు భయపడడు. "ఇది శాస్త్ర సమ్మతమైనది, అది శాస్త్రనిషిద్ధమైనది" అను జ్ఞానము వానికుండదు.

కుక్క నొక మంటిపెళ్లతో గొట్టినంత
నెముక యని సంతసంబున నెగిరిదూకు;
ప్రోల శవపేటి నిరువురు మోయ గాంచి
అన్నభాజన మని యెంచు నధము డాస.

అయినను, ధనవంతుడు దైవానుగ్రహమునకు పాత్రుడగుటవలన శాస్త్రసమ్మత కార్యములనే తలపోయును. అందువలన శాస్త్రనిషిద్ధ కార్యములనుండి రక్షింపబడును. నేను నా పక్షము స్థాపించుకొనుటకు కావలసిన యన్నివాదములను దిఙ్మాత్రముగ సూచించితినే గాని ప్రమాణీకరించి వివరింపలేదు. అయినను మీ న్యాయనిర్ణయముపై నాధారపడియుండెదను.

మోసగాడు పెడరెక్కలు విరిచికట్టబడుట, అప్పు చెల్లింపనివాడు చెరసాలబడుట, అమాయికత్వము ముసుగుచింపబడుట, దొంగతనము చేసినందులకు చేయి తెగగొట్టబడుట మొదలగు ఈ దుఃస్థితులకు మూలకారణము దారిద్ర్యమేగదా! అట్లు కానిది ఎప్పుడైన నీవు చూచియున్నావా? సింహములవంటి మనుష్యులుకూడ, అక్కరవలన, ఇండ్లకు కన్నములు వేసి పట్టుపడుదురు. చీలమండెలకు వెనుకపక్క బొందలుపొడిచి వారిని తలక్రిందుగా వ్రేలగట్టుదురు.

ఒకవేళ యొక దరిద్రునికి దుర్గమమైన కామము చెల రేగినప్పుడు మనస్సును చిక్కబట్టు శక్తి చాలక, పాప కార్యము సల్పుట తటస్థింపవచ్చును. — — — — — సామాన్యముగ నమాయికు లయ్యును రిక్తహస్తు లగుదురేని క్రమక్రమముగ వారు పాపపంకిల చిత్తు లగుదురు. ఆకలిగొన్నవాడు రొట్టెను దొంగిలించును.

క్షుత్పీడితంబైన శునకంబు మాంస
శకలంబు గాంచ, విచారింపబోదు
'సాలహు' నొందె మాంసంబొ 'దజ్జాలు'
ఖరముమాంసమొ యంచు, క్షణముసేపైన.

ఎందరు పరిశుద్ధహృదయులు లేమిడిమూలమున దుర్నీతిపరులయి అమూల్యమైన వారి కీర్తిని అపయశో మారుతమున తూర్పారబట్టుచున్నారు?

ఇహభోగవిముఖత యెరియు నాకటను,
శీలంబు పుణ్యంబు చెడును లేమిడిని.

ధనికులు బీదలను చేరరానీయక తలుపులు మూసు కొందురని యింతకుముందు చెప్పియుంటివి. ఎడారు లలో నివసించుచున్న హాతీంతాయి పట్టణవాసి యయ్యె నేని బిచ్చగాండ్ర యొరపిడికి తట్టుకొనలేక దిక్కుదో పక యుండును. వారు అతని చొక్కాయిని చీలికలు పేలికలు చేసి యొడలినుండి యూడబెరికి యుందురు.

హెచ్చరింతునోయి, యెవరైన నావంక
జూచునట్లు నన్ను జూడవలదు;
బిచ్చగాండ్ర చూపు టుచ్చుల జిక్కిన
నరుని కట్టి మంచి జరుగబోదు.

ప్రతివాది:—వారి దుఃస్థితికి నాకు జాలి గలుగుచున్నది.

వాది:—వారి సంపదలపై నీకు అసూయపుట్టుచున్నది.

మేమిద్దర మిట్లు పరస్పరము వాదించుకొనుచు కాయకు కాయ యెదురొడ్డుచుంటిమి. అతడు రాజును తోసిరాజన్న నేను రాణిని అడ్డముపెట్టుచుంటిని. తుదకు అతని జతనపు సంచిలోని రొక్కము అడుగంటినది. వాదపు దొనెలోని బాణములన్నియు ప్రయోగింపబడినవి.

వాగ్వాదమున నీవు వక్తవో బోర
శస్త్రసన్యాసంబు సరికాదు నీకు;
ఎరవుదెచ్చిన మాట పారువుడాబులును
అశక్తులును దప్ప నాత డేమెరుగు?
మతశాస్త్రములలోని మర్మము ల్దెలిసి
జ్ఞానంబు కొరలేక కాన్పించుమోయి;
యమకంబు గమకంబు లలరు వాయాళి
ద్వాగంబుకడ నాయుధంబుల నిల్పె;
కోటలో నొకబంటుగూడ గన్పడడు.

కడపటికి అతని కొక్క వాదముకూడ లేకుండెను. నే నాతని క్రిందుచేసితిని. ఇందు కాతడు సహింపలేక, దౌర్జన్యము పూని, తెలివితక్కువ ప్రసంగము చేయనారంభించెను. సాధారణముగ అజ్ఞానుల పద్ధతి యిట్టిదియే. వారు ప్రత్యర్థి వాదములకు బదులు చెప్పలేక యోడిపోయినప్పుడు ద్వేషము ప్రకటింతురు. విగ్రహ శిల్పియైన 'ఆజరు' కుమారునితో (అబ్రహాము) వాదింపలేక తగవుపెట్టుకొనెను. ఖురానులో నిట్లు చెప్పబడి యున్నది: "నీ వీ వాదమున కొప్పుకొననియెడల రాళ్లు రువ్వి నొప్పించెదను."

నన్నాతడు దూషించెను. నే నాతని నిందించితిని. అతడు నా మెడపట్టను ఒడిసిపట్టుకొని చింపివేసెను. నే నాతని గడ్డమును పట్టుకొని తెగగుంజితిని. మేము ఒకరిపై నొకరు తలపడితిమి. ప్రజలు పొట్టలుబ్బ నవ్వుచు, వేడుక చూచుటకు మావెంట పరుగెత్తుచుండిరి. మా యీ చేష్టల వినికిడివలన లోకము ఆశ్చర్యముతో ప్రవేలుకరచెను.

కడకు మా వివాదములను న్యాయాధిపతికి విన్నవించి ధనికులకును, దరిద్రులకును గల తారతమ్యము న్యాయ్యముగా నిర్ణయింపవలయుననియు, ఆ తీర్పునకు మేము బద్ధులమైయుందు మనియు తెల్పితిమి.

న్యాయాధిపతి మా స్థితిగతుల నరసి, మా వాదప్రతి వాదములను విని, తలవంచుకొని, ముందు వెనుక లాలోచించి, కొంతసేపైన పిదప తలయెత్తి నాతట్టు చూచి యిట్లనియెను:

"ఓయీ, నీవు భాగ్యవంతులను ప్రశంసించి బీదలను నిష్ఠురముగ మాటలాడితివి. గులాబియుండుచోట

మల్లుకూడ నుండునని తెలిసికొమ్ము. సారాయితోడ మత్తుండును. పెన్నిధి యున్నచోట పాముండును. ఆణిముత్యము లుండుచోట మనుష్యులను దిగమ్రింగు మకరములు, చొరచేపలు నుండును. ఐహిక భోగమకరందమునకు మృత్యువుకాటు వెన్నంటియుండును. స్వర్గసౌఖ్యములకు ముందు సైతాను గోడవలె నిలిచియుండును.

ఇంపుల నెలంత ప్రియుని హింసింపకున్న
నేమిసేయును ప్రత్యర్థియీనుగోను ?
మల్లుపన్నీరుపువ్వు, సమ్మోహము ఖేద,
మహియు బెన్నిధి, యన్యోన్య మనుసరించు.

తోటయందు కస్తూరిపుంగ లున్నచోట ఎండిన చెట్లమోడు లుండుట నీవు చూచుట లేదా ? ధనికుల యందుకూడ నట్లే కొందరు కృతజ్ఞులు, కొందరు కృతఘ్నులు నుందురు. అట్లే నిరుపేదలందును సహనము గలవారు, దుడుకుపడువారు నుందురు.

మంచితుంపురులెల్ల మంచిముత్తెంబు
లైన, గవ్వలయట్టు లంగళ్లు నిండు.

దరిబేసి స్వభావము గల భాగ్యవంతులు, భాగ్యవంతమైన హృదయము గల దరిబేసులు భగవంతునికి సమీపవర్తు లగుదురు. దరిబేసుల సుఖదుఃఖములతో సహానుభూతి గలవాడే భాగ్యవంతులలో నుత్తముడు. దేవునియందు విశ్వాసము గలవానికి ఆయన విశ్వదాత యగును."

అంతట నన్ను మందలించుట చాలించి, దరిబేసితట్టు తిరిగి న్యాయాధిపతి యిట్లనియెను : "ఓయీ, ధనవంతులు నిషిద్ధకార్యము లొనరించుచుందురనియు, భోగమత్తులనియు నిందించితివి. నీవు వివరించినట్టి గుణములుగల సంకల్పశూన్యులు, కృతఘ్నులు వారిలో నున్నారు. వారు సంపాదించి కూడబెట్టెదురు ; తా మనుభవింపరు ; ఇతరులకు పెట్టరు. అనావృష్టివలన కరవు వచ్చినను, అతివృష్టివలన వెల్లువ పెట్టినను తాము క్షేమముగ నుందురన్న నమ్మకముచేత దరిబేసుల కష్టములను విచారింపరు. దేవునకైన భయపడరు.

తిండిలేక యొక్క దీనుండు మరణింప
"అంత నాకు గలదు, చింతయేల ?
బాతుకేమి భయము పల్లెవెల్లువపెట్ట"
ననుచు నధమధనికు డెనయు దృప్తి.

ఒంటె యంబారితొట్లలో సుఖముగ కూర్చుండి పయనించువారికి ఎడారియిసుకలో పడిచచ్చు బాటసారిపయి ఏమి కనికరము ?

తన చంపి గొంగడిని చ
య్యన బయటికి దెచ్చుకొన్న యధమాత్ముడు లో
ననుకొనును "లోకమెల్లను
మనినను మాడినను నాకు మాత్రము సుఖమా."

నీవిప్పుడు నినట్టి ప్రవర్తనము గలవారు కొందరున్నారు. కాని మరికొందరు బీదాబిక్కకు ధనధాన్యములు పంచిపెట్టు కరుణామయహృదయులు, కీర్తికాములు, క్షమాపరులు, ఇహపర సుఖాసక్తులు కూడ నున్నారు.

సకల సామ్రాజ్యపట్టాభిషిక్తుడు, న్యాయవర్తనుడు, మతవిశ్వాసపూర్ణుడు, విజయధ్వజుడు, రాజాధిరాజు, ఇస్లాంమతదుర్గసంరక్షకుడు, సులేమాన్ రాజ్యమునకు వారసు, సమకాలీననృపులలో న్యాయవంతుడు ముజఫరుద్దీన్ వద్దీన్ అతబక్ అబూబకర్ బిన్ సాద్ జంగి (దేవు డాయనకు చిరాయువు నొసగి, ఆయన ధ్వజములకు విజయము చేకూర్చుగాక !), వారి దాసులు కూడ భాగ్యవంతులలో పైని చెప్పబడిన యుత్తమ వర్గమునకు చెందినవారు.

కరుణమెయి మీరు ప్రజలను గాచునటుల
దండ్రి బిడ్డలసైతము దనుపలేడు ;
సృష్టికర్త యిలకు మేలుసేయు కోర్కె
సకలసామ్రాట్టుగా మిమ్ము సలిపినాడు.

న్యాయాధిపతి యీవిధముగ మాయూహ కతీతమగునట్లు ఉపన్యసింప విని ఆయనతీర్పును శిరసావహించితిమి. ఇదివరకు జరిగిపోయినదానికి పరస్పర క్షమార్పణము వేడుకొని, కలహము మాని, సమాధానము చేసుకొని దోషపరిహారముగ ఒకనిపాదములం దొకడు తలమోపి, మోములు ముద్దిడుకొని మా వితర్కమును ఈ పద్యముతో ఉపసంహరించుకొంటిమి.

కటిక నిరుపేద, వరకు కాలగతికి
అట్టి యూహల మగణించు టార్తికరము ;
ధనికుడా, యిచ్చ శక్తియు దనగు నీకు,
ఇమ్ము కుసుమము గాంచెద విహము పరము.

# పద్యానికి రాగం నిండు తెస్తుందా?

— శ్రీ శ్రీపాద

౧

అయితే ఎందుకు మరి రాగాన్ని పద్యంమీద సవారి చేయించడమూ? అని ప్రశ్న వేస్తే "ఆనందం కోసం" అని జవాబు వస్తుంది. అవును. అదే అసలు కారణం. వినేవాళ్ళు పద్యంపాటని సహిస్తున్నారంటే ఈ ఆనందానికి లోభించే. కవులు తమ రచనల్ని పరాయి వాళ్ళ చేత పాడించుకున్నారంటే, ఈ సౌందర్యం ఎక్కడ లోపించిపోతుందో అనే. ఈ ఆనందము న్యాయమే అయితే తప్పకుండా లోభనీయమే. "న్యాయమో అన్యాయమో — ఆ చర్చ నాకక్కర లేదు. నాకు పద్యాలు పాడితేనే బాగుంటాయి" అనే పండితులకి ఒక్క నమస్కారం. వారు వాదానికి అతీతులు. పద్యాల్ని పాడడం అన్యాయమైతే తప్పకుండా మానివేయవలసిందే అనే వారికోసము రాస్తున్నాను ఈ వ్యాసాలు.

పద్యాల్ని పాడడం అన్యాయమంటున్నాను. కారణాలు మనవిచేస్తున్నాను.

'ఒకరు ఇచ్చిన కేట్లాగు నుంచుకొనక,
పారవేయుట ఘోరమా పాతకంబు'

అనే పద్యం ఎవరికీ రసానందం ఇయ్యదు. ఈ పద్యాన్నే చక్కని రాగవరసతో చదివితే దీనికి విజాతీయ సౌందర్యం చేరుతుందని అందరూ ఒప్పుకుంటారు. ఈ రీతిగానే తాను చేరే పద్యానికల్లా కొద్దో, గొప్పో, అదివరకులేని కొత్త సౌందర్యం తెస్తుంది రాగం. ఈ అదనపు సౌందర్యం రాగానిదే; పద్యానిది కాదు. ఈ కృత్రిమసౌందర్యం అసహాయశక్తి అయిన కవిత్వానికి లోభనీయమూ కాదు, గౌరవప్రదమూ కాదు. 'చక్కని రాగవరసతో చదివినపద్యము వినువారికి హాయి గొల్పును. అట్లు కాదేని అదియొక రోదయగును' అన్నారు కాశీభట్ట సుబ్బరామశాస్త్రిగారు. ఎరువుసరుకు పెట్టుకోకపోతే అందం పాడైపోతుందనడము కాదూ ఇది? (ఇంతకీ సుకుమారసంగీతగతప్రాణులు సాహిత్యంలో ప్రవేశించడంవల్ల వారికీ సుఖం లేదు, సాహిత్యానికీ శోభరాదు.) రాగం పద్యానికి ఎరువు సరుకా అంటారేమో? ఆహా. ఎరువుసరుకే. పుట్టుకలో లేదు పోయి కావ్యరూపంగా ప్రపంచానికిచ్చినప్పుడూ రాగప్రశంస లేకపోయె. ఇంక రాగం మధ్యగాళ్లు తెచ్చి పెట్టినది కాక మరేమిటవుతుంది?

అసలు కవిత్వమూ, గానమూ వేర్వేరుకళలు. పద్యమూ, రాగమూ ఈ వేర్వేరు కళలకి సంబంధించినవి కాబట్టి అవీ వేర్వేరేగాని చేరికగలవి కావు. "సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః కుచద్వయం" అంటే రెండూ ఎప్పుడూ కలిసే వుండాలి అనే అర్థము కాదేమో అంటాను. రాగానికి సాహిత్యంలేదు, మిలిటరీ బ్యాండుకి లేదు, శ్రీకృష్ణుని వేణుగానానికీ లేదు. అలాగే గద్యంలో రాగంలేదు. ఏకవీర, మాలపల్లి నవలల్లో గొప్ప కవిత్వము ఉంది, రాగములేదు. కాబట్టి 'కవిత్వమూ, సంగీతమూ ఎప్పుడూ చేరేవుండాలి' అనడంలో సబబులేదు. ఇక, రెంటినీ కుచద్వయంతో ఎందుకు పోల్చారు? అంటే, రెండూ శబ్ద సంబంధులు కావడముచేతనేమో అంటాను. సంగీతమూ, సాహిత్యమూ వాక్కుకు సంబంధించినవి. కాబట్టి వాగ్దేవికుచద్వయమన్నారు.

అలాగ అన్నవారే తమ అర్థాన్ని రెండో పాదంలో వివరించారు, చూడండి. "ఏక మాపాతతో రమ్యం, అన్య దాలోచనామృతం." కుచద్వయం పోలిక రెండో పాదానికి చెల్లదు. సంగీత మాపాతతో రమ్యము. సాహిత్యానికి ఆలోచన కావాలి. ఇవి

రెండూ, రెండు సంబంధములేని కళలు. (కవిత్వము, లేదా) పద్యము మాటలతో ఏర్పడుతుంది. రాగం స్వరాలతో ఏర్పడుతుంది. మాటలకి 'ఇవీ' అని అర్థాలుంటాయి. మాటలతో రచించిన పద్యానికి 'ఇదీ' అని ఒక దండాన్వయ ముంటుంది. ఆయా మాటలకి ఆయా అర్థాలని ఎరిగినవారికందరికీ ఈ దండాన్వయం ఒక్కటే. దీని ద్వారా పొందే ఆనందమూత్రం వ్యక్తుల సంస్కారాన్ని బట్టివుంటుంది. కవిత్వము మతిగల మానవులకుమాత్రమే అందుతుంది. రాగానికి అర్థమంటూ ఏదీ లేదు. రాగముయొక్క సంబోధనము భాష తెలిసిన మానవత్వానికి కాదు, సర్వజీవుల్లోనూ వున్న చైతన్యానికి. కవిత్వం భావాల్ని చెప్పి చెప్పి గింజుకుంటున్న సమయంలో రాగం అందుకుంటుంది. 'అమ్మా, ఆకలేస్తోంది' అంటాము; 'కడుపు మాడుతోందే' అంటాము; 'అబ్బా. అన్నం పెట్టవే' అంటాం. ఇంకా ఏమేమిటో అంటాం. ఈ భావాల్నన్నిటినీ 'మ్యావు' అన్న ఒక్క పిల్లి అరుపులో మాత్రం ట్టి ఇచ్చేస్తుంది నాదం. సంగీతమూ, సాహిత్యమూ చేరి నడిచే కళలు కావు. కవిత్వానికి అందని ఎత్తులకి సంగీతం ఎగురుతుంది. దాని క్షేత్రము వేరే, దీని క్షేత్రము వేరూను.

పద్యానికి అందం తెచ్చే పరిస్థితులూ, రాగానికి అందం తెచ్చే పరిస్థితులూ వేరు. పద్యానికి భావం పూర్తి అయేటట్టు చేసే విరుపులూ, మాటల ప్రాధాన్యతని తెలిపే ఉదాత్తానుదాత్తాలూ అందం తెస్తాయి. పద్యం చదువుతున్నప్పుడు మాటలు వేటికవి తెలిసిపోవాలి. లేకపోతే భావాలు సరిగ్గా అవగాహనకావు. రాగానికి గమకాలూ, సంచారవైలక్షణ్యతా అందం తెస్తాయి. గమకం అంటే స్వరముయొక్క కంపము. (అంటే స్థైర్యానికి విరోధి) తోడిరాగములోని 'రిషభము' చలనశీలి. నిలిచి వినేబడదు. గమకాలన్నీ చలనశీలత్వం కలిగినవే. ఆరోహణమూ, అవరోహణమూ అనే గమకాలీసత్వాన్ని చక్కగా చూపిస్తాయి. మన సంగీతానికి నిలిచి వినిపించే స్వరాలకంటె, గమించే వాటి అంతరాలే అందం. రాగము స్వరాల ప్రవాహం. ఆ ప్రవాహంయొక్క గమనంలో పైకాలపు స్వరముల గుత్తులూ, మొదాటికాలపు స్వరాల జారులూ (ఆరోహణమూ, అవరోహణమూను), సంచార వైలక్షణ్యతా అందాలు.

పద్యానికి గురులఘుబద్ధమైన గతి వుంది. వచనంలో లేని ఈ గతివల్ల పద్యానికి ఠీవి, నడకా అలవడ్డాయి. వచనము పాకుతుంది. పద్యం అడుగుతీసి అడుగు వేస్తూ నడుస్తుంది.

"ఆగ్రహక్షమామండ లాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు"

అని చదివినప్పుడు యతిఅక్షరాలమీద నొక్కులు నీసపద్యగతినీ,

"మెలత నడవినుంచి మృగము వెంటనె పోయె
రామచంద్రు బోలు రసికుడేడి"

అని చదివినప్పుడు ఇంద్రగణాల వేర్పాటు ఆటవెలదిగతినీ స్ఫురింపజేస్తాయి. పద్యాల కన్నిటికీ వాటి వాటికి విలక్షణమైన నడక లున్నాయి. ఈ నడకలకి అన్నిటికీ ప్రత్యేకమైన అంద ముంది. ఒకదాని అందం మరొకదానిది కాదు...రాగానికి గతి అంటూ ఏదీ లేదు. రాగం నడవదు, ప్రవహిస్తుంది. మందప్రవాహమూ, శీఘ్రప్రవాహమూ తప్ప ఒకరకపుగతి అంటూ లేదు రాగానికి. అటు కూడదీసుకుంటూ, ఇటువైపు దగ్గరగా తోసుకుంటూ, గిరగిరా తిరుగుతూ, గవ్వలు గిలకరించినట్లు, మువ్వలు మోగినట్లు, లత పాకినట్లు, చక్రం తిప్పినట్లు సాగిపోతుంది రాగం.

పద్యంనడక భూమిమీదే. ఒక పెద్దఅడుగూ ఒక చిన్న అడుగూ వేసుకుంటూ పటాలంలాగా, తెడ్ల నావలాగా సాగిపోతుంది పద్యం. ప్రాచీనకవులు పద్యం నడకని మదపుటేనుగు నడకతోనూ, గుర్రంనడకతోనూ పోల్చారు. పద్యం నడక సమతలభూమిమీదే. ఒకే స్థాయిలో ఉంటుంది పద్యం. ఆపులూ, జారులూ, ఊపులూ మాత్రం వుంటాయి...రాగం ఏనుగు ఈదినట్టూ, నావ సముద్రతరంగాలమీద ఊగినట్టూ, గాలికి మన ఉత్తరీయం తరంగితమైనట్టూ, నిమ్నోన్నతాలతో ఊగుతుంది. రాగం చేసే సంచారం విహాయసపథంలో; నేలమీద కాదు. రాగానికి జీవం వైవిధ్యం

దగ్గరచేసే సంచారమని అరియకుడివారి నమ్మిక. రాగానికి అల్లికే అందమని శెమ్మంగుడివారి ఆశయం. వాయించినదానికంటే ధ్వనింపజేసే భాగం అందమని నాయుడుగారి ఉద్దేశం. ఇవన్నీ రాగసంచారాన్ని ముగ్గురు పండితులు మూడువిధాలుగా జీర్ణము చేసుకున్న రీతులు. అన్నిటిలోనూ రాగం చేసే నిమ్నోన్నతసంచారం వ్యక్తమౌతూనే వుంటుంది. ఒక స్వరం దాటితే రెండోదానికి దిగడమో, ఎక్కడమో వుంటుంది. పద్యంలో ఒక గణం దాటితే అంతకన్న పొడుగుదో పొట్టిదో మరోగణము వస్తుంది. కాని దిగడమూ, ఎక్కడమూ వుండదు.

కాబట్టి పద్యగమనానికీ, రాగగమనానికీ పోలిక లేదు. పద్యానికి అందం తెచ్చే అంశాలకీ, రాగానికి అందం తెచ్చే అంశాలకీ పోలికలేదు. దాని సౌందర్యం దీనికీ, దీని సౌందర్యం దానికీ విజాతీయం.

“విజాతీయమైతే కావచ్చును గాని విరోధముందని ఏమిటి నిశ్చయం?” అని అడుగుతారేమో. విరోధము అసలే లేదనీ, పైపెచ్చు సహకారము కావలసినంత వుందనీ వాదించేవారున్నారు. వారి వాదానికి సారము ఇది—“ప్రతికళయందును కొంత విశిష్టమైన మేలిమియు కలదు. అట్టి కొదవయు గలదు. ప్రతికళయు తనయందలి కొఱత తెలుసునుగావునవే తన ప్రధానధర్మమును చక్కగా నెరవేర్చుటకు ఇతర కళల సాహాయ్యము నపేక్షించును” అని. కవిత్వము స్థూలభావములనే ప్రదర్శించగలదు గాని సూక్ష్మసూక్ష్మాతిభావములను ప్రదర్శించలేదనీ, గాన మీపనిని నెరవేర్చగలదు కాబట్టి సాహిత్యపు స్థూలభావాలకి గానము సూక్ష్మసూక్ష్మతరభావాల్ని చేర్చినట్లయితే బంగారానికి తావి అబ్బినట్లుంటుందనీ వారి ప్రాయము.

మాటవరసకి ఇది నిజమే అనుకుందాం. అయినప్పుడూ, ఏకవిపద్యమునైనా పదిమంది పాడినప్పుడు, ఆ పదిమందిలో ప్రతి ఒక్కరూ, ఆ కవిగారి స్థూలభావాలకి తమ సూక్ష్మసూక్ష్మాతిభావాల్ని చేర్చారన్నమాటేకదూ? నన్నయగారి పద్యాలికి మన సూక్ష్మసూక్ష్మాతిభావాల్ని చేర్చడము ఆయన కపచారము కాదూ. ఒకవ్యక్తి ఒక ఉపాఖ్యానాన్ని పాడి వినిపించాడంటే అందులో ఈయనగారి సూక్ష్మసూక్ష్మాతిభావాలు దండిగా చేరతాయి. మరోవ్యక్తి పాడివినిపిస్తే ఆయనభావాలు చేరతాయి. కవిగారి భావాలికి ఎవరికితోచిన సూక్ష్మభావాల్ని వారు చేర్చినట్లే అవుతోంది మొత్తానికిది. నటరాజ విగ్రహానికి మనము రంగు పూయడము వంటిదే ఇది. అమ్మయ్యో! నా కంత అహంకారము లేదు.

గానము కవిత్వానికి నిండు తెస్తుందా? అసలు తేగలదా? అనే ప్రశ్న వేసుకుని ఇప్పుడు తర్కిస్తాను. నిండు తేవడమంటే పద్యసౌందర్యము వ్యక్తమయ్యే పరిస్థితులకు వ్యతిరేకి కాకుండా, తన సౌందర్యాన్ని పద్యానికి చేర్చడము. రాగం ఈసత్కార్యాన్ని అసలే చెయ్యలేదంటున్నాను. రాగం రాణించగల పరిస్థితులకీ, పద్యం రాణించగల పరిస్థితులకీ చుక్కెదురు. ఒక పద్యంయొక్క భావం శ్రోతలకి చక్కగా, సులువుగా అందాలంటే ఆ పద్యంలోని అర్థమూ, వ్యంజకశక్తీ, పోహళింపులోని సౌందర్యమూ చక్కగా వ్యక్తమయేటట్టు కావ్యపఠనం జరగాలి. రాగానికి అందం తెచ్చే అంశాలే వేరు. స్వరాల స్ఫుటత్వమూ, గమకసంపదా, ఆరోహణావరోహణాల వక్రవేగసౌందర్యమూ—ఇవి బాగుంటే రాగం బాగుంటుంది. పద్యంలో రాగాన్ని కలిపి పూన్చినప్పుడు పద్యపఠనానికి అందం తెచ్చే సాధనాలు రాణిస్తూనే వుండి, ఈ సాధనాలకి తోడు రాగానికి అందం తెచ్చే సాధనాలుకూడా రాణిస్తే పద్యగానం కవిత్వానికి కోరదగినదే. కాని అసలు జరిగేదేమిటి? 'పద్యానికి రాగాన్ని చేర్చి నడిపినప్పుడు అటు పద్యపఠనానికి అందం తెచ్చే సాధనాలూ, ఇటు రాగానికి అందం తెచ్చే సాధనాలూ చెక్కుకు పోతాయి. ఎలాగు చెక్కుకు పోతాయో వివరిస్తాను, చిత్తగించండి.

పద్యంలోని అక్షరాల గురులఘుభేదాన్ని స్ఫుటంగా ఉండనీయక, గమకాలు వాటిని సాగతీస్తాయి. తమంతట తామే రంజించే శక్తి కలిగిన స్వరాలు తాము పట్టుకునే అక్షరాలకన్న మెరుగెక్కి మాటల్ని నాదంలో ముంచుతాయి. ఒకేమట్టంలో

సాగిపోయే పదములయొక్క స్వరాలను రాగంలోని ఆరోహణావరోహణాలు కిందికీ మీదికీ వంచేసి పదముల పోహళింపుసౌందర్యాన్ని చెడగొట్టుతాయి. మాటల వ్యంజకశక్తిని పోషించే ఉదాత్తానుదాత్తాలు, స్థాయీభేదమే సైజంగా గల స్వరాల సంచారంలో చిక్కుకుపోతాయి. ఛందోగతివల్ల పద్యానికి రావలసిన విలక్షణసౌందర్యాన్ని రాగగతి మింగేస్తుంది.

అదీ పద్యానికి రాగము చేసే కీడు. ఇక సాహిత్యం రాగానికి చేసే కీడును పరికిద్దాం. అక్షరాల గురులఘుభేదం ఎక్కడ విపరీతంగా లోపించిపోతుందో అని గమకాలు మొగమాటపడి లోపించిపోతాయి. ప్రతిస్వరమూ తన స్ఫుటత్వాన్ని అక్షరముయొక్క క్రీనీడలో చేరివుండే నిరూపించుకోవలసిన అవసర ముంటుంది. కనుక, రాగాలాపనలోని గమకసౌందర్యమూ, స్వరముల స్ఫుటత్వమూ పోయి రాగము ఆరోహణావరోహణాల సౌందర్యముమీదనే ఆధారపడుతుంది. కాబట్టి పద్యానికి రాగం చేరిస్తే, రాగము తన సౌందర్యాన్ని కొంత త్యాగముచేసి పద్యసౌందర్యాన్ని కొంత లోపింపజేసి దాన్ని ఆధిక్షిస్తోంది. రాగంలో పోయేవి గమకాలూ, పద్యానికి పోయేవి ఉదాత్తానుదాత్తాలూను. రాగముయొక్క చైతన్యం గమకాలూ, సాహిత్యంయొక్క చైతన్యం ఉదాత్తానుదాత్తాలూను! పద్యగానమంటే చైతన్యం వినా సంగీతసాహిత్యాలన్నమాట!

'కీర్తనలు కూడా అంతేనా?' అని అడుగుతున్నారు కొందరు. ఆహా. అంతే. కీర్తనలలో సంగీతానిదే రాజ్యము. సాహిత్యము కీర్తనలోని సంగీతానికి బంటు. సంగీతసాహిత్యాలు కలవవు. కలిపితే ఏదో ఒకటి తరుక్కుపోయిందన్న మాటే. తొలిరోజుల్లో ఆట, తరవాత పాట, తరవాత మాటా పుట్టాయని సంస్కృతిపరులందరూ ఒప్పుకునేమాటే. ఆటకి 'భాష' చాలనప్పుడు మాటలతో కలిసిన పాట అవతరించింది. భరతాచార్యుల కాలంలోని క్రీడనీయకాలకి నాట్యమూ, స్వరతాళపదాశ్రయమైన గాంధర్వమూ, అభినయమూ కూడ వలసివచ్చింది. అంతకు ముందు ఈమూడూ వ్యాప్తిలో ఉండనే ఉన్నాయి కాని మహేంద్రవిజయధ్వజ నాటకంలోనికి వీటిని మూడింటినీ గ్రహించి నృత్యగీతవాద్యాలకి సభాగౌరవం కలిగించినవాడు భరతాచార్యుడు. స్త్రీపురుషుల అన్యోన్యప్రేమకి సంబంధించివుండడముచేత స్వరతాళపదాశ్రయమైన గాంధర్వాన్ని బౌద్ధులు బహిష్కరించారు. కాని జనసామాన్యానికి ఈ కళలలో గల అభిమానాన్ని బట్టి వాద్యసంగీతాన్ని మట్టుకు ఊరేగింపుల్లో బాహాటంగా ఉపయోగించుకున్నారు అని జాతకకథల్నిబట్టి తెలుస్తుంది. వీణావాదనమూ, దానికనుగుణంగా నృత్యం చెయ్యడమూ రాజుల అంతఃపురాల్లో ఉండేవి. నృత్యగీత వాద్యాలుమాత్రం మారుడి సాధనసామగ్రిగానే చూపించారు బౌద్ధశిల్పులు. మహాయానబౌద్ధంతో నృత్యగీతవాద్యాలు భూలోకంలోకి దిగేయి.

(అమరావతి శిల్పంలోని 'సర్వతోభద్రము' చూడండి) కాని కీర్తనలకి పూర్తిగా ఆంక్ష తొలిగిపోలేదు. (నాగార్జునకొండలో పంచాసికుని గానానికి బౌద్ధులు చెవులలో వేళ్లు పెట్టుకున్నారు.) గానమూ, తక్కిన కళలూ పూర్తిగా అడుగునిపడిపోకుండా రాజులు కాపాడేరు. (కాళిదాసు అజుడిచేత "ప్రియశిష్యా లలితే కలావిధౌ" అని ఏడిపించాడు) సముద్రగుప్తుడి చేతిలో వీణ ఉంది అతని నాణేల్లో. జంత్రగాత్రాలు నాట్యంనించి విడిపోయా యన్నమాట గుప్తుల కాలం నాటికి! జంత్రమే లేని నోటిపాట అజంతాలో కిన్నరదంపతుల్లో కనబడుతోంది. కాని అప్పటికి సంగీతమనబడే నృత్యగీతవాద్యాల చేరికకి గౌరవం ఉన్నట్టుగా హర్షుని 'రత్నావళి' సాక్ష్యమిస్తుంది. కవులూ, సంగీతశాస్త్రకారులూ నృత్యగీతవాద్యాలకే సంగీతము అని పేరు పెట్టారు. కాని 'అన రాగమూ, స్వరమూ, తాళమూ చేరిందికూడా సంగీతమే అన్నారట. నేడు మనం 'సంగీతం' అనే కళ ౧౨ వ శతాబ్దంనాటికి నాట్యంయొక్క బానిసత్వంనించి పూర్తిగా తప్పుకునేటంత పెరిగిందన్నమాట. జయదేవుడూ, మీరాబాయీ మొదలైన వాగ్గేయకారుల ధర్మాన్ని సంగీతసాహిత్యాల చేరికకి సత్త ఏర్పడింది. కాని కృష్ణరాయల కాలంవరకూ జంత్ర

గాత్రాలకే ప్రాధాన్య కీర్తనలలో చాలా చరణాలుండేవి. వాటినిండా అక్షరాలే. తాళ్ళపాకవారు పల్లవీ, అనుపల్లవీ, చరణమూ అనే మూడింటినీ వాడి కీర్తనాశిల్పాన్ని పెంచారు. క్షేత్రయ చౌకకాలంలో పదాల్ని రచించి రాగానికి కీర్తనలో ఎక్కువ చోటు కల్పించాడు. త్యాగరాజస్వామి సంగతులపద్ధతిని ప్రవేశపెట్టి కీర్తనలోని సాహిత్యాన్ని గుర్రంమీదినుంచి దింపి రాగాన్ని గుర్రమెక్కించారు. తోడి శివరామయ్యవంటివారి ధర్మాన్న రాగాలకి సభాగౌరవం కలిగింది. ఈ నాడు వేణువుకీ, వీణకీ, ఫిడీలుకీ, జలతరంగిణికీ తని కచేరీలు కల్పించి, రసికులు సాహిత్యసాహచర్యం లేని సంగీతాన్ని గుర్తించుకుంటున్నారు. గ్రామఫోనుధర్మమా అని నాయడుగారి వంటి సంగీతోపాసకుల రాగాలాపనకే స్వతంత్రస్థాయి కలిగింది. కాలక్రమాన్ని మీరూ, నేనూ ఊహించలేనంత చిత్రంగా సంగీతము సాహిత్యాన్ని ఒక్కతాపు తంతుంది. అస్తు.

కాగా, కీర్తన ఇంకా సంగీతానికి ఆధారమాత్రంగా పట్టుకుని వ్రేలాడుతూన్న సాహిత్యానికి ఉదాహరణం. కీర్తనలో సంగీతసాహిత్యాలు గంగాయమునల్లాగ కలిసివున్నాయనీ, అరవలు సాహిత్యాన్ని పాడుచేస్తున్నారనీ జరిగే ప్రచారం మనల్ని వెనక్కియీడుస్తోంది. కీర్తనాసాహిత్యాన్ని ఎవరూ వేరే పాడుచెయ్యనక్కరలేదు. అక్షరస్వరాల కాలంనించి (రాగస్వరూపాన్ని ఆరోహణావసానాన్ని చూపించే) అనుపల్లవికాలానికీ, అక్కడనుంచి సాహిత్యాన్ని చిందరవందరచేసే చౌకకాలపు పదాలకీ, తరవాత సాహిత్యాన్ని ముక్కలుగా కొట్టేసే సంగతుల కాలానికీ జరిగిన వాగ్గేయకారులే మరికొంత కాలానికి సాహిత్యాన్ని ఒక్కతాపు తంతారు. కాబట్టి సంగీతసాహిత్యాల ప్రత్యేకతని మనం ఎంత త్వరగా గుర్తించుకుంటే అంత మేలు. గుర్తించుకోకుంటే ఆకళలు ముందుకి సాగిపోతాయి. మనమే వెనకపడతాము. పద్యంలోని రాగం సాహిత్యాన్ని పట్టి ఈడిగిలబడుతూన్న సంగీతం. దాన్ని ఒక్కతాపుతన్నండి అంటాను.



అఖిల ఆసియా మహాసభవా రేర్పరచిన—

# ఢిల్లీ చిత్రశాలలోని కొన్ని చిత్రాలు



అందమైన ప్రకృతి : అగ్నిపర్వతాలు

— ఒక అజ్ఞాత చిత్రకారుని బాలీవర్ణచిత్రము —



— మారుని కుమార్తెలు —

సింహళ వర్ణచిత్రము. చిత్రకారుడు : శ్రీ యస్. వి. సకలసుతియ.



చిత్రరేఖల జాడీ

మొహెంజోదారోలో దొరికిన మట్టిపాత్ర



మొహెంజోదారో కళాక్షేత్రము

ఆర్షశాఖవారి త్రవ్వకాలు



స్త్రీ సబల

మొహెంజోదారోలో దొరికిన తామ్రప్రతిమ



'ప్రేమాద్వైతము'

—నీటిరంగుల భారతీయ చిత్రము చిత్రకారుడు : శ్రీ అమూల్యగోపాలసేన్.—

# రస్కృతి

[కథానిక]

శ్రీ. పినిశెట్టి శ్రీరామమూర్తి =

నారాయణదాసు గారింట్లో ఆ ఒక్క గాని ఒక్క కోడలూ కొడుకైన రమేశుకు ఏమాత్రం నచ్చలేదు. కాని లోకందృష్టిలో కమల అందవికారి కాదు. ముక్కూ కన్నూ తీరు బాగానే ఉన్నా, రంగుకు ప్రాముఖ్యమిచ్చే రమేశుదృష్టికి ఆమె చామనచాయ ఏమీ తృప్తిగా కనుపించలేదు.

అందులోనూ ఈసంవత్సరం బి. ఏ. పరీక్షకు కూచున్న రమేశుకు—విమర్శించేకొద్దీ—తల్లిదండ్రులు తన కెంత అపకారం చేశారో అవగాహన కొచ్చింది. నీతిశాస్త్రరీత్యా ఆ అపకారానికి ఉపకారం చేయ లేదు గాని, మరోవిధంగా అపకారంచేసి వృద్ధులయిన తల్లిదండ్రులను బాధపెట్టే నిర్ణయానికి మాత్రం రాలేదు.

కలకత్తాలో పరీక్షలు అయిపోగానే ఇంటికి చేరుకున్న రమేశు, చిరునవ్వులతో ఎదురుగా వచ్చిన కమలను చూచినమీదట, ఇంటివద్ద ఆట్టేకాలాన్ని వృథాచేయకూడ దనుకున్నాడు.

తల్లిదండ్రులు వేసిన కుశలప్రశ్నలకు సమాధానం యిచ్చి, భోజనం చేసినమీదట మేడమీదకు పోయి తన గదిలో కూర్చొని, ఏదోపుస్తకం తెరిచాడు రమేశు.

కమల తన పనులు ముగించి, భర్తయొక్క ప్రశాంతవీక్షణప్రసాదంకోసం మేడమీదకు వెళ్లింది. పుస్తకం చదువుకొన్న రమేశుకు కమలరాక ఏమీ ఆనందాన్ని ఇవ్వకపోగా, ఏకాంతవాసానికి భంగం కలిగించింది.

కుర్చీమీదనుంచి లేచి, పుస్తకం డ్రాయరుమీద పెట్టి, తెల్లని తుండును పైన వేసుకొంటోన్న రమేశును—

“ఇంత ఎండలో ఎక్కడికీ ప్రయాణం” అని అడిగింది కమల.

రమేశు సమాధానం ఇవ్వలేదు. ఆమెకేసి చూడనే లేదు. బహుశా ఒక అల్పజీవి తన దయాదాన భిక్ష కోసం అర్రులుచాచి అపేక్షిస్తుం దనే ఆలోచనకూడా అతనికి లేదేమో! చరచరా క్రిందికి దిగివెళ్లిపోయాడు.

తాను క్రితం చేసినదిగాని, ప్రస్తుతం చేస్తోన్నది గాని భర్తపట్ల నేరం ఏమిటో ఆమెకు అర్థం కాలేదు. తన ప్రతినడవడినీ మనోదృష్టిలో మరోమారు ప్రతిబింబింపజేసుకుంది. ఎవ్వరూకూడా వేలుపెట్టి చూపగల నేరం తానేమీ చేయనట్లుగా నిర్ధారణచేసుకుంది. కాని తాను ఆసించినదానికి ప్రతిఫలంగా తిరస్కృతి శరం ఆమె అమాయకహృదయంలో నాటుకుంది. రెండు అశ్రుకణాలుకూడా ఆమెకళ్లల్లోంచి క్రింద జారిపడినై.

“కమలా” అని అత్తగారైన మంగతాయి మేడ మెట్లెక్కుతూ పిలిచిన ఆ పిలుపు కమలను ఈలోకంలో పడేటట్లు చేసింది. తొందరగా పయిటచెంగుతో కళ్ళు తుడుచుకుంది. గదిగుమ్మందగ్గరగా వచ్చిన మంగతాయి—

“వా డెక్కడికి పోతున్నది?” అని అడిగింది.

“నాతో వారేమీ చెప్పలేదు.”

“నువ్వేమీ అడగలేదా?”

“అడిగాను...” కమల మొగం పక్కకు తిప్పుకుంది.

కొడుకుయొక్క నడతను మొదట్నుంచీ గమనిస్తోన్న మంగతాయి తన సంశయ నివృత్తికి మరో ప్రశ్న

వేయనక్కర్లేకుండానే గ్రహించుకోగలిగింది. నెమ్మదిగా ఆమె క్రిందకు దిగి వెళ్లిపోయింది.

పురుషులయొక్క మనోభావాలపట్ల ఉత్ప్రేక్షలకు స్థానం యిచ్చి 'ఏలాగైనా మగవారు' అనే గౌరవసింహాసనాన్నధిష్ఠింప జేసిన కమలలాంటి స్త్రీలకు ఈలాంటి తిరస్కారశేగాలు తాకడం సహజమో; లేక అవమానాలు భరించగలిగిన సహనత్వాన్ని సంపాదించి మంచనే సదార్థానికి వారు అర్హురాండ్రే అవుతారో; తెలుసుకోవడం కష్టం.

ఎన్నోరాత్రుళ్లు మన్మథునికి ఉపవాసం చెప్పి నిగ్రహించుకున్న రమేశుకు ఆరాత్రి గడవడంకూడా గగనం కాలేదు.

తనకు తన తల్లి చెప్పిన విధ్యుక్తధర్మప్రకారం కమల శయనాగారాన్ని ప్రవేశించగనే భర్తపాదాలు ఒత్తడం, వేకువన లేవగానే ఆ పవిత్రపాదాలకు నమస్కరించడం— ఈ రెండుకార్యాలూ నిర్విఘ్నంగా జరగడంలో రమేశం ఏలాంటి అభ్యంతరమూ పెట్టలేదు.

ఉదయాన్నే కమల తులసికోటదగ్గరగా కలాపి చల్లుతోంది. దూరంగా నిలబడ్డ మంగతాయి అయిదు నిమిషాలపాటు కోడలిమొగంకేసి విమర్శనీయంగా చూసింది.

ఆమెమొగంలో సహనచ్ఛాయల మధ్యగా విషాదరేఖలుకూడా విస్పష్టంగా కనిపిస్తున్నై.

“కమలా!” కరుణాపూరితదృక్కులతో చూస్తూ పిలిచింది మంగతాయి.

పని పూర్తిఅయినవెంటనే చేతులు శుభ్రంచేసుకొని, అత్తగారిదగ్గరగా వెళ్ళి నిలిచింది కమల.

కోడలిశిరాన్ని ఆప్యాయంగా నిమురుతూ— “ఈనేరం మేము చేసిందే తల్లీ! నువ్వు అంతర్యంలోనైనా వాణ్ణి శపించకు” అంది మంగతాయి.

ఆశ్చర్యంగా మంగతాయికేసి చూసింది కమల. ఆమెకళ్లు నీటితో చెమ్మగిల్లాయి.

“వారిని శపించగల శక్తి నాకు లేదండీ. అలాంటి శక్తే నాలో వుంటే, అది సద్వినియోగం చేసుకొని, వార్ని నావారిగా చేసుకునేదాన్నే” కమల యిక మించి మాట్లాడలేకపోయింది. అక్కడనుంచి వెళ్లిపోయింది.

సుగుణశాలినిఅయిన తన కోడలి దురవస్థకు మంగతాయి మనస్సులో చాలా వ్యథ చెందింది. తిన్నగా తన భర్త పూజగదిదగ్గరగా వెళ్లి గోడకు చేరి నిలిచి ఏవో ఆలోచనలు సాగిస్తోంది.

నారాయణదాసు పూజ పూర్తిచేసుకొని వెలుపలకు వచ్చేసరికి, ప్రశాంతమైన అర్ధనిమీలితనేత్రాలు రెండూ మంగతాయిమీద పడ్డాయి.

“ఏం యిలా వచ్చావ్?” అని అడిగాడు.

“రమేశు విషయం ఏం బావుండలేదు”

“ఎందువల”

“కమల ...” అని చెబుతూ ఆగి “మాట్లాట్టం లేదు.” అంది మంగతాయి.

ఇకమించి చెప్పనక్కర్లేకుండానే, పరిస్థితినంతా గ్రహించుకోగలిగాడు. నారాయణదాసు ఆరుమాసాల క్రితం ఈలాంటి మాటే ఓనాడు విన్నాడు. కాని “చిన్నతనం” అనే సమర్థనాత్సాహంవల్ల, మరోనాడైనా దారికి వస్తాడనే నమ్మకంవల్ల నారాయణదాసు అనాడేమీ మాట్లాడలేదు. ఆ విషయంగురించి తీవ్రంగా ఆలోచించనూలేదు. కాని యిప్పుడలా తటస్థంగా ఉండాలన్నా, ఉండగల కారణం ఏమీ కనిపించలేదు. ఇప్పటికికూడా కమలపట్ల రమేశు సుముఖుడుగా లేడని విన్న అతని హృదయం కొంతగా కంపించింది. ఆ భావాన్నిమాత్రం భార్యకి వ్యక్తంచేయకుండా- ప్రశ్నార్థకంగా చూస్తూ—

“ఇక దారిలోకి రాడంటావా?” అన్నాడు.

“అనే యింతకాలం ఊరుకున్నాం” అందామె.

“నిజం” అని వెంటనే సమాధానం యిచ్చాడు. ప్రశాంతమైన అతని మొగంలో అశాంతి ఆక్రమించింది. వెంటనే ఇలా అన్నాడు- “సహించి ఊరుకోగల సావకాశం లేదు” ఈమాట నెమ్మదిగా అందామనే అతని ప్రయత్నం. కాని ఉద్రిక్తంగా ధ్వనించింది.

మంగతాయి భయంగా స్వరాన్ని నెమ్మదిజేసి ముందుకు వంగి "వాణ్ణేంచేద్దామని" అని అడిగింది.

భార్యమనోగతాన్ని తెలుసుకున్నవాడిలా మ్లానంగా ఓమారు నవ్వి—"నాకు తెలుసు. వాణ్ణేం బాధపెట్టను" అని, పట్టుబట్ట మార్చుకోడానికి నారాయణదాసు ప్రక్కగదిలోకి వెళ్లాడు.

సావిట్లో కుర్చీమీద కూర్చొని, పోతనభాగవతాన్ని పఠిస్తోన్న నారాయణదాసుకు కొడుకు గది దాటి వెళుతోన్న అడుగులచప్పుడు వినిపించింది. తల పైకెత్తి "రమేశూ" అని పిలిచాడు.

రమేశు తండ్రిదగ్గరగా వచ్చి నిలిచాడు.

"ఎక్కడికి వెళుతోంట?"

"చక్రధరంయింటికి"

"విశ్రమించి పోగల అవకాశంకూడా లేదూ?... ఏమి టాపని" ఆఖరిమాట మొగం చిట్లించి అనడంలో రమేశు వెంటనే సమాధానం యివ్వగల శక్తిని కోల్పోయాడు. కాని ధైర్యంగానే నిలబడ్డాడు.

"వచ్చినదగ్గర్నుంచి చూస్తున్నా. ఒక్కనిమిషంకూడా ఇంటిదగ్గర గడపడం నీ కంత భారంగావుందేమిట్రా"

ఈమాట విన్నతర్వాత "మీరుచేసిన ఘనకార్యంవల్ల" అని మనస్సులో మాత్రం అనుకోగలిగాడు. కాని పెదాలు మెదపలేదు. మౌనంగానే ఉన్నాడు.

"అలా కూర్చో"

తప్పులేకచేసిన బడిపిల్లాడు ఆ తప్పును మాష్టారు గుర్తించేరన్నతర్వాత, ఆయన యివ్వబోయే శిక్ష ఏమో అనే అదురుతో ముందుగా ఆ గురువుగారు చెప్పిన పనల్లా మంత్రముగ్ధుడుగా ఎలా చేయగలుగుతాడో, ఇంచుమించు రమేశుపరిస్థితికూడా అలాగే వుంది. కూర్చోడం మాత్రం తప్పలేదు.

"నువ్వు ఆమెతో మాట్లాట్లేదూ"

"ఎవరితో"—ఏమీ తెలియనివాడిలా ముఖభంగిమమార్చి ప్రశ్నించాడు రమేశు.

"ఎవరితోనా—" అని నారాయణదాసు బాధగా నవ్వివ మీదట "కమలతో" అని దృఢంగా అన్నాడు.

"కమల చెప్పిందా?"

రమేశుఅన్న ఆమాట విని పుస్తకం హఠాత్తుగా మూసి, తల పైకెత్తి "అభిమానం గల ఏ ఆడదీకూడా నా మొగుడు చూడ్డం లేదని ఆత్మీయులతోకూడా చెప్పుకోలేదురా... చెవిటీ" నారాయణదాసుగొంతు స్ఫుటంతప్పి, ఆవిగ్గరలో వణకడం చూచిన రమేశుకు తండ్రిహృదయవేదన అర్థమైంది. తిరిగి సమాధానం చెప్పడంకూడా భయంగా తోచింది. క్షణంలో తండ్రి కళ్లల్లో నీటితెరలు కనిపించాయి. తమక్కస్వరంతో నారాయణదాసు "ఆమె చాలా యోగ్యురాలురా! యోగ్యతనేదాన్ని అర్థంచేసుకోలేని పశువుకు కట్టబెట్టాను." అని తలవంచి పుస్తకాన్ని చూస్తూ "ఆ పాపం చుట్టుకోనేది నీకాదురా: నాకు" అని పుస్తకం తెరిచాడు. కళ్లు మూడిచాడు. రెండు కన్నీటిచుక్కలు పుస్తకంమీద పడ్డం రమేశు గమనించాడు... ఏదో అనడానికి నోరు తెరిచాడు. వెంటనే నారాయణదాసు "చిన్నతనంలో పెళ్లిచేయడం మాది పొరపాటే; కాని నువ్వింత పెద్దవాడివయి ఆమెలో లోపాలు ఏం కనిపెట్టావో చెప్పు" అని కుర్చీమీదనుంచి లేచాడు.

రమేశు తలవంచుకొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"వస్తుపరిశీలనవిషయంలో, ఒకరు చేసినదానికన్నా మేము ఘనంగా చేసేవాళ్లమని గప్పాలుకొట్టడం దౌర్బల్యహృదయులకు చాలామందికి అలవాటు. కాని ఆబాధ్యతే వాళ్ల నెత్తిమీద పడిందంటే, సున్నమే అన్నంగా భ్రమించి, అనుభవించేటప్పుడు నాలుకకు చుర్రుక తగిలి అనంతరం సున్నంగా నిర్ధారణ చేసుకోగల తెలివి వాళ్లకుంది" అని గుమ్మంవరకూవెళ్లి వెనక్కితిరిగి "సరే! నువ్విప్పుడు వెళుతోంది చక్రధరం యింటిక్కదూ? చక్రధరం నీ స్నేహితుడేగా— ఈ విషయంలో నీహితుడి సలహాకూడా పొందు" అని వెంటనే యింట్లోకి వెళ్లిపోయాడు నారాయణదాసు.

మెత్తనిస్థానాన దిగిన మేకు బలవంతాన తీసివేసినంత తేలికపడింది రమేశుహృదయం. కాని గుచ్చుకున్నచోట పొందే సహజమైన బాధ మేకు ఉన్నప్పటికన్నా గట్టిగానుంది.

చక్రధరం, పురుషోత్తంఅనే ఆయిద్దరే స్వగ్రామంలో రమేశున్నేహితులు. తాను వెళ్ళేది పురుషోత్తం యింటికైనా, చెప్పింది మాత్రం చక్రధరంయింటికని. అందుకు కారణం లేకుండాపోలేదు. పురుషోత్తంలో ఆలోచనాశక్తి మృగ్యమనీ, చక్రధరం మంచి యోచనా ప్రపూర్ణుడనీ నారాయణదాసుకు నమ్మకమనే సంగతి రమేశుకు తెలుసు. చక్రధరంయింటికి తాను వెళ్ళడం అనేది తండ్రిసృష్టిలో తప్ప కాదనే నిజం గ్రహించిన మీదటే అబద్ధాన్నికూడా చెప్పగలిగాడు.

మందగమనంతో తిన్నగా పురుషోత్తంయింటికి బయల్దేరాడు రమేశు.

అసలు పురుషోత్తం ఎవరో చెప్పాల్సిన అవసరం యెక్కడుంది.

రమేశంతోబాటు పురుషోత్తం ఒక్క క్లాసుతప్పకుండా స్కూల్ఫైనల్ వరకూ వచ్చాడు. స్కూల్ ఫైనల్ పరీక్షల్లోమటుకు పురుషోత్తం పూర్ణానుస్వారాన్ని పొందాడు. చదవగల అవకాశం యింకా ఉన్నా, పురుషోత్తం తల్లి ఆజ్ఞ మాత్రం కాలేదు. ఆమె విధవ. ఇంటిబాధ్యతను నిర్వర్తించగల అవసరం పురుషోత్తంమీద పడింది. ఆ రోజుల్లోనే రమేశం కాలేజీలో కాలుపెట్టాడు.

ఇంతకూ ఆశ్చర్యకరమైన విషయం పురుషోత్తం పెళ్లని రమేశం యిప్పటికీకూడా అనుకుంటూనే ఉంటాడు. రమేశం కలకత్తాలో ఉండగానే పురుషోత్తం పెళ్ళయింది. పెళ్లయినతర్వాత రమేశానికి పురుషోత్తం ఈవిధంగా ఉత్తరం రాశాడు: "మిత్రులను ఆహ్వానించగల అవకాశంకాజేసిన నా పెళ్లిగురించి నేను చాలా చింతిస్తున్నాను. శ్రీమతిపేరు లక్ష్మి. చూడ్డానికి నా సుస్వాగతం"

దేనిగురించి మానవుడు ఎక్కువగా చింతనచేస్తూవుంటాడో, ఆ ప్రస్తావన వచ్చేసరికి, శ్రద్ధను త్యాగీకృతం చేసి చెవులూ, కళ్లూ వొప్పజెప్పడం సహజం !

ఆ ఉత్తరానికి కళ్లు వప్పజెప్పినవాడే పురుషోత్తంపెళ్లి గురించీ, కట్టుకున్నయిల్లాలిని గురించీ ఊహాచిత్రాలను సృష్టిలో నిర్మించుకొన్నాడు రమేశం.

ఇంతతొందర్లో పెళ్లి కావడానికి ఏదో కారణం ఉండివుంటుందనీ, ఆలక్ష్మి బహుశా తన భాగ్యకన్న నల్లగా ఉండవచ్చుననీ, లేదా ఎర్రగా బుర్రగా వున్నా, ఏ కాలో కన్నో లొట్టఅయివుంటుందనీ, ఆసంగతి తన మిత్రుడు గుర్తించకుండా కట్నం డబ్బుకోసం కాలుజార్చి ఉంటాడనే నిర్ణయానికి వచ్చాడు.

కాని రమేశం స్వగ్రామం చేరుకున్నతర్వాత పురుషోత్తంయింటికి వెళ్ళి ప్రత్యక్షంగా లక్ష్మిని చూచినమీదట తన నిర్ణయాలన్నీ నిమిత్తమాత్రంగా అయిపోయినాయి. లక్ష్మి సహజలక్ష్మీస్వరూపం. ఆమె చిలిపిచూపులూ, చిరునవ్వుపెదాలూ, శ్వేతవర్ణపుశరీరచ్ఛాయా రమేశాన్ని ఎక్కువగా ఆకర్షించాయి.

వెలుగుముందు చీకటి కున్నంత వ్యత్యాసాన్ని లక్ష్మియెడనూ, కమలయెడనూ సృష్టించుకొన్నాడు రమేశం. మిత్రునితో కాలక్షేపానికన్నా, లక్ష్మిసందర్శనంకోసం రమేశం ప్రతిరోజూ పురుషోత్తంయింటికి హాజరవుతూవుంటాడు.

అలానే ఈవేళకూడా తండ్రి చరచిన హృదయంపై చరుపులనూ, వాటి బాధనూ ఆమెదర్శనమాత్రంగా మరచిపోగలననే నమ్మకంతో పురుషోత్తంయింటికి చేరుకున్నాడు రమేశం.

తనకోసం పురుషోత్తం ఎదురుచూస్తున్నట్లుగా లేదు. వ్యథతో కుములుతోన్న మనోబాధను మభ్యపెట్టే ప్రయత్నంలో ఉన్నట్లుగా అతని వైఖరి చెబుతోంది. రమేశు వచ్చిన అలికిడి విన్నమీదట తల పైకెత్తి "లేట్ చేశావేం?" అన్నాడు. ఆమాటలో జీవం లేదు. కళ్ళల్లో కాంతీ లేదు. కాని రమేశం అవేమీ గమనించలేదు. పక్కగా ఉన్న ఫ్రేము కుర్చీని తేలిగ్గా ఎదరకులాగి, దానిమీద బరువుగా కూర్చొని—"మానాన్నగారితో మాట్లాడుతూవుండడం వల్ల ఆలస్యమైంది." అని ముక్తసరిగా సమాధానం

చెప్పి, గదివైపు చూస్తూ "కాసిన్ని మంచినీళ్లు తెప్పించరా భాయి" అన్నాడు.

అలా అడగడం, పురుషోత్తం యింట్లోకి ఆర్డరు చేయడం, లక్ష్మి మంచినీళ్లు తీసుకరావడం, గ్లాసు అందుకుంటూ రమేశం లక్ష్మియొక్క అందాన్ని ఒక్కసారి కళ్లారా పరికించడం ప్రతిరోజూ జరిగేపని. కాని ఆనాడలా జరగలేదు.

పురుషోత్తం సుబ్బమ్మంకేసి చూస్తూ "అమ్మా! రమేశానికి మంచినీళ్లు..." అని పిలిచాడు.

రమేశానికి దాహం తగ్గింది. లక్ష్మికి ఆర్డరుచేయకపోడానికి కారణం ఏమిటో వెతకడానికి ప్రారంభించాడు. "వొదినగారికి క్యాజువల్ లీవేమిట్రా" అని అడిగాడు.

రమేశానికన్నా పురుషోత్తం ఒకటిరెండేళ్లు పెద్ద. అంచేత లక్ష్మిని వొదినగారి వరసతో పిలుస్తాడు.

పురుషోత్తంనుండి సమాధానం రాలేదు.

పురుషోత్తంతల్లి సుబ్బమ్మ మంచినీళ్లు తీసుకొచ్చి రమేశానికి అందజేసింది. ఆమెమొగంలో దైన్యరేఖలు కనిపిస్తున్నాయి.

"పిన్నిగారూ, నీరసంగా కనుపిస్తున్నారేం" అని ఎంతో చనువుగా ప్రశ్నించాడు రమేశం.

అడిగినంత త్వరగా ఆమె సమాధానం ఈయలేదు. నెమ్మదిగా గ్లాసు అందుకొంటూ—"కోడలు ఎలావుంది బాబూ" అనిమాత్రం అడిగింది.

అడిగిన మాటకూ, ఇచ్చిన సమాధానానికీ ఆద్యంతంవరకూ ఏమీ సంబంధం లేదు. రమేశం ఆశ్చర్యంగా ఒక్కసారి తల పైకెత్తి, ఆమెఅంతర్యాన్ని గ్రహించినవాడులా పొడిగా నవ్వి "ఎలావుండడమేమిటి, నల్లగావుంది" అని వెంటనే సమాధానం యిచ్చి, తల వంచుకొని "మాకోడల్లామాత్రం లేదు" అన్నాడు. అతని కంఠంలో ప్రస్ఫుటాన్ని సిగ్గుదొంతర్లు కప్పేసినాయి.

ఆమాటలతో పురుషోత్తం హఠాత్తుగా తల పైకెత్తి, అనుమానంగా రమేశంకేసి చూశాడు.

సుబ్బమ్మ గట్టిగా నిట్టూర్చి "మాకోడల్లా ఏ కోడలూ వుండదు... ఉండకూడదని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను" అని ఆమె అక్కణ్నించి వెళ్లిపోయింది.

రమేశం అగమ్యస్థితిలో పడ్డాడు. తానన్నమాట ఆ తల్లీకొడుకులను సంతుష్టిపరచగలదని అతని నమ్మకం. కాని సుబ్బమ్మ అన్నమాటల్లో అర్థమేమిటో రమేశానికి గ్రాహ్యంకాలేదు.

"ఊళ్లో ఏమన్నా పుకారుగా వుందేమిట్రా" అంటూ రహస్యంగా అడిగే భంగిమలో అడిగాడు. ఆపురుషోత్తంకళ్లల్లో నీటితెరలు కనిపిస్తున్నై.

రమేశంమనస్సు కాస్త తటపటాయించింది. ఆశ్చర్యంగా అతనికేసి చూస్తూ "ఏమిటే నువ్వనేది" అన్నాడు.

వెంటనే పురుషోత్తం ఉమక్కస్వరంతో "కష్టాల్లో స్నేహితుణ్ని గేలిచేయడం ఎవరు నేర్పార్రా" అని అనడంలో పురుషోత్తంకళ్లు రెండూ జలపూరితమయ్యాయి.

రమేశం కుర్చీమీదనుంచి ఎదరకు వంగి అతని చేతులు పట్టుకొని "యథార్థంరా! నాకేం తెలీదు. అదేమిటో నాతో చెప్పవూ" అని ప్రాధేయతగా అడిగాడు.

ఆమాటతో పురుషోత్తం రమేశానికి ఏమీ తెలియలేదనే నిర్ణయానికి వచ్చాడు. జారే కళ్లనీళ్లను తుడుచుకొని "ఇష్టంలేనిభర్తతో కాపురంచేయలేక లక్ష్మి వెళ్లిపోయింది" అని నిరాశగా అరచేతులు ఎదరకు త్రిప్పి, బెంగగా చూస్తున్నాడు.

రమేశం వెంటనే ఏప్రశ్న వేయాలో అతనికి తట్టలేదు. ఆవలించిన నోటితో పురుషోత్తంమొగంకేసి చూస్తూ అలానే ఉండిపోయాడు.

"ఆమె అందకత్తె. నేను కాదనను. కాని ఆ అందం నాచేతిలోపడి మలినం కాక ముందే ఆపని చేయలేక పోయిందీ" పురుషోత్తం అలా చెప్పడంలో రమేశం తేరుకున్నాడు. "ఏంపనీ" అని అడిగాడు.

"ఆ రామారావుతో లేచిపోవడమనే పని"

రమేశంహృదయంలో పిశాచాలు నృత్యంచేస్తున్నై. సున్నితమైన అతని మెదడుపై తాళం తప్ప

కుండా భరతనాట్యం చేసే పాదాలు ఉద్ధృతంగా ఆడుతున్నాయి. ఆత్రంగల కంఠస్వనితో "పోవడ మెందు కొచ్చింది" అని అడిగాడు రమేశం.

ఈసారి పురుషోత్తం కళ్ళనుండి ధారగా ప్రవహిస్తోంది కన్నీరు. రోదనస్వరంతో యిలా అన్నాడు-

"ఆమె ఎప్పుడో రామారావును ప్రేమించిందిట. ఆస్తి లేదని వాళ్ల తల్లిదండ్రులు దాన్నిచ్చి నాకు కట్టబెట్టారట. ఈనాడు కన్ను తెరిచి వాడితో అర్ధరాత్రివేళ లేచిపోయింది" అంటూ వాలు కుర్చీలో హఠాత్తుగా తలను వెనకకు అదుముకొని, కళ్ళను రెండుచేతులతో కప్పుకొని గుడిల్లి చంటిపిల్లాడులా ఏడుస్తున్నాడు.

రమేశానికి ఇంకా నమ్మకం చిక్కలేదు. ఆమె అందాన్ని చూచి ఓర్వలేక ఎవరో ఈ అపవాదును వేశారని అతని అపోహ. ఆసంశయంతోనే "ఇది నమ్మడానికి వీల్లేని మాట; వాడితో పోయినట్లుగా నీ కెవరు చెప్పారు" అని అడిగాడు.

పురుషోత్తం లేచి "రా! లోపలికి" అంటూ రమేశంచేయిపట్టుకొని లోపలకు తీసుకెళ్లాడు

తాను కాలేజీలో ఉండగా ఎప్పుడో పురుషోత్తానికి పిచ్చికుక్క కరచిఉండి ఉంటుందనీ, దాని యఫెక్టు హఠాత్తుగా ఈ నాడు వీడికి అంకురించి ఉంటుందనీ ఆలోచిస్తోనే పురుషోత్తం పడకగది చేరుకున్నా

తలదిండుక్రింద జాగ్రత్తపరచిన ఓ తెల్లటి చీటీ తీసి పురుషోత్తం రమేశంచేతులో పెట్టాడు. ఆఉత్తరం రమేశంచదివినమీదట - పురుషోత్తానికి పిచ్చిఎక్కలేదనీ, చెప్పే మాటలన్నీ సత్యమనీ నమ్మగలిగాడు.

సుబ్బమ్మకూడా అక్కడికే వచ్చింది. రమేశాన్ని చూస్తూ "అంతా విన్నావుకదూ" అంది.

తలను బరువుగా, క్రిందకు చూస్తూ, వూపాడు.

"నువ్వుకూడా నాబిడ్డలాంటివాడవు కాబట్టి చెబుతున్నా. మావాడి కేం నష్టంలేదు. నాలుగువేల రూపాయలు కట్నంయిచ్చారు. రెండువేలరూపాయల వస్తువులతో పరారయింది. మిగిలింది ఇక రెండువేలు"

ఆమెనిగ్రహానికీ, ఆపదలో ఆదాయవ్యయాల సమర్ధనకూ రమేశం ఆశ్చర్యపోయాడు. అనుమానంగా ఆమెకేసి చూస్తూ "మరి ఈమచ్చ మాపుకోవడం" అని అడిగాడు.

ఆమె ఓమారు ధైర్యంగా నవ్వి "మగవాడికి మనవుజారిందనే మచ్చ పెద్ద లెక్కలోనిది కాదు. ఆసంగతి ఆడవాళ్లవిషయంలో చెప్పు" అంది.

పురుషోత్తంకేసి చూచాడు రమేశం. అంతవరకూ కిటికీలోనుంచి శూన్యంకేసి చూస్తున్న పురుషోత్తం వెంటనే దృష్టిమార్చి "నిజం! మా అమ్మ చెప్పింది ముమ్మాటికీ నిజంరా! నేనుకూడా నీలాంటి అదృష్టవంతుడు కావడానికి ప్రయత్నంచేస్తా" అని అక్కడనుంచి నెమ్మదిగా సావిట్లోకి వెళ్ళిపోయాడు.

'అంటే?' అని తనలో తాను తర్కించుకున్నాడు రమేశం. ఆమాటే, ఎదురుగావున్న సుబ్బమ్మకేసి చూస్తూ "అంటే" అని అడగలేకుండా వుండలేకపోయాడు.

"కమలలాంటి కోడలిని నేనుకూడా పొందిననాడు నాజన్మ తరిస్తుంది రమేశూ!...నువ్వు ధన్యుడవు కాబట్టి అలాంటి భార్యను సంపాదించుకోగలిగావు..." అని సుబ్బమ్మ గడపదాటింది. పురుషోత్తాన్ని వీడలేక వీడలేక వీడి రమేశం ఆనాడు యింటికి వెళ్లాడు.

మరునాడు మంగతాయి నారాయణదాసుపూజామందిరందగ్గరకు వచ్చి "కమలమొగం ఈవేళ కళకళ్లాడుతోంది. అబ్బాయినోటంట 'కమలా' అనే పిలుపు రాత్రే విన్నాను." అంది.

వెంటనే నారాయణదాసు అర్ధనిమీలితనేత్రాలతో భార్యకేసి చూస్తూ "ఆత్మసౌందర్యం గల ఆడవాళ్లు భర్తలను ఆకర్షించుకోవడంలో ఆలస్యం చేస్తారేమో" అన్నాడు ఆధ్యాత్మిక భాషలో, తృప్తిగా నిట్టూరుస్తూ.


రత్నం

# మానవుడు

[కథానిక]

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

'అయితే మీరు ఒంటరిగా ఉండగలరా?' అంది సువర్ణ.

'ఎంతవరకు?' అన్నాడు సహజంగానే సుందరం.

'మేము వెళితే తిరిగివచ్చేసరికి బాగా రాత్రి అయిపోతుందికాబోలు' అంది కొంచెం కష్టపడుతూ సువర్ణ. సుందరం జవాబు చెప్పేలోపున ఆమె మళ్ళీ అందుకొని, చెల్లెల్తో 'పద్మా, నేను రాలేను, మీరంతా వెళ్ళకూడదూ!' అంది.

మొగంలో ఆశాభంగం తొణికిసలాడగా, పద్మ 'అయితే నేనూ వెళ్ళను—ఎప్పుడూ ఏం సినీమా మొగం చూడలేనా ఏమిటి? ఏమో నలుగురం కలిసి సరదాగా తిరిగివద్దామని' అంటూ చఱ్ఱున వెళ్ళిపోయింది.

కృతకస్మితాన్ని సహజంగా ప్రదర్శించాలనే ప్రయత్నంతో 'అదేమిటి సువర్ణా, నావంట్లో కొత్త ఇదిగా ఉన్నంతలో, వాళ్ళందరి ఉత్సాహం భంగం చెయ్యటం బాగుంటుందా' అన్నాడు సుందరం.

'నేను వెళ్ళిపోతే మీకు ఒంటరిగా ఊసుపోతుందా' అంది, నిజంగా బాధపడుతూ సువర్ణ.

'ఓస్, ఈమాత్రానికేనా, ఇప్పుడు మాత్రం నేను ఉన్నానా, రాత్రి తొమ్మిదిగంటలలోపున మళ్ళీ ఏమీ అక్కరలేదు - ఈలోపుని నారాయణశాస్త్రిగారు (వైద్యుడు) వస్తారుకదా—అంతాకా నేనిలా ఇవేవో పుస్తకాలు తిరగేస్తూ ఉంటాను.'

'అదుగో, అందుకే నేను వెళ్ళనంటున్నాను- మీరు మళ్ళీ అనవసరంగా మెదడుకి అలసట-'

'పోనీ అయితే, అందాకా చెస్ ఆడుకుంటూ ఉంటాను—అప్పుడు నీకంత బెంగగా ఉండదుగానే మొన్న మేటికి నేను వెళ్ళిపోలేదూ' అని సుందరం ఆమెసమాధానాన్ని వినిపించుకోకుండానే 'పద్మా, పద్మా' అని పిలిచేడు.

అంతవరకూ పద్మమొగాన్ని క్రమ్ముకొనిఉన్న నిరుత్సాహనీరదములు విరళములయేయి.

'మీ అక్కయ్యకూడా బయలుదేరుతుంది పద్మా'

బలవంతంగా సువర్ణ చెయ్యిపట్టుకొని 'పోనీ, మాకోసం కాకపోతే మానిపోయెనా, బావ ఇంతలా చెప్తున్నారనేనా బయలుదేరమూ' అంటూ నడిపించసాగింది పద్మ.

గదిగుమ్మందగ్గర వెనక్కుతిరిగి, 'మీరు పుస్తకాలు చదవనంటేనే నేను వెళ్తా'నంది సువర్ణ.

'అలాగేలే' అన్నాడు సుందరం.

'అబ్బ, ఏమి జాగ్రత్త అమ్మా, కందిపోతారు కాబోలు పుస్తకం చదివినమాత్రంలో బావగారు' అంటూ అక్కయ్యను తీసుకొని వెళ్ళిపోయింది పద్మ.

ఒక అయిదునిమిషాలలో కారు సరభసంగా, తనకు సహజమయిన మధురమూ, కఠోరమూ అయిన ధ్వనితో బయలుదేరింది. చప్పుడు ఆగిపోయినతర్వాత ఒక అయిదునిమిషాలు వెల్లకిలాపడుకున్నాడు సుందరం.

సముద్రంలో తరంగాలు లేకుండా చేయడము ఎంత కష్టమో, మానవుడి మనస్సముద్రంలో భావనాతరంగాలు ఏర్పడకుండా చెయ్యడమూ అంతకష్టమే.

ఏపనీ లేకుండా పడుకొని మనస్సును అరికట్టడం సాధ్యంకాదని, లేచి కూర్చొని, సువర్ణదగ్గర ఒప్పుకున్నట్లుగా, పేకదస్తా తీసేడు పేషెన్స ఆడుకుందికి. పేషెన్సఆపైనా ప్రక్కను సోత్సాహంగా సంవీక్షించే మనిషి ఉంటేనే కాలక్షేపంగా తోస్తుంది.

సుందరానికి తన అశక్తి బాగా తెలుసును. పేకముక్కలు టేబిలుమీదికి విసరి, కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు. కళ్లను ఏమీ చూడకుండా నిబంధించినట్లుగానే మనస్సునుకూడా నిబంధించవలెనని. ఫలితం లేకపోయింది. తానేమో ఎవరికీ అక్కరలేనివాడుగానూ, ఎందుకూ పనికిరానివాడుగానూ, ఇంకా ఏమేమో అల్లుకొని పోతున్నది మనస్సు; దానిని నిబంధించే సంకల్పమూ, అదుపులో ఉంచే కళ్ళెమూ కానరాలేదు అతనికి.

ఇంతకంటె తలనొప్పి ఎక్కువయినాసరే, ఏమయినాసరే మంచిదని, తాను సువర్ణకు పుస్తకం చదవనని హామీ ఇచ్చిన మాట జ్ఞాపకం ఉండికూడా పుస్తకం తీసేడు గత్యంతరం లేక.

ఎథిల్ మేనిన్ నవల 'పిల్‌గ్రిమ్స్' (యాత్రికులు) వచ్చింది చేతికి. అదివరకెన్నోమార్లు చదివినదే కావడంవల్ల మధ్యను మొదలు పెట్టేడు. రెండుమూడు కాకితాలు చాలా త్వరగా తిరిగేయి. అక్కడితో ఆ ప్రకరణం అయిపోయింది. మళ్ళీ మనస్సు తన స్వంతమార్గంలో సంచరించసాగింది. అతని ప్రయత్నం అక్కరలేకుండా పుస్తకం మూసుకొని పోయింది.

సుమారు ఆరుగంటల ప్రాంతంలో వైద్యుడు నారాయణశాస్త్రిగారు వచ్చేరని నౌకరు కూర్మయ్య చెప్పేడు. ఆ సందర్భంలో ఆయనను చూడలేకపోవడానికి కారణం పుస్తకపఠనంలోని తన్మయత్వం కాక, అతని మానసికోద్వేగమే కారణమని చెప్పవచ్చును.

కారులో వెళ్లినవాళ్లు తిరిగి వచ్చేసరికి రాత్రి తొమ్మిదున్నరయింది. అదయినా సువర్ణ బలవంతంవల్లనే. అసలు బయలుదేరినది లగాయతు ఆమె ఎవ్వరితోనూ సరిగా మాట్లాడలేదు. పైగా సినీమా మొదలయినదగ్గరనుండి 'నాకు చికాకుగా ఉంది; మీరంతా ఉండండి, నేను వెళ్లిపోతా'ననడం మొదలుపెట్టింది.

ఆమెను మరిపించాలని పద్మా, ఆమెభర్త వసంతం చాలా చాలా యత్నించారు వారి యత్నము అధికమవుతున్నకొద్దీ ఆమెతొందర ఎక్కువకాసాగింది. చిట్టచివరకు ఇంటర్వెల్ కాగానే అందరూ లేచి పోయేరు.

ఇంటిని సమీపిస్తున్నకొద్దీ ఆమెలో ఒకింత ఉత్సాహం కలిగినట్లయింది. అది కేవలం తలనొప్పి తగ్గటంవల్లనో, త్వరత్వరగా సమీపించటంవల్లనో విడమర్చటం చాలాకష్టం.

పద్మకు ఏవిషయాన్నీ దాచిపెట్టుకోవడం చేతకాదు. 'ఇంటికి వచ్చేసరికల్లా, అక్కయ్యకు సగం తలనొప్పి తగ్గిపోయింది. ఇంక బావగారి ముఖారవింద సందర్శనంతో ఆ ఉన్నది కాస్తా మాయమవుతుంది కాబోలు' అంది.

చెల్లె లేమంటున్నదో సరిగా వినిపించుకోకుండానే, సువర్ణ మేడమెట్లెక్కిపోయింది. గది తలుపు లోపున గడియ వేసిఉండడం ఆమెకు ఉల్లాసాన్నే కలిగించింది.

మృదువుగా తలుపుతట్టుతూ, సన్నని తీయని నవ్వుతో—'ఆఁ, దొరికిపోయేరులెండి దొంగతనంలో—తొందరగా తలుపుతీస్తే వాగ్దానభంగం చేసి పుస్తకం చదువుతున్నందుకు శిక్షతగ్గుతుంది.' అంది.

లోపల సుందరానికయితే తక్షణం తలుపుతీయాలనే అనిపించిందికాని, అతని కళ్ళు - అవి తుడుస్తున్నకొద్దీ మరీ దుర్బలంగా నీరుకారుతున్నాయి ఎట్టకేలకు సర్దుకొని, మూసిఉన్న రెండు పుస్తకాలనూ విప్పి మంచంమీద పడేసి తలుపుతీసేడు.

ఎన్నో సంవత్సరాల వియోగానంతరం కలుసుకున్నట్లుగా రెండుచేతులతోనూ ఆమె అతన్ని తనకు

అతిసమీపంగా పట్టుకొని, మంచంవద్దకు తీసుకొనివెళ్లి పడుకోబెట్టి, లాలనగా, 'నేనందుకే వెళ్లనన్నాను. చూడండి, మీ ఒళ్లు ఎంత వేడిగా ఉందో; సుమారు నూరైనా ఉంటుంది; నారాయణశాస్త్రిగారేమన్నారు ?'

'ఏమనడానికి ఏముంది నావంట్లో ఏమీ లేందే? మందెందుకు, మేడమీదికి రానక్కరలేదని కబురు చేసేను.'

'మీ కింతకోపం వస్తుందని తెలిస్తే నేను వెళ్లి ఉండేదాన్నా?' అని, అతని పిలుపును వినిపించుకోకుండానే వరండాలోకి వెళ్లి 'కూర్మయ్యా, కూర్మయ్యా, వేగం వెళ్లి నారాయణశాస్త్రిగారిని పిల్చుకొనిరా' అని మళ్లీ గదిలోనికి వచ్చింది.

'పోనీ, మీ కిష్టం లేకపోతే మందు వద్దులెండి గాని, ఇదుగో చూసేరా, మీకొక మంచి చిత్రం తెచ్చేను' అంది తాను తెచ్చిన పూలను టేబిలుమీది పూలకుండులో సర్దుతూ. అతడు మళ్ళీ సర్దుకొని, 'ఉఁహుఁ, అలాకాదు. ఇలారా' అన్నాడు సాభిప్రాయంగా.

ఆమె సస్మితంగా, సపువ్వంగా దగ్గరకు వచ్చి, 'మీరు అల్లరిచెయ్యకుండా మందు తీసుకుంటేనే' అంది. అతడామెతల్లో పూలు తురుముతూ, 'అబ్బ, నాకేం వంట్లో చికాకులేందే మందెందుకు చెప్పు?' అన్నాడు కొంతవరకు ఇష్టాన్ని సూచిస్తూ. 'లేకపోవడమేమిటి; మీరు మునపటిలాగా ఉండగలుగుతున్నారా? ఏదో మనకు తెలియని చికాకు ఉండే ఉంటుంది'—

'ఏమయినా, నాకు మందులమీద నమ్మకం లేదుకదూ.'

'పోనీ, నాతృప్తికోసం—'

'అలాగేలే'అంటూ అతడు ఎప్పటి నిరుత్సాహంతో నడుము వాల్చేడు.

ఆమె, ఏదో అలభ్యమయినదానికోసం మారాము చేసే పసిపాపను తల్లి స్తన్యమిచ్చి మరిపించేట్లుగా, అతని పెదవులూ బుగ్గలూ ముద్దుపెట్టుకొని, 'ఇప్పటికి నాకు ఎన్ని బాకీపడ్డారో తెలుసునా?' అంటూ నిజంగా లెక్కపెడుతున్నట్లుగానే మొగంపెట్టింది.

తన చిరనిరుత్సాహానికి లొంగని ఉల్లాసోద్రేకాలతో అతడు చివాలున లేచి, 'అవన్నీ దీనితో చెల్లు' అన్నాడు తనివితీరా బాకీతీరుస్తూ.

అంతలో గదిఅవతలినుండి కూర్మయ్య, 'భోజనం చేస్తున్నారట, ఇప్పుడే రెండు నిమిషాల్లో వస్తామన్నా'రన్నాడు.

నారాయణశాస్త్రిగారు రోగలక్షణాలను ఎంత జాగ్రత్తగా పరికిస్తాడో, రోగినికూడా అంత శ్రద్ధతోను పరిశీలిస్తాడు. ఆయన'మరేమీ విశేషంలేదు, అమువాతం మీద చిన్న జ్వరం ఉంది; ఈ చూర్ణం వెన్నాపంచదారలో కలిపి తీసుకుంటే చాలును. ఇక పథ్యం ఇచ్ఛాపథ్యమే—' అని వెళ్ళిపోతూ, 'అమ్మా సువర్ణమ్మా' అని పిలిచేడు, రోగంలేని రోగినిగురించి ఇంకా ఏయేశ్రద్ధ తీసుకోవాలో బోధపరచడానికి.

ఆరాత్రి సుందరం మామూలుగానే భోజనం చేసేడు.

భోజనసమయంలో అశనికీ, వసంతానికీ నడుమ ఆరంభమయిన కళాచర్చ (కళ కళకోసమా, మరొకందుకా అని చర్చ) రాత్రి రెండుగంటలయినా తెగలేదు.

ఇటీవల కొన్ని నెలలుగా సుందరం ఎన్నడూ అంత తన్మయత్వంతో ప్రసంగించ లేదు. అతని ఆరోగ్యానికి మంచిది కాదేమోనన్న అనుమానం కలవరపరుస్తున్నా, బిల్లాగో ఏర్పడిన ఆత్మవిస్మృతికారకమయిన వాదతైక్ష్ణ్యమును భంగపరచడానికి సాహసించ లేకపోయింది సువర్ణ.

పద్మకు అన్ని విషయాలూ మాట్లాడ్డం కులాసా వే; కాని వాటిని చర్చలక్రింద దింపేసి యుక్తులూ ప్రతియుక్తులూ పన్నుతూ కూర్చుంటేమాత్రం పరమఅసహ్యం. ఆమె చర్చను ముగించటానికి చాలాచాలా యత్నించింది నిష్ప్రయోజనంగా; చిట్టచివరికి 'ఎన్ని అంగుళాల ఎత్తు గల మడమల జోడు తొడుక్కోవడము ఫాషనో, ఏరకంచీరకు ఏరకంజాకెట్టు ఫాషనో

ఏ సినీమాతారకు ఏయే ప్రత్యేక అభిరుచు లున్నాయో అన్న విషయం చర్చనీయాంశమయినప్పుడు నీకే అత్యుత్సుకత్వం లేదే; ఇల్లాంటి గొడవలు నీకెందుకు? అన్న కటువయిన సుందరం మందలింపుతో సరోషంగా వెళ్ళి పడుకుంది. సుందరం తన భార్యను అంత కేవలం ఘావన్న మనిషిగా పరిగణించడము కష్టమనిపించి చర్చ మరీ తీవ్రంగా సాగించేడు వసంతం.

సువర్ణ తన గదిలోనుండే చర్చ పర్యవసానమూ వింటున్నది— సుందరానికి పడుకోబోయేముందు వేసుకోవలసిన మందూ, తాగవలసిన పాలూ ఇవ్వాలని ఆమె చాలాసేపు మేలుకొనిఉందికాని, ఆమెకు తెలియకుండానే నిద్రపట్టింది.

మొట్టమొదట్లో ఎప్పుడూ అనేకమాదిరిగా ఎవరితోనూ మాట్లాడని మనిషి తానెంతో తెలుసుకున్నాన్న విషయాల్లో తనతో వాదించటమూ అని అభిమాన పడ్డాడు వసంతం. కాని క్రమంగా (సహృదయుడు కావడంవల్ల) ఎదుటిమనిషి తనకంటే ఎన్నో విషయాల్లో స్థిరమయిన అభిప్రాయాలు కలవాడే కాక, అభిప్రాయాలను నిశితంగా వాక్యాలలో వెలార్చటంలోకూడా ఎన్నో ఇంతలు సామర్థ్యము కలవాడని గ్రహించి, తన వాదధోరణిని ఉపసంహరించుకొని, కేవలం శ్రోతగా తయారయేడు. ఎంతకూ సుందరం వాగ్వాదానికి ఒక అంతు లేకపోవడంతో, వసంతం ‘సుమారు రెండవుతూంది, మీ ఆరోగ్యానికి భంగం.— ఉదయం మళ్ళీ మాట్లాడుకుందాం’ అంటూ ఆనకట్ట వేసేడు ప్రాసంగికస్రోతస్వినికి.

నిద్రపోతూఉన్న సువర్ణను మేలుకొలపాలన్న తలపును త్రోసిరాజని, వెళ్ళి తన మంచంమీద కూర్చున్నాడు సుందరం.

—

ఆమెమొగంమీది చిరుచెమట తొలగిపోయేలాగ విసరాలనిమాత్రమే అనుకొని అతడు ఆమెమంచంమీద కూర్చున్నాడు. విసరుతూఉండగా అతనికి స్మృతిలోనికి వచ్చింది తాను నిద్రపోయేముందు మందు వేసుకోవాలని. కేవలం మందుమీది భక్తిచేతనే ఆమెను మేల్కొలుపుతున్నానని అతడు తనకుతాను నమ్మించుకుందికి చాలా కష్టపడ్డాడు— మనుష్యులను అతిగా లోబరచుకొన్న నాగరకతాప్రభావమువల్లనో ఏమో కోరికలు ఎంత సహజంగా బలంగా కలుగుతాయో వాటిని బైటపడకుండా (లేకుండా కాదు) అచ్ఛాదించాలనే తాపత్రయమూ అంత సామాన్యంగానే ఆక్రమించుకొంటున్నది.

మందు ఒక వ్యాజమాత్రమే. ఆమె లేచిన తరవాత మందుఅవసరమే లేదు.

‘సువర్ణా, నువ్వు నన్ను చూసి అసహ్యించుకోవడం లేదూ?’

‘అబ్బ, మీ రల్లాంటిమాట లంటే నేను ఏమయినా అయిపోవాలిగాని, మరి భరించలేను’ అని ఆమె అతన్ని మరి మాట్లాడనివ్వలేదు. అతడూ కొంతవరకు సంబాళించుకొని మరి మాట్లాడలేదు. రెండు హృదయాలూ ఏకమయి ఊపిరితీసేయి ఆరాత్రి నిర్విచారంగా, నిరాలోచనంగా.

కళాశాలాజీవితాన్ని ప్రశంసించేవారూ, బాధగా భావించేవారూకూడా ఉన్నారు. కాని, కష్టసుఖాల మాట ఎల్లా ఉన్నా అందులో ఎన్నెన్నో మధురమయిన కలయికలకు, ప్రణయాలకు దోహదప్రాయములయిన అనేక అవకాశాలున్నాయి. కాని ఎన్నయితే సావకాశాలున్నాయో అంతకు పదింతల అడ్డంకులూ, వ్యతిరేకభావనలూ ఉండటంవల్ల అక్కడ ఉద్భవించవలసిన ప్రణయకందళములు ఊహాంకురములుగా మాత్రమే అంతరించవలసివస్తుంది. అయితే, ఎన్నెన్నో ప్రత్యేక పరిస్థితుల సమ్మేళనమువల్ల, ఎక్కడో ఒక సందర్భములో ప్రణయాంకురము వైవాహిక దోహదంతో దాంపత్యజీవితవృక్షముగా విస్తరించగలదు. అటువంటి బహుపరిస్థితుల సమైక్యమువలన సమకూడినదే సువర్ణాసుందరముల వైవాహికబంధనము.

చిన్నతనంలోనే తల్లిదండ్రులిద్దరూ పోయేరు సుందరానికి. ఒక్క మేనత్తవినా కుటుంబంలోని ఎవ్వరికీ సుందరం కాలేజీచదువంటే ఇష్టంలేదు. చిట్టచివరి పిల్లవాడుకదా అనేకాక సుందరంచురుకుదనంవల్ల

కూడా అతడంటే ఆమెకు విపరీతమయిన అభిమానం. ఆవిడ సుందరంచదువు ఎక్కడా ఆగడానికి వీల్లేదని అతిపట్టుదలతో నిర్వహించింది. తుట్టతుదకు బి. యే. లో ప్రవేశించిన నెల్లాళ్లకు ఆవిడ పోవడంతో అదివరకల్లా ఉత్తరం రాసిపడేసే సరికల్లావందా యాభైగా వచ్చే డబ్బు ఎంతకూ రాకపోవడము చాలా ఆశ్చర్యం వేసింది. 'మిక్కిలి అవసరంగా ఉంది, తొందరగా డబ్బు పంపించవలసింది' అని తంతి ఇచ్చాడు. అప్పటికీ డబ్బురాలేదు. 'ఇక్కడ ఏమీ ఏర్పాటు కాలేదు, ప్రస్తుతానికి చదువు కట్టిపెట్టిరావడం మంచిది' అని, వారంరోజులు భార్యతో సంప్రదించి, ఉత్తరం రాసేడు. కాని, ఒక ఆరునెల్లు చదువు మానిస్తే సమిష్టికుటుంబంలో మెలగటం, అందులోనూ, ఇదివరకులా తనను కడుపులో పెట్టుకొని కనిపెట్టేవారు లేకుండా ఉండడంకంటే ఆత్మహత్య చాలా నయమనుకున్నాడు సుందరం. తానేమో ఒక కంబారివాడికంటే హీనంగా పనిచేయవలసిరావడమే కాదు, అన్ని విషయాల్లోనూ వాడిపాటి స్వేచ్ఛా, స్వాతంత్ర్యమూకూడా లేకపోవడము అతనికి అసహ్యగోచరంగా ఉండేది. పైగా, వాళ్ల నాన్నగారిని తెలిసిన వారందరూ సుందరాన్ని చూసి, కరుణాస్వనంతో 'పాపం, కృష్ణారావుపంతులుగారే బ్రతికిఉంటేనా, ఇంత తెలివయిన కుఱ్ఱాణ్ణి పొలంపని చేయనిచ్చేవారా?' అనేవారు. తాను పడుతున్న కష్టంకంటే ఈ సానుభూతివాక్యాలే అతని హృదయానికి గాటంగా నాటుకొనేవి.

అప్పట్లో సుందరానికి అప్పారావు ఒక్కడే స్నేహితుడు. అతను రోజూ అంటూఉండేవాడు— 'సుందరం, నీకు తెలుసునుకదా, ఆమెతరఫున ఎల్లాటి అభ్యంతరమూలేదు. నాలోనే ఉంది చిక్కంతా. లేవదీసుకొనిపోతే మా వాళ్లు ఒక్కదమ్మిడీయేనా ఇవ్వకపోవడమే కాదు, ఒక్కపూట తిండయినా పెట్టరు. తీరా సాహసిస్తే, నానాఅవస్థలూ పడి అదుపు ఆజ్ఞలు పెట్టేవాళ్లకు లొంగిపోకుండా ఉండగలమో లేమో అని భయం' అని.

అతని భయాన్ని సుందరం తన అనుమానాలతో, అనిశ్చయాలతో మరీఎక్కువ చేసేవాడు. క్రమక్రమంగా అప్పారావు సుందరంఅభిప్రాయాలకు లొంగిపోయినట్టే కనిపించేడు. అరుంధతిఊసే ఎత్తడం మానేశాడు. కాని, హఠాత్తుగా ఒక్కనాడు తెల్లవారగానే వినిపించిన వింతతో సుందరం విస్తుబోయాడు. అప్పారావు అరుంధతిని లేవదీసుకొని వెళ్లిపోయేడు. అందులోనూ, ఆమె జాగ్రత్తగా, వెంటనే ఎవ్వరూ వెతకడానికి బయలుదేరనవసరం లేకుండా, తన నగలన్నీ తీసి భద్రంగా పెట్టెలో ఉంచి మరీ వెళ్లిపోయింది. బంధుసమూహులు ఆమె వెళ్లిపోవడమే ఒక పెద్దబరువు తేలికయినట్లు భావించేరు.

ప్రత్యక్షంగా తనకు ఏవిధమయిన సంబంధమూ లేని ఈ సంఘటనతో సుందరంలో ఎక్కడలేని ధైర్య సాహసాలూ పుట్టుకొచ్చాయి. అందరివల్లా నిరసించబడుతూ, ఆ జన్మాంతమూ వైధవ్యావస్థ ననుభవించవలసిన అరుంధతి—ఒకనాడు ఆత్మహత్యకు కూడా సంసిద్ధురాలయి తనవలన రక్షించబడిన ఆమెలోనే ఇంతటి ధైర్యసాహసాలు కలగటానికి వీలున్నప్పుడు, తానామెకంటే అన్ని విషయాల్లోనూ ఎంతో ఎక్కువవాడ ననుకుంటూకూడా ఎందుకు ఏమీ చేతకానట్లుగా ఉండిపోవాలి?

పెద్దన్నయ్య బండివాళ్లకు ఇమ్మని ఇచ్చిన ఆరు రూపాయిలతోనూ బి. యే. చదవటానికి పట్నం చేరుకొన్నాడు సుందరం. అతని సాహసం వృథా పోలేదు. ఆ సాహసాతిరేకంలో అతనికి డబ్బువచ్చే ఏపనిఅయినా క్షుద్రముగా తోచలేదు. పూర్వం ఎటువంటివాళ్లనయితే అతినికృష్టంగా చూసేవాడో, ఇప్పుడు అటువంటివాళ్లతోనే స్నేహం ఆరంభించేడు. సెప్టెంబరుపరీక్షలకి వెళ్లే కొందరు విద్యార్థులకు పరీక్షల విషయంలో చాలామంది ప్రొఫెసర్లుసైతం చెయ్యలేని ఉపకారం చేసేడు. పైగా అతడి టెన్నిసు, చదరంగం, కవిత్వధోరణి ఇవన్నీ అతిసూక్ష్మంగా అతన్ని ఊళ్లోని పదిమందితోనూ పరిచయం చేసేయి. ఎవరయినా ఏమిటి చేస్తున్నావని అడిగితే యథార్థస్థితిని (ముఖ్యంగా ప్రస్తుతపు పేదరికాన్ని) ఒప్పుకుండికి ఏమీ అభిమానంగా ఉండేది కాదు. ఎల్లా అయితేనేం, మళ్లీ సంవత్సరం అందరి సాయంతోనూ,

కాలేజీ ప్రిన్సిపాలు సుబ్బరామయ్యగారి అను గ్రహంవల్లా అతడి బి. యే. చదువు ఆర్థికంగా అట్టే కష్టంగా తోచలేదు.

బి. యే. చదువుతూ ఉండగానే సువర్ణ అతనిని తెలుసుకోవడం సంభవించింది. అంటే ఆమె అతన్ని తెలుసుకున్నంత బాగా అతడామెనుగూర్చి తెలుసుకోలేదు. క్లాసంతటికీ మిక్కిలి తెలివయినవాడని కాదు గాని అతని వక్తృత్వచమత్కృతీ, టెన్నిసులోని నేర్పూ, కాలేజీ మేగజైనులోని పద్యాలూ ఇవన్నీ కలిసి ఆమెదృష్టిలో అతన్ని స్థిరంగా నాటుకొనిపోయేలాగ చేసేయి. కాని అతనికిమాత్రం ఆమె ప్రసక్తే లేదు.

ఆమె తనంతట తాను ఎవరితోనూ మాట్లాడదు గాని, ఎవరయినా మాట్లాడాలని ఉత్సాహం చూపిస్తే మాత్రం మాట్లాడ్డంలో వెనుకంజ వేసేదికాదు. కాని, సుందరంమాత్రం అటువంటి ఆతృత ఎన్నడూ చూపెట్టకపోవడమే కాదు, ఆమె ఒకింత ఆ ధోరణిలో ఉన్నా, ఏదో మిక్కిలి తొందరపని ఉన్నట్టు వెళ్లిపోయేవాడు.

అదివరకల్లా వాళ్ల కాలేజీ మేగజైనులో ఎప్పుడూ సుందరంపద్యాలదే మొదటిస్థానము. కాని ఒకపర్యాయము ఆ స్థానాన్ని సువర్ణ గేయాలు ఆక్రమించుకోవడం కాలేజీ విద్యార్థులలో కొంత అలజడికి కారణభూత మయింది. 'ఎంతయినా గర్లుస్టూడెంటుకి ఉన్న ప్రిఫరెన్సు (ఎంపకము) మనకి ఉండదోయి' అన్నారు కొందరు సుందరంఅనుయాయులు. సుందరంమాత్రం ఒప్పుకోలేదు. 'మనని మెచ్చుకొన్నప్పుడు సరియయిన ఎంపకమూ, మరొకప్పుడు వేరొకటీనా ? నిశ్చయంగా ఆ గేయాల్లో ఎంతయినా కవిత్వం ఉంది. నాది కేవలం గణబద్ధమయిన వచనం' అన్నాడు ధీమాగా.

ఆ తరవాత కొద్దిరోజుల్లో మళ్లీ తన ఆధిక్యతను నిలబెట్టుకోగలిగేడు సుందరం. పద్యరచన పోటీలో అతనిది మొదటిబహుమతి; ఆమెది రెండవబహుమతీని. అయితే ఆ ఓటమివల్ల సువర్ణకు ఆనందమే ఎక్కువగా కలిగింది.

అప్పటికప్పుడే వాళ్ల యూనివర్సిటీపరీక్షలు చాలా దగ్గరపడ్డాయి. సువర్ణ ప్రతిరోజూ ఏదో నవల చదువుతూనో, పద్యాలు వ్రాస్తూనో గడిపివేస్తూ, ఇవాళకు అయిపోయింది, రేపటినుండి సరిగా కార్యక్రమం ప్రకారం చదువు జరిగితీరాలనుకొనేది. కాని, ప్రతిరోజూ ఇల్లాటిదే ఏదో తప్పనిసరిపనివచ్చి, పఠనకార్యక్రమం వెనకపడేది.

ఆమె మేనమామా, సంరక్షకుడూ అయిన సాంబమూర్తి బహు మితభాషి. ఆయన ఏవేవో పూర్వచరిత్రలనుగురించి గాని, చదరంగంగురించి గాని తప్ప మరి వేటి గురించీ మాట్లాడలేడు. చదరంగమనేదే లేకపోతే ఆయనకు వర్తమానకాలమనేదే ఉండకపోవునేమో అన్నంత స్తబ్ధంగా ఉండేవాడు. కాని రాకలసిన రాబడిని చేజిక్కించుకొనే సందర్భంలోమాత్రం ఆయన చాకచక్యం అపారమయినది.

ఆయన రెండుమూడురోజులనుండి ఏకదీక్షగా క్లబ్బులో చదరంగం ఆడి తనివిచెందక తన ఇన్ని సంవత్సరాల అనుభవానికి అజేయుడయిన యువక ప్రతిస్పర్థిని వెంటపెట్టుకొని వచ్చి ఇంటిదగ్గరే ఎత్తుపై యెత్తు ఆరంభించాడు. ఆట మంచి కటాకటిగా ఉన్న సమయంలో సువర్ణ వచ్చి, 'మామయ్యా, ఆ రైతులు రైలుకి వెళ్లిపోవాలిట, నీతో మాట్లాడాలి అంటున్నారు' అంది. సాంబమూర్తికి ఆటలోనుండి లేవడం ఇష్టంలేదుగాని, తప్పనిసరిగా లేచేడు. సువర్ణ 'పోనీ, నీఆట అందాకా నేను ఆడుతూఉంటానులే' అంది. ఆయన నవ్వుతూ, 'బాగుందమ్మా, నేనే సరిగా ఆట నిలబెట్టలేక మూడురోజులనుండి తంటాలుపడుతూ ఉంటే నువ్వు ఆడడమా' అంటూ హాలులోకి వెళ్లిపోయేడు.

ఆయన వెళ్లిపోయినా, సుందరం చదరంగం బల్లమీదనుండి మొగం ఎత్తలేదు కొంతసేపటివరకూ. ఆమె, ఇక మరి లాభం లేదని, గంభీరంగా ముఖం పెట్టి, 'ఇదేనేమిటి సార్, యూనివర్సిటీ పరీక్షలకి తయారవటం?' అంది. లోపల్లోపల ఆమెకు, తనలాగే కాదు, తనకంటే కూడా కాలహరణప్రవీణుడయిన వ్యక్తి ఉన్నాడనే తృప్తిలవము లేకపోలేదు.

రాని నవ్వును బలవంతంగా తెచ్చుకుంటూ 'ఇదొక్కటే అయితే బాగానే ఉండును. ఇంకా

ఇల్లాంటి తలతిరుగుడుపనులు ఎన్నెన్నో ఉన్నాయి. ఏం చెయ్యమన్నారు, దేనిమట్టుకదే అవసరంగా, తప్పనిసరిగా ఉంటుంది అప్పటిమటుకు'—అన్నాడు ఆదివర కెంతో పరిచయం ఉన్నట్టు.

తిరిగీ సాంబమూర్తి వచ్చేక ఆమె మరి ఆట ఆడనివ్వలేదు. 'సరిగా నెల్లాళ్లయినా లేవు తెలుసునా మా పరీక్షలు. ఎంత తెలివయినవాళ్లయినేమాత్రం ఇలా దీక్షగా చదరంగం ఆడుకుంటూకూర్చుంటే—' అని సాభిప్రాయంగా ఆగింది.

'ఏమిటే, మీరు కాలేజీలో చదువుతున్నారా?' అన్నాడు సాంబమూర్తి అప్పుడే తెలివివచ్చినట్లుగా.

'ఆఁ, మేమిద్దరమూ ఒకటే క్లాసు. ఆప్షనల్సు (ప్రత్యేక విషయములు)కూడా సమానమే' అన్నారు ఉభయులున్నూ.

—'అయితే ఈ నెల్లాళ్లూ మీరిద్దరూ కలిసి చదువుకుంటేనో' అన్నాడు సాంబమూర్తి సూచనగా.

ఆమె సాభిప్రాయంగా అతని వంక చూసింది.

అతడు నిర్మొగమాటంగా 'మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. కాని నాకు ఒకరితో కలిసి చదవటం అలవాటులేదు. రాత్రి ఒంటిగంటప్పుడయినాసరే, నేను ఒంటరిగా చదువుకుంటేనే నాకు చదివిన కాస్తా అర్థమవుతుంది. పైగా నాకు మరొక బాధ్యతఉంది. పరీక్ష ఏమయినాసరే, మా సూర్యాన్నిమాత్రం పాసుచేయించాలి' అన్నాడు.

'ఎవరు? ఎప్పుడూ నూటు వేసుకొనే ఆ పొడావు—'

'అవును. వాడే ఆసలు ఈ సంవత్సరం నా కాలక్షేపం వడిదుడుకులు లేకుండా సాగడానికి వాడే కారణం. అంచేత ఎల్లాగో ఒకలాగు వాణ్ణి ఈ నెల్లాళ్లూ కష్టపడి తయారుచెయ్యాలి. అధమం, ఇంగ్లీషు తెలుగుల్లోనయినా వాణ్ణి పాసుచేయిస్తానని కంకణం కట్టుకున్నాను—'

'మంచికంకణమే—మరి మీ పరీక్షో?'

'వాడు పాసయితే నాకదే చాలును—నాకు ఎల్లాంటి మార్కులువచ్చినా, చివరికి పరీక్ష ఏమయినా సరే నాకు విచారంలేదు.'

'మంచి పూనికే. ఇలా చదరంగంలో లీనమయితే ఆయనమాత్రం ఎల్లా ప్యాసవుతాడు?'

'అదే ఆలోచిస్తున్నాను. కాని ఎదురుగా చదరంగం కనిపిస్తూఉంటే నాకు తక్కిన ప్రపంచకమే అక్కరలేదు. సరేకాని, పంతులుగారూ శలవు, ఆట సుమారు పూర్తయినట్టేకదూ, ఇక మూడెత్తులలో వేసి రాజు ఆటకట్టు; శలవు, వస్తానండి'అంటూ చరచరా వెళ్లి పోయేడు.

ఆమె చాలా అభిమానపడ్డది. తాను ఇంతగా మాట్లాడాలనీ, కలిసి చదువుకోవాలనీ కుతూహలం చూపిస్తూ ఉండగా, అంత నిర్లక్ష్యంగా వెళ్లి పోవడమా? తానేమీ మొద్దుపిల్ల కాదే; ఫస్టుక్లాసు వస్తుందేమోనని ఆశకూడా పెట్టుకొంటున్నదికదా!

ఆమె అతిదీక్షగా చదువు సాగించాలనే ప్రయత్నించింది. కాని ఆమెప్రోద్బలము ఏమీ లేకుండానే క్రమక్రమంగా సుందరాన్నిగూర్చిన ఆలోచనలు ఎక్కువ కాసాగేయి ఆమె మనస్సులో.

నాలుగురోజులు పోయిన తరువాత మట్ట మధ్యాహ్నపు ఎండలో, చెమటలు కక్కుకుంటూ వచ్చేడు సుందరం. ఆమె చాలా ఆశ్చర్యపడ్డది అతని వాలకం చూసి.

'నానోట్సూ, తన పెట్సూ కలిపి పారేశాడట మా సూర్యం. బహుశః పరీక్షలదగ్గరకదా అని ఎవరో స్నేహితులే సంధించిఉంటారు—మీ్రదామా పెట్సూ, నోట్సూ ఒకపర్యాయం ఇస్తే రాత్రి కావలసిన ముఖ్యాంశా లేవో తీసుకొని రేపటి కిచ్చేస్తాను.'

'బాగానే ఉందండీ, పరీక్షలముందరయినా పుస్తకా లివ్వగలరా? అందులోనూ మీరే చెప్తున్నారు మీ పుస్తకా లెవరో సంధించారని, వావాటిగురించి మాత్రం అంతకంటే నిబ్బరం ఏమిటి?'అంది సోల్లాసంగా సువర్ణ.

'అవును నిజమే, ఎవరికయినా అవమానం ఉండవలసిందే. అందులోనూ నేను పరధ్యానంగా మరిచి పోయి ఊరుకుంటే మీ రనవసరంగా శ్రమపడవలసి

వస్తుంది' అంటూ తన పని అయిపోయినట్లుగా వెనక్కి తిరిగేడు.

ఆమె తడబడుతూ 'ఉండండి, పుస్తకాలు తీసుకొనివస్తాను' అంటూ తన గదిలోకి వెళ్లింది.

అతడు కొంచెం ఆశ్చర్యపడి నిలబడ్డాడు. ఆమె పుస్తకాలు తెచ్చి టేబిలుమీద ఉంచింది. అతడి వైఖరి చూస్తే, ఎక్కువసేపు మాట్లాడాలనికాక, వెంటనే పుస్తకాలు తీసుకొనివెళ్లి పోవాలని ఉన్నట్లుగా రూపించింది. అతని తొందరను గమనించిన ఆమె 'మీ నోట్సులన్నీ నాకు ఇస్తానని మాట ఇస్తేనే' అంటూ పుస్తకాలతని చేతిలో ఉంచింది.

అతడు 'అలాగే, తప్పకుండా, సాయంకాలం హాటలుకి వెళ్లినప్పుడు మోడరన్ పొయిట్రీనోట్సూ, నాండీసైల్డు ఎస్సేలూ ఇస్తాను' అని మరి ఆమెమాట విని పించుకోకుండానే వెళ్లిపోయేడు.

పరీక్షలవేళకు వారి పరిచయం మరికొంత బిగుసుకుంది.

ప్రతిపరీక్షకూ రానని ఎంతో మురిపిస్తూ సుందరంబలవంతంమీద కూర్చొన్న సూర్యం పాసయేడంటే, అది కేవలం సుందరంఆత్మశక్తే అనడాని కెట్టి సందేహమూ లేదు.

సుందరం కాలేజీకి రెండవవాడుగా పాసయేడు. పాపం, సరిగా సమయానికి వచ్చిన జ్వరంతో బాధపడుతూకూడా సువర్ణ ఇంగ్లీషు తెలుగు పరీక్షలకు హాజరయింది. తక్కినవాటికి కదలడానికి వీల్లేనంతగా జ్వరం ఎక్కువకావడంవల్ల ఆమెపరీక్ష పూర్తి కాలేదు.

రెండునెలలు పైగా వేధించిన జ్వరం బాగా తగ్గినతరువాత ఆమె సుందరానికి కబురుచేసి 'మొన్నటి పరీక్షలకు మీ సూర్యంగారిని తయారుచేసినట్లుగా, నన్ను రేపటి సెప్టెంబరు పరీక్షలకు తయారుచేసే బాధ్యత మీది' అంది.

అతడికి దిగ్భ్రమ కలిగింది—'వాడికోసం నేను కష్టపడలేదననుగాని, అందులో నా స్వార్థం చాలా ఉంది. వాడికి బాగా బోధపరచటంకోసం నేను బాగా చదువుకోవడమేకాక, అసలు ఒక్కపుస్తకమయినా నేను కొనలేదు; కాలేజీవాళ్లిచ్చిన స్కాలర్‌షిప్పు తప్ప తక్కిన నా ఖర్చంతా వాడే పెట్టుకున్నాడు.'

'కావచ్చును—నన్ను తయారుచెయ్యటంలో మటుకు స్వార్థం ఉండకూడదా ఏమిటి? నేనూ మీ శ్రమను వృథాపోనివ్వను; మీ సహాయం ఉంటే—'

'డబ్బుగురించా, ఊరికినే సరదాకి అన్నాను—అంత కేవలం డబ్బుకోసమే అయితే ఇంకా చాలా విధానాలున్నాయి. సరేలెండి, మీరు సహజంగానే ఫస్టుక్లాస్‌తో పాసవవలసినవారుకదా, మీకు ఒకరి సహాయం ఏం ఉపయోగిస్తుంది? ఏమో, నాకుమాత్రం ఒకరు చెప్పినకంటె నేను చదువుకుంటేనే ఏదైనా బాగా బోధపడుతుంది.'

'అదంతా నా పూచీ; మీరు ఇష్టపడితే చాలును.'

—సెప్టెంబరులో ఆమె బి. యే. పూర్తయేక, కొంతకాలము దేశమంతా తిరిగి, తరవాత ఇద్దరూ యం. ఏ., బి. యల్. చదవాలని ఊహ. తక్కినన్నీ కుదిరేయిగాని, ఆమె బి. యే. చదువుమాత్రం పూర్తి కాలేదు—ఆ అవసరంకూడా కనబడలేదు.

ఆ సంవత్సరాంతాన సువర్ణా సుందరములు భార్యాభర్తలయేరు.

అతడు యం. ఏ., బి. యల్. చదువుతూ చదువుతూ మానివేశాడు, ఆమె మేనమామ సాంబమూర్తి డబ్బు పంపడంలో చేసిన అశ్రద్ధను ఆమెఔదాసీన్యంగా అపార్థం చేసుకొని.

ఆ తరువాత సువర్ణ ఎంతో బతిమాలింది, మళ్లీ చదవమని. అతడుమాత్రం మరి అంగీకరించలేదు.

పోనీ, మానివేసినవాడు నిర్విచారంగానయినా కూర్చున్నాడా అంటే అదీ లేదు. ఏవేవో నానా రకాల ఉద్యోగప్రయత్నాలు. ఆమె చాలాసార్లు అతన్ని బెదిరించింది, మీరు ఉద్యోగం చేస్తే నేను హత్య చేసుకుంటానని.

'మరి నన్నేం చెయ్యమంటావు సువర్ణా, నీ డబ్బు తింటూ, ఆ తిన్నదయినా అరగకుండా చేతకాని దద్దమ్మలాగ కూర్చోమంటావా?' అనేవాడు సుందరం.

'అదేమి మాటలండీ, నాడబ్బని నేనెన్నడూ అనుకోలేదు. నా చిన్నతనంలో కొన్నాళ్లు మా నాన్న గారి డబ్బు; ఆ తరవాత కొన్నాళ్లు మా మామయ్యది; తరవాత మీది—అంతే. దానితో నాకు పూచీ లేదు.'

ఆత్మప్రతిష్ఠాపరుడయిన సుందరానికి అంత మాత్రంలో తృప్తికలగలేదు.

'పోనీ, మీరేదయినా వ్యాపారం చెయ్యండి. అందుమీద వచ్చిన లాభంతో మనం కాలక్షేపం చేద్దాము. అసలు డబ్బు ముట్టుకోకుండా' సుందరానికి ఈ అభిప్రాయం నచ్చింది. కేవలం ఒకరి క్రింద నౌఖరీ చెయ్యటంకాదు. అలాగని పనిలేకుండా ఆర్జన లేకుండా కూర్చోడమూ కాదు. బాగానే ఉంది అనుకొన్నాడు.

స్వదేశీవస్తువుల వ్యాపారం, ముద్రాయంత్రము, వారపత్రిక—అన్నీ ఆలోచనల్లో అద్భుతంగా ఉన్నాయి. కాని, తీరా అడుగుపెట్టేసరికి, వాస్తవికవ్యావహారిక జగత్తులో కష్టనష్టాలను ఎదుర్కొనే శక్తి లేకపోయింది సుందరానికి. లాభాలేమో తాను ఊహించినకంటే ఎక్కువగానే వస్తున్నట్టు కనబడేదిగాని, అవేవో క్రొత్తక్రొత్త తప్పనిసరి ఖర్చులూ, పెట్టుబడులూ! ఎప్పుడూ డబ్బుఏమీ తేలేదికాదు. కాని సుందరం అట్టే తెలివితక్కువవాడు కాడు. నష్టం వస్తున్నదని గమనించగానే అతిచమత్కారంగా ఎక్కడిదక్కడ తెగగొట్టి సర్వవ్యాపారాన్నీ ఉపసంహరించేడు.

వ్యాపారాన్ని కట్టిపెట్టేస్తున్న రోజుల్లోనే అతడు ముచ్చటగా మూడు కథలు రాశాడు—తననే ప్రధానపాత్రగా చేసుకొని, తనచుట్టూ ఉన్న వాతావరణాన్ని, స్నేహితులను తన ప్రత్యేకదృక్పథంనుండి పరిశీలిస్తూ. మూడుకథలూ తన జీవితంలోని మూడు విభాగాలకు చెందినవి. వాటిలో ఏయే ప్రత్యేకలక్షణాలు ఉన్నా లేకపోయినా, సహజత్వానికి సారళ్యానికి లోటులేదు. పైగా కథావస్తువుకూడా అంత నీరసమయినది కాదు.

ఏమయితేనేమి, అతని మూడుకథలకూ రాదగినకంటే ఎక్కువగానే పేరుప్రతిష్ఠలు వచ్చేయో, లేక ఆరంభంలో ఎవరు ఏమాత్రం పొగిడినా అతిగా కనిపించేవో సుందరానికి, తాను ఏమయినా ఏమికాకపోయినా—అసమంజ ఒక రచయిత ననుకొన్నాడు. తన భావిక్రృషిక్షేత్రము సారస్వతక్షేత్రమే అని నిశ్చయించుకొన్నాడు.

కాని, తీరా అతను రచయిత ననుకొని, తీర్చిదిద్ది వ్రాసేసరికల్లా అతని రచనల్లో మెచ్చుకోదగిన అంశాలతోపాటు చాలా లోటుపాట్లుకూడా కనిపించసాగాయి విమర్శకలేఖినులకు. అది సుందరంకాక మరెవ్వరయినా అయిఉంటే అతిసామాన్యంగా లెక్కచేసిఉండరు. కాని వయసుతోపాటు సుందరంలో అసహనంకూడా ఎక్కువ కాసాగింది. ఏమాత్రపు నిరుత్సాహకర విమర్శనకూ తాళుకోలేకుండా నేకాదు, తాను ఆశించిన ప్రోత్సాహమూ, ప్రశంసా ఆశించినకంటే ఒకింత తక్కువగా వచ్చేసరికల్లా ప్రపంచం అంతా తనను అవహేళన చేస్తున్నట్లుగానే, తనను తన అశక్తికి ఎత్తిపొడుస్తున్నట్లుగానే ఉండేది.

ఎంతోకాలం స్నేహితులుగా ఒకరినొకరు చిన్ని దృక్పథాలనుండి పరిశీలించుకొన్నవారే వారిద్దరూను—పరిచయంగా, మైత్రిగా, బంధముగా వారి స్నేహలత కొనలుసాగి ననలెత్తి తావులెలసి వెలసిన వెనుకనే వారు భార్యాభర్త లయేరు. ఇక ఈ స్నేహమూ, ఈపరస్పరాకర్షణా ఇవన్నీ దృఢంగా నిలబడతా యన్న విశ్వాసం కుదిరిన వెనకనే వివాహబంధాన్ని వరించేరు వారు ఉభయులున్నూ.

పెళ్ళిఅయిననాటినుండి అదేదో విభేదము వారి నడుమను ఏర్పడినట్లయింది. బంధము లేని ఆ తొలిరోజులలోని లాలస క్రమంగా నిర్బంధముగా తోచేదేమో. ఆమె ఏదో మారిపోతున్నదనేకాదు, తాను యద్విధంగానూ ప్రయోజకుడు కాకపోవడంవల్ల ఆమెకు తనమూలంగా ఆనందలేశమయినా కలగటం లేదనీ,

తనమూలంగానే ఆమె ఎంతో సౌఖ్యాన్ని కోల్పోతున్నదనీ సుందరం అభిప్రాయం.

నిరుత్సాహం అనేది మానవుడిలో పొడసూపకనే పోవాలిగాని, అది ఒకమారు పొడుకొంంది అంటే క్రమంగా ఇతరభావన లన్నిటిమీదా తన ముద్రను బలంగా హత్తగలుగు. క్రమక్రమంగా, తాను అని ఒక వ్యక్తి లేకపోతే సువర్ణ ఇంతకంటే ఎంతగానో ఆనందించగలిగిఉండుననీ, ఇక తక్కిన లోకానికికూడా తన అవసరం ఏమీ ఉన్నట్టుగా లేదనీ, అందువల్ల తాను విశ్వనాటకరంగమునుంచి ఎటువంటి అలజడీ లేకుండా నిష్క్రమించటమే ఉచితోచితమనీ భావించే స్థితికి వచ్చేడు సుందరం.

అదివరకే సూక్ష్మరూపంలో ఉండినా, వివాహమయిన ఉత్తరక్షణమునుండి సువర్ణ జీవితంలో ఒక క్రొత్తలక్ష్యము ప్రస్ఫుటమయింది. అది ఏదంటే సుందరాన్ని కేవలం సుందరంగాకాక భర్తగా ఆరాధించటము. ఆమెనైఖరిలోని ఈ క్రొత్తపద్ధతి అతనికి అర్థం కాలేదు. తననుగూర్చి ఆమె ఎక్కువగా కష్టపడుతున్నదేమోనని, తననుకాక ఇంకెవ్వరినయినా ఆమె వివాహంచేసుకొనిఉంటే ఆమె చాలా ఆనందించగలిగిఉండునన్న అనుమానంతోనే అతడు నిత్యమూ ఆకులపడుతూఉండేవాడు. అతనిని సరిగా ఆనందింప జేయలేకపోతున్నందుకుగాను ఆమెకూడా మథనపడుతూనే ఉండేది. కాని ఇద్దరూ సౌమ్యత్వానికీ, నాగరకతకూ ఒకరికి ఒకరు తీసిపోయేవారు. కారు. కాగా, తాము అతిఅన్యోన్యంగానే ఉన్నట్టు లోకాన్ని నమ్మించే విషయంలో ఇద్దరూ అద్వితీయులే.

తనవద్దకూడా ఎంతగా దాచినా, ఆమె అతని అసంతృప్తిని గుర్తించగలిగేది. "ఆమెఎన్నో పర్యాయము లంది—నాపేరను భూములూ, వ్యవహారాలూ అన్నీ ఉంచటం చాలా అసహ్యంగా ఉంది. చీ కీమాటికీ నాపేరునే అన్నికాగితాలూను. ఒక మంచిముహూర్తం చూసి అన్నీ మీపేరుకి మార్పించేస్తా"నని. అతడు చాలా తేలికగా, ఉల్లాసాన్ని ప్రకటిస్తూ, 'ఎందుకు పోనిద్దూ, ఇప్పుడంతటి అవసరం ఏమివచ్చింది ? ఇప్పుడు నీకుగాని నాకుగాని ఏమైనా ఇబ్బందిగా ఉందిగనకనా ?' అనేవాడు. ఆమె తాత్కాలికమయిన అతని సమాధానంతో తృప్తిపడి ఊరుకునేది. అతని మనస్సుకూ తెలిసేది ఆమెలో ఎట్టి కల్మషచ్ఛాయా, కృతకత్వలవమూ లేదని. కాని అతని మనస్సుమాత్రం ఒంటరిగా ఉండేసరికల్లా ఏమేమో ఆలోచించకుండా ఉండలేకపోయేది.

ఎంతగా పొడుకొనిపోయిన కల్మషమయినా సరే, ఉవ్వెత్తుగా పొంగిపొరలే స్రోతస్వినిలో కొట్టుకొనిపోయినటు. తన హైన్యాన్ని గూర్చి, అసామర్థ్యాన్నిగూర్చి ఎన్నిఎన్ని వింతయోచనలు కలిగినా, నిత్యమూ సువర్ణముఖంనుంచి వెలువడే స్మితామృతతరంగాలలో తలమునకలు కాకుండా ఉండలేకపోయేది అతని మనస్సు. ఆ ఆనందసుషమవెనుక లోపల్లోపల విషాదనీరదాలు ఉండినా ఆమెకుమాత్రం గోచరించే సావకాశం ఏదీలేదు.

అనుదినమూ,అనుక్షణమూ ఎన్నెన్నో మాటపట్టింపులూ, అభిప్రాయభేదాలూ వస్తూఉండినా పద్మనసంతుల దాంపత్యములో అంతకంటే ప్రబలమయిన విభేదము ఏదీలేదు. మొత్తంమీద ఇద్దరూ ఉల్లాసంగా జీవితం గడపడమే తల్లక్ష్యమని నమ్మేవారే—కాని, ఆ లక్ష్యసిద్ధికి అనుసరించే పథాలలోనే విభేదము. కాని, ఆరకం విభేదాలు ఎంత తరుచుగా వచ్చేవో అంత తేలికగా అంతరించేవి. మొత్తంమీద వారిది అనుకూలదాంపత్యమనే చెప్పవచ్చును. ఆ అనుకూల్యమునకు వారి ఉభయుల ఆర్థికసంపత్తికూడా ఎంతో దోహదం చేసింది.

పరిస్థితులు ఎప్పుడూ ఒక్కలాగే ఉండవు. తన ఇష్టంకంటే సుందరం బలవంతాన్ని ఆధారంగా చేసుకొని సువర్ణ బయలుదేరింది చెల్లెలు పద్మకు జబ్బుగా ఉందంటే. మొదట్లో సుందరం తానూ బయలుదేరేనుగాని, చిట్టచివరకు టిక్కెట్లు తీసుకొనే వేళకు తనకూ ఎంతో ఆత్రుతగా ఉన్నా తాను ఇంటిదగ్గరే ఉండి చేయవలసిన పని చాలా ఉండడంచేత తాను ఆగిపోవలసిఉందన్నాడు. కొంతసేపు సువర్ణ అతన్ని ప్రోద్బ

లనుచేసిందిగాని, అతడి నైశ్చల్యానికి లొంగిపోయి, 'నేనూ అట్టే ఉండను—కొద్దిలో ఏమాత్రమయినా నయంగా ఉంటే వాళ్ళను ఇక్కడికే తోడుకొని వస్తా'నని చెప్పి రైలెక్కింది.

క్రమక్రమంగా రోగిని కదపడానికి వీలులేని పరిస్థితిలో కొన్ని నెలలు గడిచేయి. ఎల్లానయితేనేం, రోగం తిరుగుమొగం పట్టింది. ఈలోపున పద్మభర్త వసంతం రాసిన కృతజ్ఞతాలేఖలకు ఒక అంతులేదు. కొన్నాళ్ళపాటు చదివిచదివి సుందరం వాటిని చదవడం మానుకొన్నాడు.

సువర్ణ వ్రాసింది—'౨౫ తేదీ రాత్రి బండిలో అక్కడికి వస్తున్నాను' అని. అదే భోగట్టా వైరుకూడా వచ్చింది.

ఆవేళ మధ్యాహ్నం వైరువచ్చిన దగ్గరనుండి సుందరం మామూలుకంటే ఎంతో ఉత్సాహంగా ఉన్నాడు. అప్పటినుండి అదేపనిగా గదిలో అటూ ఇటూ పచారుచెయ్యటం ఆరంభించాడు. మధ్యమధ్యను టేబిలుమీదో, మంచంఅంచునో ఒక్కక్షణం కళ్లు మూసుకొని కూర్చొనేవాడు. మళ్ళీ లేచి, ఇనుమడించిన త్వరతో నడక మొదలుపెట్టేవాడు.

రాత్రి పండ్రెండుగంటలకు రయిలు రావలసి ఉన్నా సాయంకాలము ఏడుగంటలకే కారు స్టేషనుకి తీసుకొనివెళ్లా లన్నాడు సుందరం.

కారుడ్రయివరు వెంకట్రావు ఏడుగంటలకు సర్వం సిద్ధంచేసుకొని, బితుకుగా అతనితో మనవిచేసుడు.

'ఇంకా నువ్వు వెళ్ళలేదా? బండీ ఎప్పుడు వస్తే నీకేమి' అని గొంతు తగ్గించి, నెమ్మదిగా బోధపరుస్తున్నట్టుగా 'మాడూ, వెంకట్రావు, రయిళ్ళ సంగతినమ్మలేము. ఒక్కొక్కప్పుడు గంటలకొద్దీ లేటుకావచ్చునుగాని, ఒక్కొక్కనాడు సరీగా వేళకి వచ్చేస్తాయి. అయినా మనకు ఇక్కడ వేరే చెడిపోయే పని లేనప్పుడు అక్కడికే వెళ్లిఉండటం మంచిదికాదూ? నువ్వు వెళ్లు—నాకుగాని, నిద్రరాకపోతే నేను పదకొండు పన్నెండు అప్రాంతంలో సైకిలుమీద బయలుదేరివస్తాను; నువ్వు వెళ్లు' అన్నాడు.

సుమారు రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతంలో వైద్యుడు నారాయణశాస్త్రిగారు వచ్చేరు. ఇన్నిసంవత్సరాల అనుభవంలోనూ ఆయన ఎన్నడూ సుందరాన్ని అంత ఉత్సాహంగా చూడలేదు. తనంతటతాను ఎన్నో విషయాలు చర్చించి స్వయంగా మందడిగి తీసుకొన్నాడు. భోజనంకూడా రోజూకంటే తృప్తికరంగానేచేసేడు. ఆనాటి అతని హుషారు ఆరునెలలు కనబడకుండా, ఇతరకృత్య నిర్వహణంలో నిమగ్నురాలయిన భార్య విజయవంతంగా తిరిగివస్తున్న దన్న ఆలోచనవల్ల కలిగిందని సామాన్యంగా అర్థంచెప్పవచ్చును. కాని, అర్థాలకేమి, ఒక్క భగవద్గీతకు బహుభాష్యాలు; ఒక్కొక్క భాష్యానికి అనంతమయిన వ్యాఖ్యానాలు. అలాగే మానవుల ప్రవర్తనకుకూడా ఎన్నిరకాలుగానో అర్థం చెప్పవచ్చును. కాని ఎన్ని అర్థాలు ఎంత తెలివితేటలుగా చెప్పినా, ఏఒక అర్థంకూడా మూలాన్ని పూర్తిగా విస్పష్టంగా తెలుపలేదు. అది కేవలం వ్యక్తుల తరహాల ననుసరించి కేవలం ఊహావలనమాత్రమే తెలియవలసినది.

రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో అతడు పడకకుర్చీలో కూలబడ్డాడు. ఇక మరి ఒక్క మూడు గంటలే ఉన్నా యన్నమాట తననూ, సువర్ణనీ ఎడంగా ఉంచడానికి. కాని, దగ్గరగా ఉన్న కాలమంతా తామిద్దరూ సంపూర్ణంగా కలిసేఉన్నారా? లేదు, లేదు. ఏదో ఒక బ్రహ్మాండమయిన అగడ్త తమ ఇద్దరినీ దూరదూరంగా ఉంచేస్తున్నది—అది అంతరించడమెలాగు??

అతని మనస్సు క్షణానికి ఎన్నెన్నో వేలపర్యాయములు పరిభ్రమించే యంత్రంకంటే వడిగా పనిచేయసాగింది.

గడియారం పదిన్నర కొట్టుతూఉండగా అతడు ఏదో నిశ్చయానికి వచ్చినట్లుగా కుర్చీలోనుండి లేచేడు.

ఒకమారు క్రిందకు దిగి, అంతా సరిగానే ఉన్నదనుకొని, అతడు గదిలోపున గడియవేసుకొని, పుస్తకాల బీరువా తలుపుతీసేడు.

మధ్య అరలోని పుస్తకాల నొత్తిగెలించి, వాటి వారనున్న చిన్నసీసాను బైటకితీసి అస్ఫుటంగా ఉన్న

దీపపువెలుగులో సంతృప్తికరంగా చదువుకొన్నాడు సీసా పేరు. సందేహ మేమీలేదు—పొటాసియమ్ సైనేడు.

సదరహాసంగా వెళ్ళి టేబిలుమీద సీసా ఉంచి, అదివర కెన్నడూ ఎరగనట్లుగా తనను అద్దంలో పరీక్షగా చూసుకోసాగాడు.

అత నల్లా నిలబడిఉండగానే పదకొండు కొట్టింది గడియారం. అతడికి చాలాకోపంవచ్చింది—తాను చేయవలసిన పని ఇంకా చాలా మిగిలిఉండగానే వేళ అయిపోవడమేమా అని.

బీరువా తీసి చూసుకొన్నాడు - ఓహోహో, ఎన్నికాగితాలు, ఎన్నిపుస్తకాలు. అన్నీ తన చేతితో చెక్కిన అక్షరాలతో నింపినవే. అక్షరం-ఎంత చక్కటిమాట! నాశనం లేని దట-ఆ అక్షరాలను సమకూర్చిన మానవుడో-అతని మేధాశక్తో?-ఏది అక్షరమూ, క్షరమూ?

ఆలోచన సాంతం కాకుండానే, డైరీ తీసి, అందులో ఆరోజు కాగితం తీసి, 'అంతిమదినం' అని కుదురుగా వ్రాసి, తీరుగా సంతకంచేసి, పుస్తకం మూసి టేబిలుమీద ఉంచేసేడు. మళ్ళీ ఆలోచించి, పుస్తకం తెరిచి, తానప్పుడు వ్రాసినది ప్రస్ఫుటంగా కనబడేట్లు ఉంచి, వేరే కాగితంమీద ఉత్తరం వ్రాయటం ఆరంభించేడు. ఉత్తరం వ్రాయబోతూఉండగా, వేళ్లు వణకడానికి అతడు నవ్వుకొని, తనకు తానే ధైర్యం చెప్పుకొన్నాడు. అతడు ఎంత యత్నించినా, అక్షరాలు కొక్కిరిబిక్కిరిగానే తయారయేయి.

"సువర్ణా!

జగత్తులో ఎన్నెన్నో విపరీతాలు జరుగుతూ ఉంటాయి. వాటిలో ఒకదానిని మనము ఎదుర్కోవలసివచ్చింది.

నేనే ఏవిషయంలోనూ, ఏమాత్రమూ ప్రయోజకుణ్ణి కాలేకపోయేను.

ఉత్సాహస్వరూపిణి వయిన నీవల్లకూడా నన్ను అంటిపెట్టుకొని ఉండే నిరుత్సాహపుముద్రలు తొలగలేదంటే, నన్ను ఆనందపరచడమన్నది లోకంలోని ఇతరుల కెవ్వరికీ సాధ్యముకా దనుకుంటాను.

అన్ని విషయాలలోనూ, నీవు నా కిచ్చినదాంట్లో వెయ్యోవంతుకూడా, నీకు నేను ఇవ్వలేకపోయేను. ఈజన్మలో మరి ఇవ్వలేనకూడా. తరువాతి సంగతేమిటో?

నువ్వు ఈదుర్బలుణ్ణి ఎంతత్వరగా మరిచిపోగలిగితే అంతఎక్కువగా ఆనందాన్ని సాధించగలవు.

ఏమి చేతనయినా, ఏమి చేతకాకపోయినా సర్వదా తన తృప్తితోపాటు నీఆనందాన్ని వాంఛించే-

హితుడు, సుందరం."

ఉత్తరం గాలికెగిరిపోకుండా, డైరీక్రింద ఉంచి, మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు. ఎట్టఎదురుగా విషపాత్రతో పెదవులకు విందుచేసే సోక్రటిస్ మహాశయుడు సాక్షాత్కరించేడు. సోక్రటిస్ వేత్త అంటున్నాడు-"మనం మనమన మార్గాల ననుసరిస్తాం. మీరు బ్రతుకుబాటను, నేను మృత్యుపథాన్ని. కాని, వీటిల్లో ఏది మేలైనదో భగవంతుడికే తెలియాలి."అని.

సుందరంధైర్యం ఇనుమడించింది.

ఏది మేలో ఎవరికి తెలుసును-అది మంచిది కాదని ఎన్నడూ చూడకుండానే ఎల్లా నిర్ధారణచెయ్యడం? అతడు సీసాను పెదవుల సమీపానికి తీసుకొనివచ్చి, "ఛ!ఇది బహు కళావ్యతిరేకమయిన పద్ధతి" అనుకొని, లేచి, వెండిగిన్నెలోని పాలలో సీసాలోని ద్రవం నాలుగుచుక్కలు వేసి, స్టూలు నడుమను గిన్నె ఉంచి మళ్ళీ పచారుచేయడం మొదలుపెట్టేడు.

గడియారం ధీమాగా పదకొండున్నర కొట్టింది. ఇక నొక్క అరగంటమాత్రమే వ్యవధి. మహాఅయితే ఒక గంటమాత్రమే, ఈలోపునే సర్వం అయిపోవాలి. హుం, అయిపోవడానికి ఎంతసేపు, కొద్దిక్షణాలు... అంతే.—

నిబ్బరంగా వెళ్లి పడకకుర్చీలో కూర్చొని స్టూలు దగ్గరకు లాగి, గిన్నె అంద మీద ఉంచి, వెనక్కివడము వాల్చేడు. మళ్లీ సోక్రటీస్ మహాశయుడు ఎట్టఎదురుగా ప్రత్యక్షమయేడు. ఏమిటోకదా ఈ సన్నిహితత్వం — రెండువేల సంవత్సరాల దూరం ఉంది జీవితపథంలో తమ ఇద్దరినడుమనూ. ఈ

సుమూరాన్ని అధిగమించిన సాదృశ్య మేమిటో? కేవలం విషపాత్రికేనా-ఇంకా ఏమైనా సాదృశ్యముందా? అతడికి—ఏవేవో ఆదర్శాలకోసం, ఆశయాలకోసం పశుబలాన్ని, హింసాశక్తులను ఎదుర్కొంటున్నా నన్న తృప్తిఅయినా అతడి కుంది. తన కేమితృప్తి—కేవలం జగత్తును, దాని దుర్భరవాస్తవికతను భరించలేక. అంతే కాదు. స్వశక్తి పూజ్యముకాగా, ఇతరులమీద ఆధార పడడం ఇష్టంలేక.

తన నిశ్చయానికీ, ప్రయత్నానికీ విరుద్ధంగా, యోచిస్తున్నందుకు అతనికి తన మనస్సుమీద ఆగ్రహం విపరీతంగా కలిగింది—అంతలోనే నవ్వుకొన్నాడు, గడియకో, క్షణానికో ఎన్నటికీ ఏమీ ఆలోచించ బోవని స్థితిని సమీపించబోతూకూడా ఇంకా ఏమేమో లౌకికబంధాలను గూర్చి ఆలోచించటం ఎందుకు?

ఇక కొద్దిక్షణాల్లో ఏమవుతుంది? ఏమీ కాదు-బల్లమీది పాత్ర తన పెదవులనూ, రసననూ స్పృశిస్తుంది.-అంతే. తరవాత ఏమో, అగమ్యగోచరం—కాదు కాదు, కొంతయినా ఊహించవచ్చును. మరొక్క గంటలో సువర్ణ సోల్లాసంగా వస్తుంది.—మొదట్లో ఆశ్చర్యపోతుంది-విచారిస్తుంది; తరవాత పశ్చాత్తాపపడుతుంది. పశ్చాత్తాపమా, ఎందుకో? ఆమె ఏమయినా తప్పుపని చేసిందా? లేదు నిజమే, లేదు నిజమే-అయితే ఆమె కెందుకీ శిక్ష?

ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా ఆమె తనను హింసిస్తూనేఉంది. ఇది బహుశః ఆమెకు తెలియకపోవచ్చును. ఆమెకేకాక, ప్రపంచంలో చాలామంది హింసించేవాళ్లకు హింసింపబడేవాళ్ల పరిస్థితి అర్థంకాదు. అర్థంచేసుకొనికూడా హింసించగల మనోదార్ఢ్యమూ గలవాళ్లు బహుకొద్దిమందే.

తాను చచ్చిపోతే ఆమెకు పశ్చాత్తాపం ఎందుకు? అధమం-విచారమయినా ఎందుకు కలగాలి?

ఆమె సామాన్యంగా అందరితోపాటు, తన చర్యను, స్వభావాన్ని ఖండఖండాలుగా విభాగించి విమర్శించవచ్చును.

ఆమె తప్పే మరొకరిని—మరొకరిదాకా ఎందుకు, ఇటీవల పద్మ జబ్బుమనిషిగా తయారయిందికదూ, చెల్లెలికి ఉపచరించినట్టూ ఉంటుంది; బావ ఆనందానికి లోటులేకుండానూ ఉంటుంది. వసంతాన్నే వరించవచ్చును—నిరాటంకంగా, నిర్విచారంగా, నిశ్శంకంగా—

ఛ! సువర్ణలో అట్టి తలపు ఉందనుకోవడమా? తాను మరీమరీ బలవంతంచేసి వెళ్లమంటేనే వెళ్లింది. అయినా—

అతిప్రయత్నంమీద మనోవిహంగాన్ని ఎగరకుండా నిబంధించుకొని, కుర్చీలో ముందుకు వంగి, గది అంతా కలయజూచేడు. ఓహో, ఎన్ని పరిచితమయిన వస్తువులు-ఎన్నిఎన్నిరకాల రోజులూ అనుభవాలున్నూ! ఇవన్నీ ఏమవుతాయో—అతనికేమో అసంతృప్తిగాతోచి, లేచి వెళ్లి కిటికీతలుపు తెరిచేడు. శుక్లద్వాదశి చంద్రమఃఖండము కాంతితరంగాలతో రోదసిలో ఎక్కడా అంతరంలేకుండా చేస్తున్నది. క్రింద తోటలోని మల్లికాసుమపరిమళముతో మిళితమయిన నవ్వుతావి అతని ఘ్రాణేంద్రియానికి కితకితలు పెట్టింది. అతడు మళ్లీ నవ్వుకొన్నాడు-ఈ ఇంద్రియములను ఇప్పటికీ ఈ లౌకికవాసనలు విడిచిపెట్టవేమూ అని.

తల పైకెత్తి చూసేడు-ఎదురుగా చంద్రబింబమూ, తారాగణమున్నూ. తాను ప్రవేశించబోయే ఆ లోకంలో చంద్రబింబం ఉంటుందో, ఉండదో. ఈ నక్షత్రాలు ఇవి ఇలా ఎంతకాలమునుండి ఈ అనంతమయిన పర్యటనాన్ని సాగిస్తున్నాయో!-ఆ నక్షత్రాల కొలతలలో చూసినప్పుడు తనవంటి ఎన్నెన్నో కోట్లమందికి ఆశ్రయభూతమయిన ధరాగోళమే అణుమాత్రమయినా కాదే-ఇక తాననగా ఎంత? తనలోనే ఇన్ని కొనసాగని కోరికలూ, అందబోవని ఆశలూ ఉంటూఉంటే ఆ ఊహించలేనంతటి పెద్ద గోళాలలోనో? తనలో ఉన్న ఈ చైతన్యము వాటిలో లేక, ఏదోవాటిశక్తికి అతీతమయిన క్రమాన్ని అనుసరించి పరిభ్రమిస్తున్నాయా? తన చైతన్యస్రోతస్వినికిమాత్రం బలీయమయిన ఒక క్రమమూ, నియమతత్వం ఉండవా?

కొంతసేపటికి అతని మనస్సు ఏమీ ఆలోచించటం మానివేసింది. ఎట్టఎదురుగా ఏమి చూస్తున్నాడో కూడా స్ఫుటంగా గోచరించటం లేదు—అలా ఉండగానే గడియారం గంటలు కొట్టటం మొదలుపెట్టింది.—పన్నెండు. సరిగా రయిలు వచ్చే వేళ. ఇకను మరొక అరగంటలోపున వాళ్లు వచ్చేస్తారు-వచ్చేలోపునే సర్వం సమాప్తమయిపోవాలి. మనుష్యులను చూస్తూఉంటే బేలతనం మరీ ఎక్కువవుతుంది. నిశ్చయాలు సన్నగిల్లిపోతాయి.

తొందరగా మళ్లీ వెళ్లి కుర్చీలో కూలబడ్డాడు.

గిన్నె ఎత్తిపట్టుకొని, ఎలాగా తాగేస్తున్నాను కదా, మరిరెండు నిమిషాలు ఆలోచిస్తేనేమి అనుకొని, గిన్నె స్టూలుమీద ఉంచి, కుర్చీలో వెనక్కి చేరబడి గట్టిగా కళ్లు మూసుకొన్నాడు.

కొన్ని సంవత్సరాలక్రిందటి సంఘటన - ఆవేళా ఇటువంటి వెన్నెలరాత్రే. ఒంటరిగా ఏటివంకకు వెళ్లుతున్న అరుంధతిని చూడగానే ఏమో అనుమానం కలిగింది. తన అనుమానం నిజమే-ఆనాడు ఆమెను సంరక్షించటంలో తానుపదేశించిన ధైర్యసాహసాలు ఆమెకే కాదు-తనకీ ఎంతో ఉపకరించేయి. అప్పట్లో తానూ ఆ స్థితిలోనే ఉండేవాడు. ఆనాడు ఆమెకు తాను జీవించటంలో ఉండే పరమార్థాన్ని గూర్చి ఎంతగానో బోధపరిచేడు. ఈనాడు తనకు అల్లా నచ్చజెప్పేవారు, బోధపరిచేవారు ఎవరూ లేరే? తనకు ఒకరు బోధపరచవలసిన అవసరం ఏముంది-తాను స్వయంగా ఆలోచించలేడా? తనవల్ల ఏమీ ప్రయోజనం లేదని నిశ్చయించుకొన్న వెనుక నేకదా-ఆఁ, ప్రయోజనం లేకేమి-తానొక సచేతనుడయిన మానవుడయి ఉండికూడా—తానేమీ అశక్తుడు కాడే. అంగహీనుడు కాడే. తాను తనకోసమూ, ఇతరులకోసమూ చేయవలసిన పనులు ప్రపంచంలో లేనే లేవా? ఒకవేళ తాను సువర్ణను ఆనందింపజేయలేకపోవచ్చును; కాని, ఇందువల్లమాత్రం ఆమె ప్రస్తుతం కంటే ఎక్కువగా ఆనందించగలదా? పోనీ, ప్రపంచం అంతటికీ ఆమె ఒక్కతే కాదే—ఇంకా, తన అవసరం ఉన్న, తన సహాయం పొందదగిన వ్యక్తులే లేరా?

అతని ఆలోచన ఎక్కువసేపు పట్టలేదు- నిండుగా గాలికొట్టిన రబ్బరు బంతిలా కుర్చీలోనుండి త్రుళ్లేడు అంత పొడవుమనిషిన్నీ.

డైరీ మార్చి మళ్లీ రాద్దామని చూసేడు. కాని, అంతటి ఆలస్యాన్ని భరించేట్టు లేదు అప్పటిస్థితి—పన్నెండూ ఇరవై-టిక్ టిక్ టిక్-అతిత్వరగా సంచలిస్తూంది కాలచక్రము.

దిగువామీదకు డైరీ విసరి, గబగబ మేడదిగి పరుగెత్తేడు షెడ్డులోనికి. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా సైకిలు తీయని తాను సైకిలు తొక్కగలడా అన్న సందేహాశకలం అతని మనస్సులో మెరిసి, అతన్ని నవ్వించింది.

ఇంటర్మీడియేట్ చదివే రోజుల్లో సైకిలు పందేలలోకూడా అతనంత తొందరగా తొక్కలేదు.

ఊరుదాటినతర్వాత మూడుమైళ్ళకు అసలు రోడ్డులో దారికలుస్తుంది. ఈలోపున కారును ఎదుర్కొనక్కరలేకపోతే చాలును, తరువాత ఎంత మేరయినా నిర్విచారంగా సాగిపోవచ్చును.

దూరంగా కారుధ్వని వినిపించింది, అంత తొందరలోనూ అతని చెవులకు. సైకిలుదిగి, ప్రక్కనున్న చెట్లచాటుకి వెళ్లిపోతేనో అనుకున్నాడు. వెంటనే, 'ఛ! అంత భయమెందుకు? నా ఇష్టం వచ్చినట్టు నేను వెళ్లిపోతాను. ఒకరి ఇష్టాయిష్టాలతో నాకేమి ప్రసక్తి? నన్ను అడిగేవాళ్ళూ, అడ్డేవాళ్ళూ ఎవరున్నారు?'

కారు అడ్డుదారికి తిరగలేదు. తిన్నగా రోడ్డంట పరుగెత్తిపోయింది. అనుకోకుండానే అతని గమనం మందమయింది.

అతడు కొద్దిగజాలలో మలుపుతిరుగుతూ ఉండగా, మళ్ళీ మంద్రమయిన ధ్వని వినిపించింది. ధ్వనిమాత్రమే కాదు, దూరాన వెలుగు తళుక్కుమంది. ఈమారు సందేహం లేదు. కారువెలుగువల్లనే అతడికి తెలిసిపోయింది. మలుపుతిరిగి కొద్దిదూరంలో ఉన్న కానా గట్టుమీద ఆనుకొని వెనుక తిరిగిచూసేడు. కారు

# కీటక నాశనమునకు




డిడిటీని ప్రవేశ పెట్టుటకు మూల పురుషుడగు జె. ఆర్. గాయిగి చెప్పినవిధముగా యీ కీటక నాశని అసలైన డిడిటితో తయారుచేయబడినది. దీనిని గృహములలో వుపయోగించినచో బొద్దంకులు, యీగలు, చీమలు, దోమలు, పురుగులు మొదలగునవి చేరవు. వాడుటకు నూటికి 10 వంతులు డిడిటి కలిసిన న్యూసిడ్ పౌడరు 2 ఔన్సుల.టిన్‌లలోను, ½ పౌను, 1 పౌను, 28 పౌనుల డబ్బాలలోను లభించును. పాఠశాలలకు మరియు ఆస్పత్రులకు ప్రత్యేకముగా 28 పౌనుల డబ్బాలు తయారు చేయబడినది.

## DDT Geigy DDT

ముఖ్యముగా వంటశాలలలోను, బిల్డింగులోని గదులన్నింటి యందును జాగ్రత్తగా చల్లినయెడల న్యూసిడ్ పౌడరు బాగా పనిచేయును. చల్లినపిదప 3, 4 రోజులవరకును పౌడరును అట్లే యుంచవలయును. అకస్మాత్తు తుడిచినచో పౌడరును తిరిగి వాడవలెను. న్యూసిడ్ పౌడరు పురుగులను తప్పకుండా నాశనము చేయును. కాని మెల్లిగా పని చేసి శాశ్వతముగా కీటకములను తిరిగి పుట్టకుండా చేయును. అందువలన తొందరపడి న్యూసిడ్ పౌడరు మంచిది గాదని భావించకుడు. కొద్ది రోజులలో దీని ఫలితములు మీకే స్పష్టమగును.

# న్యూసిడ్
## వాడుడు మరియు
## సక్రమముగా ఉపయోగించుడు!

గాయగి ఇన్సెక్టిసైడ్స్
లిమిటెడ్




సెవిల్లె హౌస్, నికల్ రోడ్,
బొంబాయి

DJK. 5314 TEL.

మైసూరు స్టేటు, దత్తమండలాలకు డిస్ట్రిబ్యూటర్లు : మెసర్సు మహమ్మద్ రహిం ఖలీలి,
99 బి. ఉస్మాంజాఖా రోడు, బెంగుళూరు సిటీ.

దక్షిణ యిండియాలో డిస్ట్రిబ్యూటర్సు : మెసర్సు ఆడినగా అండ్ కో., లిమిటెడ్, మౌంట్ రోడ్, మద్రాసు.

నిండుగానే ఉన్నట్టుంది-కారు చెట్లవరుసల్లో మాటు పడినవెంటనే, మళ్ళీ, తన అంతులేని, అవధిలేని ప్రయాణాన్ని సాగించేడు సోత్సాహంగా, ఏమో సాధించ గలిగేనన్న ధీమాతో.

ఇలా తాను ఎక్కడికి వెళ్తాడు, ఏం చేస్తాడు? ఎక్కడికయినా వెళ్ళగలడు-ఏమయినా చెయ్యగలడు. మానవుని మేధాశక్తికీ, ప్రయత్నప్రాబల్యానికీ అతీత మయిన దేముంది? అరగంటక్రిందట మరి ఈ లోకంలో లేడు అనుకున్న మనిషికి ఎంతటి అవకాశం-ఓహోహో ఏమి అదృష్టము-కేవలం తనకేకాదు, తాను లోకంలోని ఎందరోమందికంటె మానసికంగా, శారీరకంగా చాలా సదుపాయములు కల పరిస్థితిలో ఉన్నాడు.

"ఈనాడు లేడు అనుకొన్న ఈ జీవి రేపు ఎందరికి ఎన్నివిధాల ఉపయోగించగలడో?" అతని మనస్సు పదేపదే అదేవిషయాన్ని ఒకింత మాటల భేదంతో ఆలోచించసాగింది — ఆ ఆలోచనతోపాటు ఉత్సాహముకూడా ఎక్కువయింది. ఉత్సాహముతో పాటు వేగముకూడా ఎక్కువయింది.

ఈసరికి కారు ఇంటికి వెళ్లిఉంటుంది. డ్రైవరు వెంకట్రావు దారిలోనే చెప్పిఉంటాడు. తాను ఏడు గంటలకే స్టేషనుకి వెళ్లి సిద్ధంగా ఉండాలని చెప్పినట్టు. తాను ఇంట్లో లేకపోతే సువర్ణ ఏమనుకుంటుందో-ఏమి చేస్తుందో-పాపం తనగురించి ఎంతగా బాధపడు తూంటదో—అతని మనస్సులో మెరుపులా మెరిసింది. స్టూలు మీది పాలు - కాదు, కాదు, విషం-అలానే ఉండి పోయింది. సీసాకూడా టేబిలుమీదే ఉండిఉంటుంది. ఆఁఆఁ, ఎంతఘోరము!

ఈ జ్ఞాపకంతో హఠాత్తుగా వెనకతిరిగి ఇనుమడించిన వేగంతో తొక్కడం మొదలుపెట్టేడు. ఎలా గయినా సువర్ణను సంరక్షించాలి—ఆనాడు తాను అరుంధతిని కాపాడగలిగేడు—ఈనాడు సువర్ణను, ఆమె తనదయినా కాకపోయినా, సంరక్షించాలి—ఏమో, అదృష్టం ఉందోలేదో.

తోటప్రక్కనుండి రావడంలో, తిరుగుడువద్ద సైకిలు దారిప్రక్కనున్న గుంటలోనికి దిగిపోయింది. దెబ్బతగిలిందో లేదో చూసుకొనే ఓపికకూడా అతనికి లేకపోయింది. చెక్కుకొనిపోయిన మెడుకులతో, బట్టలనిండా క్రుళ్ళిన బురదతోనే, అప్పటిదెబ్బతో అడుగడుక్కీ నడవనని మొరిపెడుతున్న సైకిలును కేవలం ఆత్మశక్తివల్ల నడిపిస్తూ అతను ఇంటికి చేరుకున్నాడు.

దారిలో ఎవ్వరి పలకరింపులూ, మాటలూ, ఏవీ వినిపించుకోకుండా పరుగెత్తి మెట్లెక్కి గది గుమ్మంలో నిలబడిచూసేడు. అనుకోడానికికూడా భయ పడినంత పని అయిపోయింది. ఒకగంటక్రిందట తాను కుర్చీలో కూర్చొనిఉన్నట్టే... కాదుకాదు, అప్పుడు తాను పూర్తిగా తెలివిగా కూర్చున్నాడు. టేబిలుమీది సీసా స్టూలుమీద ఉంది. గిన్నెలో ఏమీ కనబడలేదు. ఇన్ని సంగతులూ అతని మనస్సు జ్ఞానవంతమై గ్రహించిందని కాదు-ఏదో అస్ఫుటమయిన ధోరణిని ఎవరో కలలో చెప్పినట్లుగా తోచింది.

అతనికి తానెన్నడయినా గట్టిగా అరచి ఏడవ గలనా అని అనుమానం ఉండేది.

'సువర్ణా' అని గట్టిగా కేక వేసి నేలను పడి పోయేడు. ఆ కేకలో, మంద్రతారస్థాయిలను రెంటినీ అందుకొంది అతని గొంతు.

కారు రావడమే తడవుగా సువర్ణ మేడమీదకు వెళ్ళిపోయి, మరి క్రిందకు రాకపోవడంతో రెండు మూడు రోజులనుండి సరిగా నిద్రలేకపోవడంవల్ల నిద్ర పోయిందేమో అనుకొన్నారు పద్మా, వసంతమూను. అసలు సుందరం అంత రభసంగా వచ్చేవరకూ అతను ఇంట్లో లేని సంగతే వారికి తెలీదు.

సుందరంఆగమనంతోనే కలవరపడిఉన్న వసంతం, మేడమీదనుండి సాతురమయిన సుందరం కేక వినబడగానే, ఒక్క దూకులో వచ్చేడు మేడ మీదికి. అడుగు తీసి అడుగుపెట్టడానికికూడా శక్తిలేక పోయినా, ఎల్లాగో గారిసాయంతో మెట్లెక్కివచ్చింది పద్మ.

క్షణంలో నౌఖర్లందరూ గుమికూడేరు. వసంతం వాళ్ళనందరనూ అవతలకు పంపి, సుందరాన్ని కదిపేడు, పరిస్థితి ఏమో అర్థంకాక. ఎలాగో దుఃఖపు

తెరలను తెమల్చుకొని, "ఆత్మహత్య చేసుకోవాలను కొన్న పిరికిపందను. నేను మానవుణ్ణి కాగోరి, పారి పోయేను ఇక్కడనుండి. మానవుణ్ణి కాగోరి రాక్షసుణ్ణ యేను. ఇంతకంటే హత్యచెయ్యడమంటే వేరే ఏముం టుంది?" అంటూ నేలకు ఒరిగిపోయేడు. అతడి తలను జాలిగా, దుర్బలంగా పట్టుకొంది పద్మ.

'అయితే, ఎలా చనిపోయిందంటారు?' అన్నాడు వసంతం కొంచెం కటువుగా.

'ఎలాగా, మహారాజులాగ. విషం తాగి చచ్చి పోయింది; పొటాసియమ్ సైనేడు తాగి చచ్చిపోయింది. అదుగో టేబిలుమీద సీసా' అని తలను నేలకు వేసి కొట్టుకోబోయేడు. పద్మకు ఎక్కడలేని శక్తి వచ్చింది అతని తలను పట్టుకుందికి.

ఒక్క అయిదునిమిషాలు ఏమీ మాట్లాడ కుండా సువర్ణను పరీక్షించి, మెల్లగా, పద్మతో 'బతికేఉం'దన్నాడు వసంతం, సగంమాటను సైగలతోనే తెలుపుతుచేస్తూ. అతను వారిస్తున్నా వినిపించుకో కుండా, పద్మ 'బ్రతికేఉందిట, బావా, అక్కయ్య' అంది సుందరం చెవులో.

ఆమాట వినడంవల్ల అతనిలో కలిగిన కలవర పాటు వర్ణనాతీతము.

చివరకి వసంతం—'ఎంతమాత్రమూ ఇది పొటాసి యమ్ సైనేడుకాదు, బహుశః బ్రోమైడయి ఉంటుంది. ఈమధ్యవల్లా సరిగా నిద్రలేకపోవడానికి తోడు ఇది తాగడంవల్ల మరీ బలంగా నిద్రవచ్చేసింది. అంతే— ఆమె మామూలుగానే ఉంది; హాయిగా ఊపిరి తీస్తున్నది; మీ రెలా భయపడ్డారో నాకేమీ అర్థం కాకుండాఉంది' అన్నాడు.

అవసరం లేదని తెలుస్తూఉన్నా కూడా డాక్టరుకోసం పట్నం కారు పంపించేరు సుందరం, వసంతం కలిసి.

ఆ తరువాత ఒంటరిగా దొరికిన మొట్టమొదటి సావకాశాన్ని అతడు వినియోగించుకోకపోలేదు— "సువర్ణా, అయితే నిన్నటి నా చర్యను బట్టి పిరికిపంద నంటావా, లేక రాక్షసుణ్ణంటావా ?"

"ఏమీ అనకూడదు-అన్నీ కలిసే ఉంటాయి మానవస్వభావంలో. కొన్నికొన్ని సమయాల్లో కొన్ని కొన్ని బైటపడుతూఉంటాయి—అయితే శరీరాలను కడుక్కుందుకి నీళ్లలాగ అవసరమో, మనస్సులను ఝాళ నము చెయ్యడానికి కన్నీళ్లూ అంత అవసరమే" అంటూ ఆమె మరి మాటలకు ఎడం లేనంతగా అతణ్ణి దగ్గరకు తీసుకొంది.

'మళ్ళీ మన మిద్దరమూ కొత్త జన్మ మెత్తేము గనక మనలెక్కలు మళ్ళీ ఈనాటినుండి మొదలు' అంటూ ఆమెను బలంగా ముద్దుపెట్టుకొన్నాడు, మానవుడయిన సుందరం.






# నా భూలోకయాత్ర



కాలధర్మము పాలై ప్రేతపురి చేరుకొని, కొన్నాళ్ళచటనే ఉండి, ఒకనాడు (క్రీ. శ. ౨౦౮౯లో) మమతకొద్ది భూలోకమునకు వచ్చి చూడగా కన్పించబోవు భూలోక దృశ్యముల ఊహాకల్పన ఇది. విజ్ఞాన మభివృద్ధియగు కొలది ప్రజల జీవనము ఏ విధముగా మారిపోవునో, విజ్ఞాన మేరీతిని నిత్యజీవితములో భాగముగా పరిణమించునో తెలుపుట దీని ఉద్దేశ్యము.

అధోలోకములో చిరకాలమునుండి చేయుచున్న జీవనమునందు నాకు విసుగెత్తినది. కొద్దిరోజులయినను పూర్వపు నివాసస్థానమగు భూలోకమును దర్శించి రాదలచితిని. నేను భూమిపై ఉండినపుడు, నాలుగైదు పౌన్నుల బ్రెజిలుబియ్యము వండిన వచ్చు రబ్బరు వంటి జిగటపదార్థమును తినుట కలవాటు చేసుకొని బ్రతికిచుంటిని (అప్పుడు బ్రెజిలులో పండిన రబ్బరు కొనువారు లేకపోవుటచేత వారు దానిని బియ్యపు గింజలవలె మార్చివేసి భారతదేశమున కెగుమతిచేసి రని వదంతి. భారతీయులు దానికే చాల తృప్తిపొందిరి. గడ్డికన్న బియ్యమన్న పేరు గలదే తినుట మేలని తలచిరి కాబోలు !). గ్రామస్వయంపోషకత్వము లేదను పేర గుడ్డలకే కరవై పోవుటచేత చలికాలములో అప్పుడు మేము పడుచుండిన అవస్థ చెప్ప నలవిగాదు. అక్కడ అధోలోకములో మాకు అట్టిబాధ లేవీ లేవు.

భూమికి పోయిరావలయు నను ఆలోచనతో పిచ్చెత్తినట్లు అధోలోకములో తిరుగాడుచుంటిని. ఒక చోట నిరువురు మనుష్యులు దేనినోగూర్చి ఉద్రేకముతో చర్చించుచుండిరి. వారిని సమీపించగా వారిరువురును మహాశాస్త్రివేత్తలగు న్యూటను, ఐన్‌స్టీనులు. (ఐన్‌స్టీను మా సమకాలికుడు. అతడు తన సాపేక్షత్వ సిద్ధాంతముతో ప్రపంచమున కేమి జరిగినదో తెలియకముందే న్యూటనుయొక్క ఆకర్షణసిద్ధాంతమును ఒక్క దెబ్బతో పేరు ఊరు లేకుండ రూపుమాపి అమరకీర్తి గడించినాడు. అధోలోక మెన్నేళ్లక్రితమో చేరియున్నను అతడి పేరు భూమిపై తెలియనివా రుండరు. ఈ సాపేక్షత్వవాదము చూచి వేదాంతు లందరు విజ్ఞానము వేదాంతములో కలిసిపోయినదని డంబములు మొదలుపెట్టిరి) పాపము ! ఐన్‌స్టీను ఎన్నివిధములుగా తన సాపేక్షత్వవాదము న్యూటనుబుర్రలో నెక్కింప ప్రయత్నించినను ఆ ముసలివాడు తాను బట్టిన కుందేటికి మూడే కాళ్లని వితండవాదము గావించుచుండుట నాకు తలనొప్పి గలిగించినది. వెంటనే, బెదరిపోయిన పసువువలె అటునుండి వెడలి, ఇంకొక ప్రదేశము సమీపింపగా అచట చేంబర్లయిను మహాశయుడు ఖిన్నుడై ఊరక కూర్చునియుండెను. పాపము ! ఆయన

ఎంత బ్రతిమాలుకొన్నను ఈ ప్రేతపురికి అతని ప్రియమైన గొడుగును తీసికొనిరా ననుమతించినవారు కారు. దీనికి తోడుగా అతని జన్మశత్రువైన హిట్లరు అతని వెంటనే అంత త్వరలోనే అధోలోకము చేరియుండుట అతని మనమును కలతనొందించుచుండెను. అక్కడికి కొద్దిదూరములోనే ఒక లావుమనిషి ఠీవిగా కూర్చొనియుండెను. అతడు రెప్పవాల్చక ఒక బక్కచిక్కిన చేతిమీద స్వస్తికచిహ్నము గలిగిన చింపిరితల మనిషిని కని పెట్టుచుండెను. ఈ హిట్లరు అధోలోకమునుగూడ జయింప సనుకట్టినాడట. ఈ ముగ్గురిని చూచినతర్వాత మా ఈ ప్రేతనగరమునుండి రజా పుచ్చుకోవలయు ననే అభిలాష మెండయినది.

## పెట్రోలుకు స్వస్తి:

అందువలన ఎవ్వరికిని తెలియకనే జారుకొని... ...'ఢఫ్' మని భూమిపై కాలిడితిని. అదేదో గొప్ప నగరము. కాని నాకాలపు నగరములవలెగాక ప్రశాంతముగా నుండెను. మాకాలములో న్యూయార్కునే నగరములో మింటినితాకే కట్టడములు (Sky-scrapers) ఉండేవి. కాని ఇక్కడి విస్మయకరములయిన మహా కట్టడముల ముందు ఆ న్యూయార్కుకట్టడములు మింటినిగాదు, మట్టిని తాకుచున్నట్లుండు ననిపించినది. కాని ఇక్కడ ధూళిగాని, మట్టిగాని ఎక్కడను కనిపించలేదు! మేడలపైకి, క్రిందికి ఏవో కొన్ని గొట్టములు కదలుట చూచితిని. పరిశీలింపగా అవి మేడ అంతస్తులు చేరుటకును, వాటినుండి దిగుటకును ఏర్పడిన సూచీముఖక్షేపణీత (Jet-propelled) వాహనము లని తెలిసికొంటిని. అట్లే వీథిలో నిలబడి ఆ దృశ్యములను చూచుచు విస్మితుడనైయుంటిని. పట్టీల '(Plastics) తో నిర్మితములయిన పెద్దపెద్ద యంత్రము లేమాత్రము సద్దులేక భ్రాంతిగలిగించు వేగములతో నాప్రక్కనుండి పరుగిడుచుండెను. ఒక మోటారుకారు ఒక గారేజి వంటి ఇంటిముందాగినది. ఒకడు బయటకు వచ్చి కారువెనుక ఒక డబ్బాలోని ద్రవము (పెట్రోలు కాబోలు!) కుమ్మరించెను. కాని సమీపించిచూడగా డబ్బాపైన "ద్రవవాయువు— మోటారు ఇంధనము (Liquid air motar fuel)" అని వ్రాయబడియుండెను. మా కాలములో మోటారులకు పెట్రోలు వాడుచుండిరి. పెట్రోలయిపోయినచో మద్యసారము (Alcohol) వాడెదమనుచుండిరి. కాని ప్రపంచములోని పెట్రోలు, మద్యసారములు నిల్వ లయిపోయినవి కాబోలు, శాస్త్రజ్ఞులు గాలిని ద్రవముగా మార్చియుండుటచేత జనులు ద్రవవాయువునే ఇంధనముగా వాడ మొదలిడిరి. ఆ గారేజీమనిషి మోటారుడ్రైవరుకు "సారుడా! నీ కారుకు వేయిమైళ్ళ ప్రయాణమునకు చాలినంత ఇంధన మిప్పుడున్నది" అని చెప్పుచుండెను. ఈ మనుష్యులు ఎట్టి అతిశయములగు శక్తి యాత్రియములను కలిగియుండిరో అప్పుడు తెలిసికొంటిని.

## గాజుడుపులు :

అప్పుడే ఎవరో ఇద్దరు విలాసవనితలు వయ్యారముగా అటు పోవుచుండిరి. వారు గాజుడుపులను ధరించియుండిరి. రస్తాలో వారికొక శృంగారశాల (Beauty Parlour) అగపడగా, ఇరువురిలో చిన్నయువతి అందు ప్రవేశించి అద్దములోనికి తొంగి చూచెను. వెంటనే కిరణవిద్యుద్ఘటము (Photo-Electric cell) ఒకటి కాంతిని ప్రసరింపజేసి ఆ వనిత ముఖపు తీరునంతను స్పష్టము చూపెట్టెను. ఇంద్రజాలమువలె మరుక్షణమే మరొకఘటము ఆ ముఖమును అంగరాగములతో సర్వసుందరముగా తీర్చి తిలకము పెట్టెను. లోనుండి సన్నని గొంతుక ఒకటి "బాలికలారా! ఇక సెలవు" అని చెప్పినది. తర్వాత వారిరువురును మరల రస్తాపై బడి వెళ్లిపోయిరి. వారు పోవుచుండగా వింతయొకటి చూచితిని. వారు చేతితో పట్టుకొనకయున్నను వారి గొడుగులు వారి తలలపైననే రెండు పక్షులవలె వెంబడించిపోవుచుండెను. ఆపడతులు తలలపైని జడముడిలో విద్యుదయస్కాంతములు కలిగియుండిరనియు, వారు నడచుటవలన కలుగు శక్తి నంతయు వినియోగించుకొని పనిచేయుచుండు డైనమోలచే ఆ అయస్కాంతములు పనిచేయుననియు, వారి చెప్పుల అడుగున ఈ డైనమో లమర్చబడియుండుననియు ఊహించితిని. ఈసాధనమున కేవో ఒక చిట్టి యంత్ర మమర్చుటచేత రాత్రివేళలయందు సౌదామినీకణములు (Electric Sparks) వారికి మార్గము కని

పించునట్లు చేయుచుండెను. మా కాలములో కాళి దాసు కావ్యములను చదువునపుడు ఒరపిడిరాతిపై బంగారుతో గీచినట్లుగా సౌదామిని కణములు రాత్రి వేళల సంచరించు వనితలకు దారిచూపుచుండు నని చదివియుంటిని. దానిరహస్య మిప్పుడే నాకు బోధపడినది.

రెండుసేర్ల నీటితో బ్రహ్మాండశక్తి :

భ్రాంతమతినై సంచరించుచు 'సంస్థానసరఫరా సంఘ'మని బోర్డు వేయబడియున్న ఒకభవనము చేరితిని. మానవున కేమేమి అవశ్యకమో అవన్నియు తయారు చేయు కర్మాగారములలో ఇదొకటి. గ్రద్దలవలె క్రిందికి దిగు విమానములనుండి కార్మికులందరు అప్పుడే అరు దెంచుచుండిరి. వారు కర్మాగారమునకు వందలకొలది మైళ్ల దూరములో నుండు ప్రదేశములనుండి వచ్చుచు న్నట్లు కనుగొంటిని. కార్మికులు కర్మాగారమందు కాలిడుచుండగనే వారు వచ్చిన వేళను స్వయంచాలక కిరణవిద్యుద్ఘటి యొకటి వెంటనే గుర్తించినది. ఇంతటి గొప్ప కర్మాగారపు శక్త్యుత్పత్తిగృహ (Power-house) మెట్లుండునో చూడనిచ్చగించి విచారింపగా నన్నొక చిన్నగదిలోనికి గొంపోయిరి. అంత చిన్నగది ఇంత పెద్దకర్మాగారమునకు శక్తి నుత్పత్తిచేయు గృహమా యని సంశయించుచుంటిని. అక్కడ ఒక చిన్న ఇంజను. దాని నిట్లు వ్రాయబడియుండెను: "క్రీ. శ. ౨౦౪౧ సం. ఆగష్టు ౨౧ వ తేదీనాడు యంత్రమున పోయ బడిన రెండుశేర్ల నీటియొక్క ద్రవ్యరాశినుండి లభిం చిన శక్తి". ఆరోజు తేగీ నాకు బాగా జ్ఞాపకమున్నది. క్రీ. శ. ౨౦౪౭ సం॥ మార్చినెల ౭ వ తేదీ.— ఆ ఇంజను ఆరెళ్లనుండి అంత కొంచెపు నీటితో పని చేయుచున్నది! పరమాణుశక్తినిడుదలకు ఐన్‌స్టీను వేసిన సమీకరణము అప్పుడు నాకు జ్ఞప్తికివచ్చినది. ఈ విషయమును తప్పక అధోలోకములోనుండే మరలి ఐన్‌స్టీనుకు తెలిపి న్యూటనును పూర్తిగా జయింప తోడ్పడుదమని తలచితిని.

రోగాలురాసిని మందులు :

ఆ కర్మాగారము బయలుప్రదేశములో ఒక మూల అతిపరిశుభ్రముగా నంచబడిన వైద్యశాలను ప్రవేశించితిని. అక్కడ కర్మాగారపు చుట్టుపట్ల జన్మించిన శిశువుల కౌషధము లీబడుచుండెను. శిశువు జన్మించినవెంటనే అసలు రోగములే సమీపింపకుండ చేయు క్రొత్తమందులు శిశువుదేహములోనికి సూదుల ద్వారా ఎక్కించెదరు. అందుకే ఆ మానవులకు రోగ మన్నదే తెలియదు. వారు వజ్రకాయులు. ఆ నగర ములో ప్రసూతివైద్యశాలలు తప్ప వేరేవైద్యశాలలు లేనేలేవు! రోగులే లేనప్పుడు వైద్యశాల లెందుకు?

భోజనపు గుళికలు :

ఇదేదో విచిత్రభూలోకములో కాలిడినా నను కొనుచు కర్మాగారమునుండి మరల రస్తాపై పో మొద లిడితిని, రస్తా దుమ్ముగాని, మురికిగాని లేక అద్దము వలె నునుపుగా, స్వచ్ఛముగా నున్నది. రస్తామలుపులో ఒక నూరంతస్తుల మేడ పైభాగమున 'భోజనశాల' అను బోర్డు గమనించితిని. ఆ పేరుచూడగానే నాకు ఆకలివేయు సంగతి జ్ఞప్తికివచ్చినది. వెంటనే ఆ భవ నములోని కడుగుపెట్టి ఒక సోఫాపైన కూర్చొంటిని. ఒక పరిచారకుడు చిన్న గిన్నెలో రెండు పచ్చని గుళిగ లేవో తీసికొనివచ్చి నాముందుంచెను. అవి ఒక రోజునకు చాలిన తిండియట. వీరి తిండి ఇదేనేమో అనుకొని వాటిని నోటిలో వేసికొని చప్పరించితిని. బహురుచిగా నుండెను. ఈ జనులకు భూమి గింజ లక్కరలేదు; ఫలము లవసరములేదు వీరి తిండి యంతయు రసాయనపు తిండియే తిండియొక్క రంగు, రుచి, వాసనలే వీరి కవసరము లేదు.

టెలివిషన్ ద్వారా పాఠాలు :

పిమ్మట వారి కళాశాల చూడవెడలితిని. ఒక గదిలో వేదికపై నిల్చుని ఉపాధ్యాయుడు గోడపై వ్రాయుచు ఒక యువకుల సమూహమునకు ఉపన్య సించుచుండెను. ఆగది యొక చలచ్చిత్రప్రదర్శనశాల వలె వేదిక కలిగి మనోహరముగానుండెను. నేను వేదికను సమీపించి చూడగా ఉపాధ్యాయుడు నిజముగా అక్కడ లేడు. ఉపాధ్యాయునివలె అతని ఛాయా చిత్రముమాత్రమే కదలుచుండెను. నిజముగా ఉపా ధ్యాయుడు అక్కడి కెన్నోవందల మైళ్లదూరములో

నన్న టెలివిషన్ స్టూడియోలోనుండి ప్రపంచములోని మరిమూలలలోని అతని విద్యార్థులకు త్రిపరిమాణ (Three-dimensional) టెలివిజన్ ద్వారా ఉపన్యసించుచుండెను ! క్షణక్షణమునకు నశ్యము పీల్చుచు, ముక్కు చీదుచు, మాటిమాటికి 'ఠెంచెక్కు' మనుచు, చేత హడలెత్తించే బెత్తము పట్టుకొని పాఠము చెప్పుచుండిన అయ్యవార్లవద్ద చదువుకొన్న నాకు ఈ కాలపు చదువు ఆశ్చర్యము కలిగించినది. ఆ ఉపన్యాసము నాకు ఏమాత్రమును అర్థముకాలేదు. అదేదో నూతన విజ్ఞానము !

పాఠశాలనుండి చలచ్చిత్రప్రదర్శన శాల (Cinema theatre) కు వెళ్లితిని. దాని సౌందర్యము పరికించి చూచుచుండగా ఒక కంఠధ్వని పెద్దగా "పౌరులారా ! ఇదిగో మన వైజ్ఞానికశిరోమణి సూర్యబింబము గూర్చి చలనచిత్రముద్వారా ఉపన్యసింపబోవుచున్నాడు." అని చెప్పినవెంటనే ప్రదర్శనము మొదలయ్యెను. సభికు లతినిశ్శబ్దముగా వినుచుండిరి. సూర్యబింబమునుండి వెలువడు జ్వాలలు, దానిలోని మచ్చలు, ప్రభలు, గ్రహణము లేవిధముగా కలుగునది — మొదలయిన వన్నియు అత్యద్భుతముగా ప్రదర్శింపబడెను. నేను బ్రతికియుండినపుడు ఇట్టి వైజ్ఞానికచలచ్చిత్రములు లేనేలేవు. ఎంతసేపైనను ఏవో ఒద్దరాడపిల్లలు ఒకనిని ప్రేమించుటవల్ల కలిగే ఘట్టములను ప్రదర్శించే చలచ్చిత్రములే రంగస్థల మాక్రమించియుండినవి.

నిద్రనుపోగొట్టే గుళికలు :

ప్రదర్శనము సాగుచుండగా శాలలోని అందరును— ఆడువారు, మగవారు— చిన్నసీసాలనుండి ఏవో గుళికలు తీసికొని నోట్లో వేసికొనుట చూచి, అవేమో అని విచారించితిని. అవి నిద్రావినాశక గుళికలట. రోజెల్ల దేహము మానసికముగాను, శారీరకముగాను అలసిపోవుటచేత దేహములో విషము లుత్పన్నమయి నిద్రవచ్చునట్లు చేయును. ఈ బలహీనత కలిగించే విషము లన్నింటిని ఈగుళికలు నాశము చేయగలవట. ఈ దివ్యమానవులకు నిద్రపోవ అవసరమే లేదట !

"విజ్ఞానము ఒక్క శతాబ్దములోనే ఎంత ముందుకు సాగిపోయినది ! మానవులు ప్రకృతినే జయించి దివ్యత్వము పొందినట్లున్నదే...మానవాతీతమైన దేమున్నది?" అని ఇట్లు నాలో నేను వితర్కించుకొనుచుండగా..........................హఠాత్తుగ ఉలికిపడి మేల్కొంటిని.

"రాము"



# పంచాయితీలు - గ్రామపరిపాలన

= శ్రీ అజ్జరపు వెంకటరమణారావు =

పంచాయితీలు ప్రజాస్వామిక ప్రభుత్వవిధానానికి పునాదులు. గ్రామ స్వపరిపాలన కనువయిన స్థానిక సంస్థలుగా చిరకాలమునుంచి యివి చాలా పేరు పడినవి. కాని, యీనాడు వీటి పరిపాలనావిధానం ఎంతో అసంతృప్తికరముగా వున్నదన్న విషయం మనం అంతా ఎరుగుదుం. వీటిని బాగు చేయవలసిన అగత్యం వుందనికూడా మనకు తెలుసు. అయితే యిందుకు మనం ఏంచేయాలి? ఏంచేయుగలం? అన్న ప్రశ్నలు వేసుకొనేసరికి మటుకు మనకు సమాధానాలు ఛటుక్కున దొరకవు.

పంచాయితీలు మన దేశంలో అనాది సిద్ధమయిన సంస్థలుగా చెప్పుకోవడం మనకు పరిపాటి. అంతేకాదు. పూర్వకాలంలో అవి చాలా ఉచ్చదశలో వుండేవనే వాదం యింకోమూలనుంచి వినిపిస్తోంటుంది. పూర్వాపరసందర్భాలను సమ్యక్ దృష్టితో పరిశీలించుకొని, నాటికాలంలోని ఉత్తమ సంప్రదాయాలు, ఆదర్శప్రాయమయిన విధానాలూ ఏమయినావుంటే వెతుక్కొని, అవియీనాటికుపకరించుకునేలా ప్రయత్నిద్దామని బయలుదేరితే అది వృథాశ్రమగా పరిణమిస్తుంది. అసలు ఏనాడీ సంస్థలు మొదట అమలులోకివచ్చాయి? ఆనాడు వీటి అధికారాలు ఏమిటి? సభ్యులెంతమంది? వారి సంస్కృతి ఏపాటి? సంస్కారం కలిగిన మనుష్యులు తక్క, తక్కినవారీ పంచాయితీలలో వుండేవారా, లేదా? వారి కార్యక్రమం ఎలాంటిది? కాలాంతరంలో దేశంలో వొచ్చిన రాజకీయ సంక్షోభాలకు, ఆర్థికవిప్లవానికి యీ సంస్థ తట్టుకుంటూ వచ్చిందా, లేక ఆగలేక చచ్చిపోయిందా? ఎన్నాళ్లు బలంగా బతికింది? ఎప్పటినుంచి క్షీణించడం ఆరంభించింది అన్న ప్రశ్నలకు సావధానమయిన సమాధానాలేవీ కనిపించవు. సమగ్రంగా యీ నాటివరకూ, యీ సంస్థ యిలా మారుతూవచ్చింది అని చెప్పగలిగే గ్రంథం ఒకటీ లేదు. ఆధారాలులేవు. అసలావిషయాన్ని ఆమూలాగ్రం పరిశోధించి ప్రస్తావించిన మనుష్యులు లేరు. అయితే, యిక పంచాయితీలు వేదాలకు పూర్వానివి - అథీనియన్ దేశం ప్రజాస్వామ్యం అంటే ఏమిటో వీటి దగ్గరే నేర్చుకొంది - రాజ్యాంగ శాస్త్రంలో, స్థానిక స్వపరిపాలనా విధానాల్లో యితర దేశాలకు మనం పెట్టినది భిక్ష అని చెప్పుకొనే కబుర్లకు అర్థం ఏమిటని ఎవరయినా అడిగితే, అది మనలో జీర్ణించిపోయిన ఒక వైలక్షణ్యం అనేతప్ప యింకో సమాధానం చెప్పుకోలేము. ఇలా అశాస్త్రీయ మయిన నమ్మకాలు మనకు స్వాభావికమయి మనలో వేళ్లతో పాతుకు పోయినాయి. మన మానసిక ప్రవృత్తి యీనాటి పాతపంథానుంచి మారనంతకాలం మనకు మోక్షంలేదు. సాంఘిక సంస్థలు మారి, ప్రజలో నూత్న చైతన్యం విద్యుల్లతలాగే ప్రాకవలసిన రోజులివి. శాస్త్ర పరిశోధకుడి కృషి ఫలించాలంటే, ప్రజ ఆతని పరిశోధనల ఫలితాలను అనుభవంలోనికి తెచ్చుకొని అభివృద్ధి పొందిన నాడే అది సాధ్యమవుతుంది. ఇందుకు ప్రజలో ఒక నూత్నదృక్పథం, అభ్యున్నతికోసం ఒక తీవ్రమయిన ఆకాంక్ష అత్యవసరం. ఏమార్పు రావాలన్నా, ఏ ఆదర్శం ఫలించాలన్నా యిలాంటి వాతావరణం ఏర్పడాలి. ఇది యితర విషయాలలో ఎంత నిజమో, పంచాయితీలు బలపడి బాగుపడాలన్నా అంతే నిజం.

అసలు, ప్రాచీనగ్రామపరిపాలనను గురించి మనకు నమ్మకంగా, శాస్త్రసిద్ధంగా చెప్పిన పండితులెవరూ అంతగా లేరు. పండిత రాధా కుముదముఖర్జీ

గారు 'ప్రాచీనభారతదేశంలో స్థానిక స్వపరిపాలన' (Local Government in Ancient India) వ్రాశారు. వారి గ్రంథంలో పరిశోధనవల్ల బైటికి తెచ్చిన పరిస్థితుల యథార్థం నిజమేనని మనం ఒప్పుకొన్నా, దీనివల్ల మనం కొత్తగా నేర్చుకోవలసిన విషయాలు ఎన్నోవున్నట్లు నాకనిపించదు. పంచాయితీలకు, ఆనాడు, యీనాటిలాగే, కొన్ని ఉపసంఘాలు తమకార్యకలాపాన్ని సులువుగా నెరవేర్చుకోడానికి వున్నట్టువున్నాయనీ, ఆనాడూ, వాటి కార్యభారం యీనాటివలెనే ఎంతో వైశాల్యం కలదిగా వుండేదనీ మన కనిపిస్తుంది. కాని, అది అంతకు మించి చెప్పిన విషయాలు ఏవీ లేవు. ఆయనతరవాత యీ పంచాయితీల విషయంలో కొంత సంపర్కం కలిగించుకొని పరిశోధనలు జరిపినది కాశీవిశ్వవిద్యాలయోపన్యాసకులు ఎ. యస్. ఆల్టేకర్ పండితులు. 'Village Communities in West India'' అనే వీరి గ్రంథం కొంతవరకూ చారిత్రకంగానూ, కొంతవరకూ వాస్తవికంగానూ వ్రాయబడింది. ముఖర్జీగారి గ్రంథం వర్ణించిన పరిస్థితుల కివతలికాలంలోని విషయాలను నిర్వచించడంచేత, మన కిది కొంత సన్నిహితమయినదే అయినా, సంతృప్తికరం అయిన స్థాయిలో యిది వ్రాయబడలేదు. ఇంకా యివతలికి వచ్చేసరికి బ్రిటిషు ప్రభుత్వారంభంనుంచి గ్రామపరిపాలన ఎలావుంటోంది అని పరిశీలించినవారు నేటి భారతీయప్రభుత్వ రవాణా శాఖాసభ్యులు డాక్టరు మత్తయిగారు. ఇంగ్లీషు స్థానికస్వపరిపాలనా విధానాలను గురించి ప్రశంసనీయమయిన పరిశోధనలు జరిపిన వెబ్బుదంపతులదగ్గర వీరు శిష్యులుగా వున్నకాలంలో, ౧౯౧౫ సం. ప్రాంతంలో, డాక్టరుడిగ్రీకి వ్రాసిన వ్యాసమే వారి 'Village Administration in British India' అన్న గ్రంథం. దీనికి వారు అతిజాగ్రత్తగా పరిశోధనలు జరిపి, ఎంతో చక్కగా వ్రాశారనడంలో అతిశయోక్తిలేదు గాని, ప్రస్తుతానికి చాలాకాలం వెనకటిపరిస్థితుల నాధారంచేసుకొని వ్రాయబడ్డదికనుక, యిదయినా చాలా వెనకపడింది అని అనకతప్పదు. సర్ హెన్రీ మెయినీ, బాడన్ పవెల్ లాంటి వారు ఉత్కృష్టమయిన గ్రంథాలే వ్రాశారు.

గ్రంథాలే వ్రాశారు గ్రామ పరిపాలననుగురించి వ్రాయలేదా అని అడిగేవా రుంటే, వారికి గ్రంథాలు చాలా విస్తృతమయిన రంగంలో వారూహించుకొని రాసినవికనుక, మన కతిసన్నిహితమయిన సమస్యల నెదుర్కోడాని కవి పనికిరావని చెప్పాలి. ఇవి మినహాయించి, గ్రామ పరిపాలనమీద అనేకులు రచించిన వ్యాసాలూ, గ్రంథాలూ నేను చూడడం తటస్థించినదిగాని, వాటిలో తమకు అభిమానవిషయాలలో, వారి కిష్టమయిన రాజకీయ కక్ష్యసందేశాలలో తప్పితే, యథార్థపరిస్థితుల నవగాహనచేసుకొంటూ శాస్త్రసిద్ధమయిన పద్ధతులమీద జరిపిన చర్చ ఒకటే నాకు కనపించలేదు.

పంచాయితీవిధానం దేశంఅంతటా, ౧౯౨౦ సం. నుంచీ తిరిగి ప్రవేశపెట్టారు. ప్రతీశాసనసభా యిందుకోసం ఒక చట్టం చేసింది. అయితే, ఆనాడే మళ్లీ పంచాయితీలు ఆరంభమయినాయి అని అనడం లేదు. అంతకుముందే, ౧౮౮౨ సంవత్సరంలోని స్థానిక స్వపరిపాలనచట్టం వచ్చినప్పటినుంచీ పనిచేస్తున్న పంచాయితీలు కొన్ని వున్నాయి. అంతకుముందు క్రీ. శ. ౧౮౫౮ సం లో ప్రభుత్వోద్యోగులు యీ పంచాయితీలనుగురించి చెప్పిన మాట లున్నాయి. క్రీ. శ. ౧౮౧౩ సం.లోని యీస్టుయిండియాకంపెనీ అయిదవ నివేదికలోకూడా, యీ పంచాయితీల ప్రాధాన్యమును గురించి వినిపించే ఘట్టాలున్నాయి. అయినప్పటికీ, వీటన్నిటినీ మించీ అయినా, పంచాయితీ చాలా శిథిలమయిపోయిన సంస్థగానే కనిపిస్తుంది. చిరకాలం యీ భాగాలలో యిది వేళ్లుబారిన సంస్థ అని మనకు తోచకమానదు. ఈ పంచాయితీ యింతకాలం యిలా బత్రికివున్నదంటే, ప్రోత్సాహకరమయిన పరిస్థితులకంటె, ప్రభుత్వ ఆదరణకంటె, యీసంస్థకు దేశంలో వేళ్లతో నాటుకుపోయిన పునాదులే సహజకారణం అనిపిస్తుంది.

క్రీ. శ. ౧౯౦౭ సం. లో వచ్చిన వికేంద్రీకరణ విషయమైన (Decentralization) రాయల్ కమీషను పంచాయితీల ప్రాముఖ్యాన్ని గుర్తించి, వాటి కధినివేశం కలిగించాలనే అంది. కాని, తరువాత వచ్చిన సైమన్ కమీషను పంచాయితీలు స్థాపించడానికిసాధ్యం

కాదని నిరూపించడానికి తగిన కారణాలు అన్నీ వీరి, వీటిని తిరిగి పునరుద్ధరించడానికి వీలులేదన్నారు. ఏది ఎలావున్నా, ప్రతీ రాష్ట్రంలోనూ ౧౯౨౦లో పంచాయితీలు తిరిగి అమలులోకి తేబడినాయి. పంజాబు, అస్సాము రాష్ట్రాలే యీవిషయంలో చాలాకాలం ఆలస్యంచేశాయి. అస్సాములో క్రీ. శ. ౧౯౨౬ దాకానూ, పంజాబులో క్రీ. శ. ౧౯౩౯ దాకానూ పంచాయితీచట్టాలు అమలుజరపబడలేదు. జరిపినతరువాతయినా, వీటి అభివృద్ధి ఎంతమాత్రమూ ప్రోత్సాహకరంగా లేదు. బెంగాలులో చౌకీదారిపంచాయితీలు తప్ప పంచాయితీలనేవి వేరే లేవు. సంయుక్తరాష్ట్రాలలోనూ, మధ్యపరగణాలలోనూ పంచాయితీలు చాలావరకు సామాన్యన్యాయపరిష్కారాలకు వినియోగించే చిన్న న్యాయసభలుగానే పనిచేస్తున్నాయి. బీహారులో వీటికి చెప్పుకోతగ్గ ప్రాధాన్యం ఏమీ లేదు. ఒరిస్సాలో వేరురాష్ట్రంగా విడినప్పుడుగాని, విడనప్పుడుగాని యీసంస్థ ఎక్కువగా రాణించిన రోజులు తక్కువ. దక్షిణభాగంలోకి వచ్చేసరికి వీటి ప్రాముఖ్యం కొంత కనిపిస్తుంది. బొంబాయి మదరాసు రాష్ట్రాలలో పంచాయితీల పరిపాలనావిధానంకోసం పాటుపడుతున్నట్లు, తక్కిన రాష్ట్రాలలో ప్రయత్నాలు చాలా తక్కువ. ఇక్కడయినా, యీ రెండురాష్ట్రాలలోని చట్టాలలో, నిబంధనలలో, కార్యక్రమంలో, ఆర్థిక సంపత్తిలోనూ చాలా వ్యత్యాసాలు వున్నాయి. వివిధ రాష్ట్రాలలో వున్న స్థానికసంస్థలు ఏవయినా పంచాయితీలుగాని, మునిసిపాలిటీలుగాని, జిల్లాబోర్డులుగాని ఎలా పనిచేస్తాయి అని మనం పరిశీలించాలంటే వీటిని గురించి ప్రభుత్వశాఖలు సాలీనా ప్రచురించే నివేదికలు తప్ప యింకో ఆధారం ఏమీ లేదు. ఇవి ఎంతమాత్రం మనం సరిఅయిన అభిప్రాయాలను ఏర్పరచుకోడానికయినా ఉపయోగపడలేని స్థితిలో వుంటాయి. ఇవికాకుండా, యీ సంస్థలను గురించి తెలుసుకొని, వున్న లోపాలను సవరించి, వాటి అభివృద్ధిపరిచే సూచనలు చేయాలంటే, స్వయంగా యీ పంచాయితీలకు వెళ్లి, సభ్యులతో మాట్లాడి, పరిపాలనావిధానంలో, ఆర్థికస్థితిగతులలో, వాటికీ పైఅధికారవర్గాలకూ వుండే సంబంధాలతో, అధికారవర్గాలు వాటిమీద చూపించే ఆదరణ నిరాదరణలతో సంపర్కం అవసరం అనిపించి, బొంబాయి చెన్నరాష్ట్రములను ప్రాతిపదికలనుగా తీసికొని, యీ రెండు రాష్ట్రాలలోని పంచాయితీ విధానాన్ని సమగ్రంగా పరిశోధించి, వీటిలోని లోపాలోపాలను వ్యక్తిగతంగా చూచి వీటిని పునరుద్ధరించి, ఉన్నతమయిన స్థితిలోకి తేవాలంటే చేయవలసిన సూచనలను, మార్గాలను ఒక నివేదిక ద్వారా సూచించవలసిందని గోఖలే ఇన్స్టిట్యూట్ ఆఫ్ పొలిటిక్స్ అండ్ ఎకనమిక్స్ పరిశోధనసంస్థాధికారులు నన్ను కోరగా, నేను ఒప్పుకొని, గతసంవత్సరం బొంబాయిరాష్ట్రంలో పర్యటనంచేసి కొన్ని వందల కొద్ది పంచాయితీలను స్వయంగా చూశాను. అప్పటికి నాకు ప్రభుత్వనివేదికల వ్యాఖ్యానాలకూ, యథార్థ పరిస్థితులకూ వుండే వ్యత్యాసం మరీ బాగా బోధపడింది. ఇలాగే ఔంధ్ సంస్థానంలో నేను చూచినదానికీ విన్న దానికీ హస్తిమశకాంతరం భేదం కనిపించింది. కొల్హాపూరు సంస్థానంలోనూ నా వ్యక్తిగత అనుభవాలకూ, అంతకుముందు ఆ సంస్థానాధికారులు విషయాన్ని గురించి నాతో ప్రసంగించినదానికి నాకెన్నో భేదాలు కనిపించాయి. ఇది సహజం. పరిశోధకునికి వుండే నిష్పక్షపాత బుద్ధితో ప్రభుత్వ శాఖలు ఆలోచించడం కష్టం.

పంచాయితీలను గురించి ప్రభుత్వ వర్గాలు తామెంత పాటుబడినా అవి పైకి రాలేకపోతున్నాయని అంటాయి. అది విని నిజం అనుకునే ప్రజాసామాన్యము పంచాయితీలద్వారా గ్రామాలను పరిపాలించాలనుకోవడం వేలంవెర్రి కాకపోతే యింకేమనుకుంటారు! ఎవరూ నిజం ఏమిటని గుర్తించాలన్న శ్రద్ధవహించని కారణం చేతనే యీ సంస్థ లీనాడింత అధోగతిపాలయినాయి.

ప్రజల్లో వున్న చైతన్యం వల్లగాని, పలుకుబడికోసం మానవులలో వున్న లోభం వల్లనైతేనేమి, ప్రజాహిత కార్యాలు చేయాలన్న స్వార్థరాహిత్యం కొంతమందిలో వుండడంవల్లనైతేనేమి — కారణాలు ఏవయినా పంచాయితీలు మటుకు ఏర్పడి ఎలాగో పనిచేసుకొంటూనే వస్తున్నాయి. ప్రభుత్వం వీటికి సరియయిన సాయం చేయడం లేదంటే దానికి కారణం అలసత కాదు; అసలు ఎలా జోక్యం కలుగజేసుకోవాలో, ఏమి చేయాలో సరియైన అభిప్రాయాలు లేకపోవడమే. దీనికి మనం ప్రభుత్వ వర్గాలను నిందించి లాభములేదు. చట్టం చేసినంత మాత్రంలో, పంచాయితీలు పునరుద్ధరింపబడినాయని భ్రాంతిపడి ప్రయోజనములేదు. ఈపంచాయితీ విషయాలలో పైన అజమాయిషీకి వున్న అధికారవర్గాలకు యీ విషయాలలో ఏవిధమయిన ప్రవేశం వున్నట్లు కనిపించదు. అది ఆరాష్ట్రంలో ఎంతో యీ రాష్ట్రంలోనూ అంతే. స్థానికసంస్థలు యిచ్చే జీతాలకు యింత

కన్న ఎక్కువ సమర్థులు రారన్న వాదం ఒప్పుకొన్నా యీనాడమలులో వున్న వుద్యోగులకయినా వారిబాధ్యతలను తెలియబరచక పోవడం ఒక పెద్ద పొరబాటు. అందుచేతనే వారిలో ఉత్సాహం, ప్రజాసేవమీద అభిమానం అదీ వున్నా, సరిగా ఉపయోగపడలేక పోతున్నారు. ఈనాడు పంచాయితీలు సరిగా పనిచేయకపోవడానికి గల కారణాలలో ఇదొకటి.

పంచాయితీలను పాతిక సంవత్సరాలకు మునుపే ప్రాబల్యంలోకి తెచ్చామని వాదించినంత మాత్రంలో ప్రయోజనం లేదు. ప్రతిచోటా యివి అమలులోనికి వచ్చినప్పటినుంచి, వాటి పరిపాలనా విధానాలకు ప్రభుత్వం ఏవిధమయిన ప్రోద్బలం యిస్తూవచ్చింది? వీటికున్న బాధ్యతలు ఏమిటి? ప్రజలకు వీటిమీద ఏపాటి అభిమానం వుంది? పంచాయితీ సభ్యత్వం అర్థించే మనుష్యులు ఎలాంటివాళ్లు? పంచాయితీలు ఎన్నికలు జరుపు కొని పని ప్రారంభించాలంటే కావలసిన పరిస్థితులు ఏమిటి? ప్రధాన కార్యనిర్వహణకయినా అవసరం అయిన పరికరాలూ, డబ్బూ వున్నాయా? పని ప్రారంభించాలంటే ప్రోత్సహించి సాయంచేయవలసిన అధికారవర్గాలు ఏ విధమయిన అభిమానాన్ని చూపెడుతున్నాయి—అన్న విషయా లొకటొకటే మనం ఆలోచించుకుంటే, పంచాయితీలు పనిచేయడం లేదని వాటిని నిందించేకంటె యీ పరిస్థితులకు అసలుకారణాలేమిటో అప్పుడు తెలుసుకోవాలి. ఆనాడే వీటిని గురించి నిష్పక్షపాతంగా ఆలోచించడానికి అవకాశం ఏర్పడుతుంది. అప్పుడు పంచాయితీ విధానాన్ని నిష్ప్రయోజనంగా గర్హించవలసిన స్థితి పోయి, అవి యింత నిరాశాపూరిత వాతావరణంలో యింకా బతికి ఎలా వున్నాయి అన్న ఆరోగ్యకరమైన సందేహాలకు స్థానం దొరుకుతుంది. ఇటువంటి పరిశోధన యీనాడు ఎంతయినా అవసరం. (సశేషం)



కీర్తిశేషులైన శ్రీ తలిశెట్టి రామారావుగారు
(సింహాద్రిమహారాణాగారు గీచిన పెన్సిలుచిత్రము)

సుప్రసిద్ధ వ్యంగ్యచిత్రకారులు, భారతి శ్రేయోభిలాషులు, జయపుర సంస్థానమునందు నౌరంగపురం సహాయామాత్యులు నయిన రామారావుగారు గతనెల ౧౨-వ తేదీనాడు జయపురములో వారి స్వగృహమునందు దివంగతులైరని తెలుపుటకు చింతిల్లుచున్నాము. శ్రీ రామారావు నాయుడుగారి ఆత్మకు భగవానుడు శాంతినిచ్చుగాక.

# భూప్రదక్షిణము

= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

రెండవ ప్రపంచయుద్ధమందు ఓడిపోయిన జర్మనీతో ఎట్టిసంధి చేసుకొనవలెనో నిర్ణయించుటకును, ఆ నిర్ణయము ప్రకారము సంధిపత్రము నొకదానిని తయారు చేయుటకును మార్చి ౧౦ వ తేదీన మాస్కోనగరమందు రషియా, యునైటెడ్ స్టేట్సు, ఇంగ్లండు, ఫ్రాన్సు దేశముల విదేశాంగమంత్రుల సభ ప్రారంభమయ్యెను. అది మొదలు ఇప్పటివరకు ఈ విషయమును గురించి చర్చలు, వాదప్రతివాదములు అనేకములు జరుగుచున్నవే కాని, ప్రధానవిషయమును గురించి మంత్రులు నలుగురు ఎట్టి తీర్మానమునకును రాలేకున్నారు. ఎట్టి తీర్మానమునకును రాకుండ సభ వాయిదా వేయబడునేమో అను సందేహముకూడ కలుగుచున్నది.

జర్మనులు మరెన్నటికికూడ తలయెత్తకుండ నుండునట్లు చేయుట మంత్రులందరియొక్క ఆశయము. ఇది నెరవేరుటకై ఎట్టిమార్గములను అనుసరించవలసియున్నదో అను విషయమును గురించి వారిలో అభిప్రాయభేదము లనేకములు లేవు. కాని, వీటికి సంబంధించిన వివరముల విషయములో అభిప్రాయభేదము లనేకములు కలిగినవి.

## జర్మనీ సమస్య

విస్తీర్ణమందు యూరపులోని పెద్దదేశములలో జర్మనీ ఒకటి. అందు ఆరుకోట్ల అరవైలక్షల జనమున్నారు. యూరపులోని రషియాయందు తప్ప మరే దేశమందుకూడ ఇంతటి జనసంఖ్య లేదు. వీరు కడు సమర్థులు. శాస్త్రపరిశోధనమునందు, క్రొత్తఅస్త్రశస్త్రములను కనుగొనుటయందు గొప్ప నిపుణులు. యంత్రసహాయమునపరిశ్రమలను నడుపుటయందు అతినేర్పరులు. గాఢమగు దేశాభిమానము గలవారు. ఒక నాయకుని అనుసరించి అతని ఆజ్ఞలు ఎట్టివైనను వాటిని శిరసావహించువారు. యుద్ధవ్యూహములను పన్నుటయందు అతికుశలులు. రెండు పర్యాయములు ప్రపంచమునంతను యుద్ధములో ముంచినవారు. వీరు తలయెత్తగలిగినయెడల మరియొక ప్రపంచయుద్ధము తప్పదు. అట్టి అవకాశము వారి కెన్నటికి రాకుండచేయు విషయమై అందరి అభిప్రాయము ఒక్కటిగ నున్నది.

దీనికి నాలుగుమార్గములను ఇదివరకే వారు సూచించిరి. మొదటిది జర్మనులను నిరాయుధులను చేయుట. చాలవరకు ఇది ఇప్పటికే కొనసాగినది. భరతఖండములోని ప్రజలను బ్రిటిష్‌వారు నిరాయుధులుగ చేసినట్లే మిత్రమండలివారు జర్మనులను నిరాయుధులను గావించిరి. జర్మనీలోని కీలకపరిశ్రమలను, భారపరిశ్రమలను (Key and heavy industries) నాశము చేయుట రెండవ మార్గము. ఇట్టి పరిశ్రమ లున్నగాని ఆయుధములు తయారుచేయుటకు వీలుండదు. భరతఖండములోని పరిశ్రమలను నాశముచేసి, వ్యవసాయమొక్కటే మనకు ప్రధానవృత్తిగ బ్రిటిష్‌వారు చేసిన మాట అందరికిని తెలిసినదే. ఆ విధానమునే జర్మనీలో మిత్రమండలివారు అనుసరించవలయు నని ఇదివరలో అనుకొనియుండిరి. జర్మనులు ప్రాణమాత్రావశిష్టులై యుండుటకు ఎట్టి పరిశ్రమలు అవసరమో అట్టివాటిని మాత్రమే దేశములో ఉంచుట వీరి అభీష్టము. హిట్లరు

పక్షమగు నాజీ పక్షమునకు చెందినవారి నందరిని శిక్షించుట మూడవ మార్గము. ఇదికూడ ఇప్పటికే కొంతవరకు జరిగెను. దేశమందు నియంతృత్వ ప్రభుత్వమునకు (Dictatorship) బదులు నిజమైన ప్రజాప్రభుత్వమును (Democracy) స్థాపించుట నాల్గవ మార్గము. ప్రమాదమంతయు హిట్లరువంటి నియంతలవలన కలిగిన దనియు, ప్రజాస్వామ్యమును స్థాపించినయెడల అట్టి ప్రమాద ముండదనియు మిత్రమండలివా రభిప్రాయ పడిరి.

యుద్ధము ముగిసినతర్వాత జర్మనీని అయిదు భాగములుగ జేసిరి. తూర్పుభాగములోని ప్రదేశము లనేకములు పోలెండుఅధీనములోనికి వచ్చెను. తక్కిన నాలుగు భాగములలో ఒకటి రష్యాయొక్కయు, ఒకటి ఇంగ్లండుయొక్కయు, ఒకటి అమెరికా యొక్కయు, తక్కినది ఫ్రెంచివారియొక్కయు అధీనమం దున్నవి. ఈ పంపకము శాశ్వతముగ నుండవలెనా, లేక దేశమంతయు ఒక కేంద్రప్రభుత్వమునకు లోబడియుండవలెనా? ఆ కేంద్రప్రభుత్వ మెట్టిదిగ నుండవలెను? ఈ విషయమై అభిప్రాయభేదములు అతి తీవ్రములుగ నున్నవి.

జర్మనీ ఏకఖండముగ నుండరా దనియు, అది బహుఖండములుగ విభజితము కావలెననియు ఫ్రెంచివారు పట్టుబట్టియున్నారు. ఇంగ్లీషువారు, అమెరికనులు చాలవరకు వీరితో ఏకీభవించుచున్నారు. దేశమంతయు ఒకే కేంద్రప్రభుత్వమునకు లోబడిన ఏకఖండముగ నుండవలెనని రష్యావారి అభిప్రాయము. అట్టి ప్రభుత్వము కమ్యూనిష్టు ప్రభుత్వము కాగలదని రష్యా వారి విశ్వాసము. ఆ కారణముచేతనే ఇంగ్లీషువారు, తదితరులు దానికి సమ్మతించుట లేదు. ఈ సమస్య పాకిస్థాన్ సమస్యవంటిది.

యుద్ధమువలన కలిగిన నష్టమునకు పరిహారముగ రష్యావారు జర్మనులనుండి ఎక్కువ ద్రవ్యమును కోరుచున్నారు. ఇంతటి ద్రవ్యమును జర్మనులు ఇచ్చుకొనలేరనియు, దేశమందు కీలకపరిశ్రమలు, భారపరిశ్రమలు అభివృద్ధి యయినగాని ఇంతటి ద్రవ్యము ఉత్పత్తి కాజాలదనియు, అట్టి అభివృద్ధిమూలమున ప్రమాదము కలుగుననియు ఇతరుల వాదము. రష్యావారుకూడ అట్టి అభివృద్ధికి ఇష్టపడుటలేదు. కాని ఏటేట తయారగు మామూలు సరుకులలో కొంతభాగమును నష్టపరిహారముక్రింద జర్మనులు ఇయ్యవలెనని వారి వాదము. ఇట్లు చేసినయెడల జర్మనులు సజీవులైయుండుటకూడ కష్టమగునని ఇతరుల అభిప్రాయము. ఏది ఎట్లు జరిగినను జర్మనీలో ఉత్పత్తియగు బొగ్గులో చాలభాగము తమకు చెందవలెనని ఫ్రెంచివారి పట్టు.

నలుగురు మంత్రుల మధ్య సామరస్యము కుదురునట్లు కనుపించదు. మొత్తముమీద అనేకవిషయములలో రష్యామాత్రము ఒకపక్షమందును, తక్కినవారు ముగ్గురు మరియొక పక్షమందును ఉన్నారని చెప్పవచ్చును. ముప్పై నలభై సంవత్సరములవరకు జర్మనీకి పారతంత్ర్యము తప్పనట్లు కనుపించుచున్నది. నిరాయుధులై, దారిద్ర్యబాధకు లోనై, ఆరుకోట్ల జర్మనులు శాంతముగ నుండెదరా? సాయుధులైనను, నిరాయుధులైనను వీరివలన ప్రమాదము తప్పునట్లు తోచదు.

## ట్రూమన్ సందేశము

మాస్కో సమావేశము ప్రారంభమైన తర్వాత రెండురోజులకు యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుడగు ట్రూమన్ కాంగ్రెసు (అమెరికాయొక్క శాసనసభకు కాంగ్రెసు అనిపేరు)ను కలుసుకొని ఒక సందేశమును చదివి వినిపించెను. అందు ఆతడు తన దేశ మికమీదట అనుసరించవలసిన విదేశాంగనీతినిగురించి క్రొత్త సూచన నొకదానిని చేసెను. ఆ సూచననుగురించి కాంగ్రెసువా రాలోచించుచున్నారు. బహుశః వారు దానిని ఆమోదింతురని తోచుచున్నది. ఈ సూచన ప్రపంచమందంతట ఒక సంచలనము కలిగించినది.

ఈ సందేశములో రెండు భాగము లున్నవి. అమెరికావారు గ్రీసు, టర్కీ దేశములకు సహాయము చేయుటకై వెంటనే ౧౩౦ కోట్లరూపాయలు ఖర్చుపెట్టవలయు ననుట మొదటి భాగము. ఇట్టి సహాయమును చేసినగాని ప్రపంచములో ప్రజాప్రభుత్వ విధానము నిలబజాల దనియు, నియంతృత్వ విధానము వ్యాపించు ననియు, ప్రజాప్రభుత్వ విధానమును నిలబెట్టుట అమెరికా

వారి విధి అనియు, అందుకై వారు వారి యావచ్ఛక్తిని వినియోగించవలెననియు చెప్పుట రెండవభాగము. కాంగ్రెసువారు ట్రూమన్ సందేశమును ఆమోదించిన యెడల గ్రీసు, టర్కీ దేశములకుమాత్రమే సహాయము దొరుకుటకాక, ప్రజాప్రభుత్వములను బలాత్కారముగ తొలగించి నియంతృత్వ ప్రభుత్వములను స్థాపించుటకు ఏయే దేశములలో ప్రస్తుతము ప్రయత్నములు జరుగుచున్నవో అట్టిదేశము లన్నిటికీ అమెరికావారు సహాయముచేసి ఆ ప్రయత్నములను భగ్నముచేయ సంసిద్ధులైయున్నారనుట స్పష్టము.

ఇందులో గమనింపదగ్గ విశేషములు రెండు కలవు. రెండవ ప్రపంచయుద్ధమునకు ఫలితముగ యునైటెడ్ స్టేట్సు, రషియామాత్రమే అగ్రరాజ్యములుగ నిలబడ గలిగినవి. కాని ఈ రెండు రాజ్యములకు మధ్య వైషమ్యము దినదినాభివృద్ధి గాంచుచున్నది. రషియాకు ఇప్పటికే ఎక్కువ ప్రాబల్యము కలిగిన దనియు, మరి అది వృద్ధికాకూడ దనియు అమెరికావారి నిశ్చయము. ట్రూమన్ యొక్క సందేశములో రషియా పేరు ఎక్కడను కనుపించకపోయినను ఆ దేశముయొక్క ప్రాబల్యమునకు అడ్డుతగులుటయే అతని ఉద్దేశమని నిస్సందేహముగ చెప్పవచ్చును. ఈ ఉద్దేశము సక్రమమైన దనియు, ధర్మసహితమైనదనియు ప్రపంచములోనివా రందరు హర్షించుటకై అతడు ప్రజాప్రభుత్వ విధానముయొక్క లోపములను అతని సందేశమందు వివరించెను. నియంతృత్వ విధానముపై దాడిచేయుట అనగా రషియాపై దాడిచేయుట అనియేనని ప్రపంచములోని ప్రాజ్ఞులందరు అర్థముచేసుకొనియున్నారు.

గ్రీసు టర్కీ దేశములు అమెరికాకు ఎంతో దూరమం దున్నవి. వాటికి సహాయముచేయవలసిన అవసరము అమెరికావారికి ఏల కలిగెను ?

## గ్రీసు

గ్రీసు యూరపుఖండపు దక్షిణభాగమం దున్నది. దానికి ఇరుగుపొరుగున నుండు ఆల్బేనియా, యూగోస్లావియా, బల్గేరియా దేశములు, వీటికి ఆవల నుండు రుమేనియా, హంగెరీ, జెకోస్లోవేకియా, పోలెండు దేశములు రషియావారి పోషణవర్గములో చేరి, రషియాయొక్క చెప్పుచేతలకు లోబడియున్నవి. ఇన్ని దేశములపై రషియావారి అధికారము వ్యాపించుటయే రెండవ ప్రపంచయుద్ధము మూలమున కలిగిన ప్రధాన ఫలితములలో నొకటి. దీనితోపాటు గ్రీసుదేశముకూడ రషియావారి పోషణవర్గములో చేరినయెడల యూరపు యొక్క మధ్యభాగమందును, ప్రాగ్దక్షిణమందును రషియావారి అధికారము పూర్తిగ వ్యాపించుటయు, మధ్యధరాసముద్రపు తూర్పుభాగమంతయు వారి అధీనములోనికి వచ్చుటయు తప్పదు.

## టర్కీ

టర్కీ దేశము పశ్చిమఆసియాలో ఉన్నది. దీనికి పొరుగుననే రషియాదేశ మున్నది. దీనినికూడ తమ పోషణవర్గములో చేర్చుకొనుటకు ఎన్నితెరములుగనో రషియావారు ప్రయత్నించుచున్నారు. రెండవ ప్రపంచయుద్ధము ముగిసినతర్వాత టర్కీపై రషియాయొక్క ఒత్తిడి ఎక్కువయ్యెను. రషియాకును, టర్కీకిని మధ్య నల్లసముద్ర మున్నది. దీనినుండి మధ్యధరాసముద్రమునకు వెళ్లు త్రోవలో డార్డనెల్సుజలసంధి కలదు. ఈ జలసంధి ప్రస్తుతము టర్కీవారి అధీనమందున్నది. దానిని తమ అధీనములోనికి తెచ్చుకొనుటకై రెండుసంవత్సరములుగ రషియావారు విశ్వప్రయత్నములు చేయుచు టర్కీని అనేకవిధములుగ భయపెట్టుచున్నారు. టర్కీ చాలా చిన్న దేశము. రషియాతో యుద్ధముచేసి గెలుచుటకు సామర్థ్యము లేనిది. అయినను యుద్ధము వచ్చునేమో యన్న భయముచేత పదిలక్షల సైన్యమును సన్నాహపరచి అందుకై ఎంతోసొమ్ము ఖర్చుపెట్టుచున్నది. కాని ఇది టర్కీవారి శక్తికి మించిన ఖర్చు. ఇట్టి స్థితిలో రషియావారి బెదిరింపులకు టర్కీవారు లొంగిపోవలసివచ్చినయెడల వారి ప్రాబల్యము టర్కీపైమాత్రమేగాక మధ్యప్రాచ్యదేశము లన్నిటిపై వ్యాపించుట తప్పదు. తూర్పు మధ్యధరాసముద్రము వారివశమగును. అచ్చటినుండి ఇండియావరకు—అనగా పాలెస్టయిన్, ఇరాక్, ఇరాన్ దేశముల మీదుగ—వారి ప్రాబల్యము వ్యాపించును. పర్షియన్ సింధుశాఖ, హిందూమహాసముద్రమును వారు చేరగలవా రగుదురు.

## బ్రిటిష్ వైఖరి

రషియావారికి ఇట్టి వ్యాపకము కలుగుట బ్రిటిష్ వారికిగాని, అమెరికావారికిగాని ఎంతమాత్రము ఇష్టము లేదు. మధ్యప్రాచ్యదేశములందు వీరు ఎక్కువగ వ్యాపారము చేయుచున్నారు. వీరికి కావలసిన పెట్రోలు చమురు చాలవరకు ఈ దేశములందే ఉన్నది. ఇదిగాక బ్రిటిష్ సామ్రాజ్యములో చేరిన తూర్పు దేశములకు —అనగా సింహళము, బర్మా, మలయా, ఆస్ట్రేలియా, న్యూజీలెండులకు— వెళ్లుటకు తూర్పు మధ్యధరా సముద్రము మధ్య ప్రాచ్య దేశములు రాజమార్గములు—దగ్గిర మార్గములు. ఇవి రషియావారి అధీనమైనయెడల బ్రిటిష్ వారి ప్రాణమునకే నష్టము కలుగును.

కాని బ్రిటిష్‌వారు ప్రస్తుతము స్వబలముచేత ఇట్టి ప్రమాదమునుండి తప్పించుకొనుటకు సమర్థులు కారు. రెండవ ప్రపంచయుద్ధముమూలమున వారి కదివరకున్న అర్థబలము, అంగబలము అదృశ్యమయ్యెను. ఈ రెండు సంవత్సరములనుండి వారు గ్రీసుకు, టర్కీకి ఎంతో ద్రవ్యసహాయము చేయుచుండిరి. గ్రీసులో వారి సైన్యము నొకదానిని ఉంచి కొంతవరకు శాంతి భద్రతలను కాపాడగలిగిరి. కాని ఇంతటి ఖర్చు తాము ఇకమీదట భరింపజాలమని వారు అమెరికాకు తెలియజేసిరి. కొద్దిరోజులలో గ్రీసులో నుండు బ్రిటిష్ సైన్యమంతయు ఉపసంహరింపబడగలదు.

## గ్రీసులో కమ్యూనిష్టుల ప్రమాదము

అప్పుడు గ్రీసుదేశము ప్రమాదస్థితిలోనికి రాక తప్పదు. గ్రీసు చాలా చిన్న దేశము. కొండలమయము. రెండవ ప్రపంచయుద్ధములో జర్మనీవారు దేశమును వశపరచుకొని ఎంతో నష్టమును కలిగించిరి. యుద్ధానంతరము ఇప్పటివరకు ప్రజలు క్షామబాధ ననుభవించుచున్నారు. దీనికి తోడు దేశములో కమ్యూనిష్టు పక్షమునకు చెందినవారు ప్రజాప్రభుత్వముపై తిరగబడి, మర్కటయుద్ధమును కొనసాగించుచు అరాచకమును వృద్ధిచేయుచున్నారు.

ప్రమాదమంతయు ఇందులోనే ఉన్నది. ఈ కమ్యూనిష్టులకు స్వతస్సిద్ధమైన బలములేదు. దేశములో వారి సంఖ్య చాల తక్కువ. ప్రజలలో వారికి విస్తారము పలుకుబడిలేదు. కాని దేశమునకు పొరుగునందుండు ఆల్బేనియా, బల్గేరియా, యూగోస్లావియావారు వీరికి ఎక్కువ సహాయముచేయుచున్నారు. రషియావారు కూడ వీరికి అండగా నిలబడియున్నారు. ఈ దేశములన్నిటిలో కమ్యూనిష్టు ప్రభుత్వము లున్నవి. గ్రీసు కమ్యూనిష్టులు వీరి సహాయముతో దేశములోని అధిక సంఖ్యాకు లెన్నుకొనిన ప్రజాప్రభుత్వమును తొలగించి, విప్లవమును లేవదీసి, తమ నియంతృత్వ ప్రభుత్వమును స్థాపించ జూచుచున్నారు.

పొరుగురాజ్యములవారు ఈ విషయముగ గ్రీసుయొక్క ఆంతరంగిక వ్యవహారములలో జోక్యము కలిగించుకొని, కమ్యూనిష్టు పితూరీదారులకు సహాయము చేయుచున్నారనియు, ఇట్టిది జరుగకుండ చేయవలయుననియు గ్రీసు ప్రభుత్వమువారు ఐక్యజాతి భద్రతాసభకు విన్నవించుకొనిరి. అందుపై ఆ సభవారు ఈ విషయమై దర్యాప్తుచేయుటకొక కమిటీని నిర్ణయించిరి. కమిటీవారు రెండుమాసములుగా దీనిని విచారణ చేయుచున్నారు. పొరుగురాజ్యములవారు గ్రీసు కమ్యూనిష్టులకు సహాయము చేయుచుండునట్లు స్పష్టమయ్యెను.

బలాత్కారముగ రషియావారును, వారిపోషణవర్గములోని రాజ్యములవారును గ్రీసులో కమ్యూనిష్టుల నియంతృత్వమును స్థాపించుట న్యాయవిరుద్ధమని ట్రూమన్‌వాదము. అట్టిది జరుగకుండుటకై ఇప్పుడతడు గ్రీసు, టర్కీలకు సహాయముచేయ నిశ్చయించుకొనెను.

ట్రూమన్ సందేశములో "కమ్యూనిజం" అన్నమాట ఎక్కడ లేదు. అతడు "నియంతృత్వము" (Totalitarianism) అన్నమాటనే వాడియున్నాడు. కాని, అతని అభిప్రాయములో కమ్యూనిజం నియంతృత్వ విధానముయొక్క అపరావతారమనియే.

వ్యక్తి స్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, మతస్వాతంత్ర్యము, బహు రాజకీయపక్షములు ప్రజాప్రభుత్వమునకు లక్షణములు. ఇది బహు జనాభిప్రాయము ననుసరించు రాజ్యాంగపద్ధతి. నియంతృత్వ

మున కవతారమగు కమ్యూనిజంలో స్వాతంత్ర్యము లేదు. ఒక రాజకీయపక్షమువారే అధికారములో ఉండెదరు. భయమే దానికి ఆధారము. అది అల్పసంఖ్యాకుల ప్రభుత్వము. ఇట్టి భేదము లుండుటచేత ప్రజాప్రభుత్వ మొక్కటియే ప్రశంసనార్హమైనదనియు, కమ్యూనిజం ఖండనార్హమైనదనియు ట్రూమన్ యొక్క దృఢనిశ్చయము.

ఈ నిశ్చయము ననుసరించి అతడు గ్రీసు, టర్కీలకు సహాయము చేయనున్నాడు.

## రష్యా వైఖరి

రష్యావారి వైఖరి ఈ విషయములో ఎట్లుండునో? ఈ నిమిషమున ఏయేదేశములలో వారికి పలుకుబడి యున్నదో ఆ దేశములతో వారు తృప్తిపడి, ఇతర దేశములందు కమ్యూనిజమును ప్రచారము చేయకుండుటకును, బలాత్కారముగ కమ్యూనిష్టు ప్రభుత్వములను స్థాపింపకుండుటకును సిద్ధపడినయెడల వారికినీ, అమెరికా వారికినీ మధ్య వైరము పెరుగకుండును. లేనియెడల వైరము పెరిగి కొంతకాలమునకు యుద్ధరూపము ధరించవచ్చును.

ట్రూమన్ సందేశములోని పరమార్థ మిదియే.

ఈ రెండు దేశములవారును వారివారి బలములను సుస్థిరపరచుకొనుటకు ప్రయత్నములు చేసుకొనుచున్నారు. మార్చి నెలలో రష్యావారు పోలెండుతో క్రొత్తసంధి నొకదానిని చేసుకొని, పోలెండుకు కొంత ద్రవ్యమును అప్పిచ్చుటకును పోలిష్ సైన్యములను తగ్గించుటకును అంగీకరించిరి. ఇదేవిధముగ పోలెండు జెకోస్లోవేకియాలమధ్యన క్రొత్త ఒడంబడిక యొకటి జరిగెను. అమెరికావారు దక్షిణ కొరియాయందు వారి బలమును స్థిరపరచుకొనుచున్నారు. ఫిలిప్పైన్ ద్వీపములలో కొన్ని సైనికాశ్రయములను సంపాదించిరి. దీనిమూలమున పసిఫిక్ మహాసముద్రపు పశ్చిమతీరమున వారి బలము వృద్ధిగాంచగలదు.

## ఇంగ్లండు

మార్చి నెలలో పార్లమెంటులో జరిగిన చర్చల వలన ఇంగ్లండుయొక్క ఆర్థికస్థితి క్లిష్టముగ నున్నట్లు స్పష్టమయ్యెను. ఈ క్లిష్టస్థితికి మూడు లక్షణము లున్నవి. (౧) దేశములోని ప్రజలకు కావలసిన ఆహార పదార్థములు విదేశములనుండి రావలసియున్నది. దేశమున పండుపంటలు దీనికి సరిపడియుండుట లేదు. ఇది క్రొత్తగా ఏర్పడిన స్థితి కాదు. సుమారు నూరుసంవత్సరములనుండి ఇంగ్లీషువారిట్టిస్థితియందున్నారు. విదేశములతో వ్యాపారము జరగని పక్షమున ఇంగ్లీషువారు పస్తుండుట తప్పదు. (౨) రెండవ ప్రపంచయుద్ధము మూలమున ఇంగ్లీషువారి విదేశవ్యాపారమునకు గొప్ప దెబ్బతగిలెను. అంతకుపూర్వము వారు సాహుకార్లయి విదేశములవారికి ఎక్కువ ఋణములనిచ్చి, ఆ ఋణములపై ఏటేట రావలసిన కోట్లకొలది వడ్డీద్రవ్యముతో విదేశములనుండి తమకు కావలసిన ఆహారపదార్థములను ముడివస్తువులను ఎక్కువగ సంపాదించుచుండిరి. వారు భోగభాగ్యములతో తులతూగుట కిది యొక ప్రధాన కారణము. రెండవ ప్రపంచయుద్ధములో విదేశముల వారు వీరి కియ్యవలసిన బాకీలన్నిటిని చెల్లించివేసిరి. ఇంతేకాక వీరే విదేశములవారికి ఋణపడిపోయిరి. అందుచేత ఇప్పుడు వీరు ఏటేట కోట్లకొలది రూపాయల విలువగల సామానులను ఇతర దేశములకు వడ్డీక్రింద పంపవలసిన స్థితి ఏర్పడెను. ఇట్లు పంపినతర్వాత, మిగిలిన సామానులను మాత్రమే వా రనుభవించుటకు వీలగును. (3) విదేశములనుండి తెచ్చుకొనవలసిన ఆహారపదార్థములకును, చెల్లించవలసిన వడ్డీలకును వారు తయారుచేయవలసిన సామానులు ఎంతో వృద్ధికావలసియున్నను దేశములో కూలిపని చేయుటకు కావలసినంత జనము లభించుటలేదు. పంద్రెండులక్షల జనము సైన్యములలో చేరి జర్మనీ, పాలెస్టయిన్, ఈజిప్టు, ఇండియా, జపాన్ మొదలగు దేశములందున్నారు. కొన్ని సంవత్సరములనుండి ఇంగ్లండులో జననముల సంఖ్యయు, మరణముల సంఖ్యయు తగ్గుటచేత పరిశ్రమలలో పనిచేయలేని వృద్ధులసంఖ్య ఎక్కువయ్యెను. ఇదిగాక ఇదివరకు ౧౫ సంవత్సరముల వయస్సువరకే నిర్బంధవిద్యావిధానముండెడిది. ఇప్పుడు దానిని ౧౬ వ సంవత్సరమువరకు పొడిగించుటచేత పరిశ్రమలలో పనిచేయు యువకుల సంఖ్య తగ్గెను. ఇట్టి సందర్భములో వారు తక్కువ కూలిజనముతో ఎక్కువ సరకులను ఉత్పత్తిచేయవలసిన స్థితిలోకి వచ్చిరి. ఇది జరుగుటకు ఎన్నో ఉపాయములను వారు వెతకుచున్నారు. యంత్రములను ఎక్కువగ ఉపయోగించుట,

కూలివాండ్రు సమ్మెలు చేయకుండుట, అవసరమైనప్పుడు ఎక్కువగంటలకాలము పనిచేయుట మొదలగు ఉపాయములు ఆచరణలోనికి వచ్చుచున్నవి. విదేశములందుండు సైన్యములను సాధ్యమైనంతవరకు తగ్గించుకొనుటయు, విదేశముల వ్యవహారములలో అనవసరముగ జోక్యము కలిగించుకొనకుండుటయు ఈ ఉపాయములలో చేరియున్నవి.

## దూరప్రాచ్యము

దూరప్రాచ్యదేశములలో రెండుమూడు విశేషములు గమనింపతగియున్నవి. అమెరికావారి అధీనమందున్న జపాన్ దేశములో ఇటీవల ఇరవై లక్షుల జనము క్రైస్తవమతమును స్వీకరించిరి. చైనాలో జాతీయ ప్రభుత్వమువారు కమ్యూనిష్టుల ప్రధానపట్టణమగు ఈనాన్‌నగరమును, మరికొన్ని పట్టణములను వశపరచుకొనిరి. దీనిమూలమున కమ్యూనిష్టుల ప్రాబల్యము తగ్గి దేశములోని అంతర్యుద్ధము త్వరలోనే ముగియునని తోచుచున్నది. ఇదిగాక చియాంగ్ కై షేక్ పరిపాలన సభలో జాతీయపక్షమువారేకాక మరికొన్ని పక్షముల వారుకూడ చేరు సూచనలు కనుపించుచున్నవి. అమెరికావారు అతని ప్రభుత్వమునకు కొంత ధనసహాయము చేయునట్లున్నది. ఈ కారణములచేత చైనాలోని పరిస్థితులు బాగుపడవచ్చును.

స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న ఇండొనీషియన్ ప్రజారాజ్యమునకును(Indonesian Republic), డచ్చివారికిని గతినవంబరులో జరిగిన సంధి ఇప్పుడు ఖాయము చేయబడెను. ఇందుమూలమున జావా సుమత్రాద్వీపములు స్వతంత్రము లయ్యెను. కొన్ని విషయములలో మాత్రము ఈ ప్రజారాజ్యము డచ్చివారితో సంబంధము కలదియగును. స్వాతంత్ర్య సమరములో ఆసియాఖండవాసులకు విజయము చేకూరనున్నదనుటకు ఇది ఒక గొప్ప చిహ్నము.

## అఖిలఆసియా మహాసభ

ఈ సందర్భములో ఢిల్లీనగరమున సమావేశమైన అఖిలఆసియామహాసభ ప్రశంసింపదగియున్నది. ఆసియా ఖండములోని ఇరవైఅయిదు దేశములందుండి ఈసభకు ప్రతినిధులు వచ్చిరి. వీరు భూగోళములోని మానవకోటిలో సగభాగమునకు, అనగా నూరుకోట్ల జనమునకు — ప్రతినిధులుగ నున్నారు. సుమారు అయిదువందల సంవత్సరములనుండి యూరపుఖండవాసుల ప్రాబల్యము ఆసియాయందంతట వ్యాపించుటయు, ఆకారణమున ఆసియావారి ప్రాచీనకాలపు ప్రతిభ అడుగంటుటయు సంభవించెను. ఇప్పుడు వీరు నిద్రనుండి మేల్కొని, తమ పూర్వపు ప్రతిభను స్మరణకు తెచ్చుకొని, యూరపుఖండవాసుల అధికారమును తొలగించి, స్వాతంత్ర్యమును సంపాదించుటకు పూనుకొనియున్నారు. ఆసియాఖండవాసుల మధ్యన భేదములనేకము లున్నను ఆధ్యాత్మికముగను, విజ్ఞానవిషయములందును వీరందరియందు ఒకవిధమైన ఏకత్వ మున్నది. రాజకీయ, ఆర్థిక వ్యవహారములందు వీరందరు ఒకేవిధమైన సమస్యలను ఎదుర్కొనవలసియున్నారు. ఇట్టి సందర్భములో వీరందరు ఒకచోట కలసి, ఈ వ్యవహారములనుగురించి చర్చించుట అత్యావశ్యము. ఈ సమావేశము మన దేశములో జరుగుట మరింత ప్రశంసింపదగియున్నది. మన దేశము ఆసియావిజ్ఞానమునకు కేంద్రముగ నుండినది. ఇకమీదట మనదేశమే ఆసియాఖండమునకు నాయకత్వము వహింపవలసియున్నది. ప్రపంచములో ఆసియాఖండవాసులు తలఎత్తి తిరుగగలరని ఈ మహాసభ చాటించుచున్నది. అందుచేత మానవచరిత్రలో ఇప్పటినుండి నూతనశక మొకటి ఆరంభమయ్యెనని చెప్పవచ్చును.

## భరతఖండము

భరతఖండపు పరిస్థితులకు (౧) ఇంగ్లీషు ప్రభుత్వము (౨) కాంగ్రెసు (౩) లీగు (౪) స్వదేశసంస్థానములు ప్రధానాధారము. వీటియొక్క వైఖరిలో ఎట్టి మార్పు కలిగినను దేశపరిస్థితులలో కూడ మార్పులు కలుగుట తప్పదు.

## బ్రిటిష్‌వారు

ఫిబ్రవరి ౨౦ వ తేదీన అట్లీ చేసినప్రకటన విషయమై మార్చి నెలలో పార్లమెంటునందు గొప్ప చర్చ జరిగెను. కన్సర్వేటివ్‌పక్ష నాయకులు ఆ ప్రకటనను ఖండించి, ౧౯౪౮ జూన్‌లోపుగ అధికారమునంతను భారతీయులపరమే చేయుటకు నిశ్చయించుట ప్రమాదకరమని వాదించిరి. కాని, బ్రిటిష్ మంత్రివర్గమువారు మాత్రము ఆ ప్రకటనను అనుసరించి ప్రవర్తించుటకు సిద్ధపడియున్నట్లు స్పష్టపరచిరి. గనుక ఆప్రకటనయందు ఎట్టిమార్పులుండవని చెప్పవచ్చును. ౧౯౪౮ జూన్ నాటికి అధికారము భారతీయుల పరమగుట సత్యమని నమ్మవచ్చును. వేవల్ ప్రభువు స్థానమున రాజప్రతినిధిగ వచ్చిన మౌంట్‌బాటన్ ప్రభువుయొక్క మాటలను బట్టియు, చర్యలనుబట్టియు అధికారము భారతీయులహస్త

మగుననియే తలచవలసియున్నది. కాని ఈఅధికారమం తయు ఒకే కేంద్రప్రభుత్వమునకు లభింపనున్నదా, లేక అనేక రాష్ట్రప్రభుత్వముల వశము కానున్నదా అను విషయమున మాత్రము బ్రిటిష్‌వారు ఇంకను ఏట్టినిర్ణయ మునకు రాలేదు.

## కాంగ్రెసు

అట్లీ ప్రకటనను విమర్శించుటకై కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు ఢిల్లీలో సమావేశమై కొన్ని తీర్మానములను గావించిరి. ఇవి చాలా ముఖ్యమైన తీర్మానములు. ౧౯౪౮ జూన్‌లోపుగ అధికారమును భారతీయులపరము చేయువిషయములో ఇప్పటినుండియే కార్యక్రమమునకు పూనకొనవలయుననియు, దానికి చిహ్నముగ ప్రస్తుతము అధికారములో ఉన్న ఇంటరిం గవర్నమెంటునకు క్రమక్రమముగ అన్ని అధికారముల నిచ్చుటయే సబబనియు సూచించిరి. ఇదిగాక అధికార పరివర్తనము జరుగుటకు కావలసిన ఏర్పాటుల నన్నిటినిగురించి ఆలోచించుటకై లీగు ప్రతినిధులు కాంగ్రెసు ప్రతినిధులను కలిసికొనుట అవసరమని, అట్టి ప్రతినిధులను పంపవలసినదిగా లీగువారిని కోరిరి. ఇది చాల ప్రశంసనీయమైన తీర్మానము. లీగుతో సఖ్యముగ ప్రవర్తించవలయునని కాంగ్రెసువారు నిశ్చయించుకొన్నట్లు వేరు సాక్ష్యమక్కరలేదు. ఇదిగాక రాష్ట్రీకగ్గీకరణవిషయమై బ్రిటిష్ మంత్రివర్గమువారి వ్యాఖ్యానమునకు తాము సంపూర్ణముగ సమ్మతించినట్లును, ప్రజాపరిషత్తువారు ఏర్పరచు రాజ్యాంగవిధానమును ఏయే రాష్ట్రములవారు ఆమోదింతురో ఆ రాష్ట్రములకే అదివర్తించుననియు, ఆమోదింపని రాష్ట్రములలో అది అమలులోనికి రాదనియు వారు తీర్మానించిరి. మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగ నుండు ప్రదేశములవారు ఈ రాజ్యాంగమును ఆమోదించనిపక్షమున వారు విడిపోయి ప్రత్యేక రాజ్యాంగమును ఏర్పరచుకొనవచ్చునని దీని అభిప్రాయము. అనగా పాకిస్థానవాదమునకు కాంగ్రెసువారు ప్రతికూలురు కారని దీనినుండి తెలియుచున్నది. కాని దీనితో మరొక తీర్మానమునుకూడ కాంగ్రెసువారు జతపరచిరి. పంజాబులోని అల్లరుల మూలమున హిందూ మహమ్మదీయ సమస్య క్లిష్టతరమైనది. అందుచేత పంజాబును రెండు రాష్ట్రములుగా విభజించుటయే ఉత్తమమని కాంగ్రెసువారు తీర్మానించిరి. మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగ నుండు ప్రదేశములన్నియు కలిసి ఒక రాష్ట్రముగాను, హిందువులు శిక్కులు అధికసంఖ్యాకులుగ నుండు జిల్లాలు కలిసి ఇంకొక రాష్ట్రముగాను ఏర్పడుటయే మంచిదని కాంగ్రెసు అభిప్రాయము. ఇదియే సరియైనయెడల బంగాళమునకూడ ఈసూత్రమననుసరించి రెండు రాష్ట్రములుగ విభజించుట ఆవశ్యకమగును. ఇట్టివిభజన అఖండహిందూస్థానసూత్రమునకు విరుద్ధమనియు, ఇందుమూలమున హిందూ మహమ్మదీయసమస్య పరిష్కారము కాజాలదనియు కొందరంకొనుచున్నారు. కాని మతవైషమ్యములు పెరుగుచుండు ప్రస్తుతకాలములో ఇదియే అనుసరణీయమని చెప్పవలసియున్నది. రాష్ట్రములో ఉండుటకు ఇష్టములేనివారిని నిర్బంధముగ రాష్ట్రములో ఉంచి, అనేకబాధలు పడునట్లు చేయుటకంటె విభజనయే ఉత్తమమార్గము. కాంగ్రెసులీగులకు మధ్యన ఏట్టిసంప్రతింపులు జరుగునో, ఎంతవరకు సామరస్యము కుదురునో చూడవలసియున్నది.

## లీగు

అట్లీ ప్రకటననుగురించి లీగువారింకను అధికారరీత్యా వారి అభిప్రాయమును వ్యక్తపరచియుండలేదు. కాని లీగువారు ఇదివరకు చేయుచుండిన ప్రచారమునకు ఫలితముగ పంజాబులో అతి దారుణములగు కృత్యములు జరిగినవి. ౧౯౪౮ జూన్ నాటికి ఏర్పడు రాష్ట్రప్రభుత్వములకు బ్రిటిష్‌వారు సర్వాధికారమును ఒప్పగింతురన్న ఆశచేత లీగుప్రభుత్వమును పంజాబులో స్థాపించనుద్దేశించి ఈ అల్లరులను లేవదీసిరని చెప్పవచ్చును. దీనికి ఫలితముగ వేలకొలది హిందువులు, శిక్కులు ప్రాణములు కోల్పోయిరి. వేలకొలది జనము గాయపడిరి. కోట్లకొలది ద్రవ్యము నష్టమయ్యెను. దౌర్జన్యము నుపయోగించి లీగు ప్రభుత్వమును స్థాపించుటకనేకులు కంకణము కట్టుకొనియున్నట్లు ఇది స్పష్టము చేయుచున్నది. ఇట్టి ప్రభుత్వమునకు తామెన్నడును అంగీకరించజాలమనియు, లీగుప్రభుత్వములో తాము పాల్గొనమనియు శిక్కు, హిందూనాయకులు స్పష్టపరిచి, కాంగ్రెసువారు సూచించిన పంజాబు విభజనకు సుముఖులుగ నున్నట్లు ప్రకటించిరి.

లీగు ప్రభుత్వము అమలులోనున్న సింధు రాష్ట్రము సంపూర్ణస్వాతంత్ర్యముగల రాజ్యమగునని

అచ్చటి ప్రభుత్వమువారు ఘోషించుచున్నారు. [సింధు]రాష్ట్రములోకూడ ఇప్పటి కాంగ్రెస్ ప్రభుత్వమును తొలగించి లీగుప్రభుత్వమును స్థాపించు ఉద్దేశముతో కొందరు అల్లరులను లేవదీసిరి. కాని అవి అంత ప్రమాదకరములు కాలేదు. మొత్తముమీద లీగు ఉద్దేశములను సాధించగోరిన మహమ్మదీయులు దౌర్జన్యము నుపయోగించి, అల్లరులను లేవదీసి, సంపూర్ణ స్వాతంత్ర్యము గల పాకిస్థానరాష్ట్రములను సంస్థాపించ నిశ్చయించియున్నారని మార్చి నెలలో జరిగిన చర్యల వలన స్పష్టమగుచున్నది.

## సంస్థానములు

అట్టి ప్రకటన ఫలితముగ సంస్థానము లన్నియు ఏకముఖముగ ప్రవర్తించుటకు బదులు భిన్నముఖములుగ ప్రవర్తించుచున్నవి. నరేంద్రమండలికి చెందిన సంస్థానములకు నాయకుడుగనుండి, వారి తరఫున రాజ్యాంగపరిషత్తుతోడను, వైస్రాయితోడను రాయబారములు జరుపుచుండిన భోపాలునవాబునందు కొన్ని సంస్థానములవారికి విశ్వాసము లేనట్లు తెలియుచున్నది. అందుచేత బరోడా, జయపూరు మొదలైన సంస్థానములు కొన్ని రాజ్యాంగపరిషత్తులో చేరుటకును, కొన్ని ౧౯౪౮ లో ఏర్పడబోవు స్వతంత్ర భరతఖండములో అంతర్భాగములుగ నుండుటకును అంగీకరించినవి. ఇది శుభసూచకము. క్రమక్రమముగ మరికొన్ని సంస్థానములుకూడ ఇట్టి మార్గమునే అవలంబించును. తిరువాంకూరుసంస్థానముమాత్రము మరియొక పంథాను త్రొక్కునట్లగపడుచున్నది. బ్రిటిష్‌వారు రాకపూర్వము ఎట్టి స్వాతంత్ర్యము దాని కుండెనో అట్టి స్వాతంత్ర్యమునే అది కోరుచున్నదని ఆ సంస్థానపు దివాన్ ప్రకటించెను. భోపాలునవాబు నాయకత్వమున పనిచేయుచుండు సంస్థానాధీశులు రాజ్యాంగపరిషత్తులో చేరుటకు ఇదివరకు సమ్మతించియుండినను ఇప్పుడు తమ అభిప్రాయమును మార్చుకొనెదరేమో అని తోచుచున్నది.

వీనినన్నిటినిబట్టి చూడగా ౧౯౪౮ జూన్ నాటికి దేశమందు ఒక కేంద్రప్రభుత్వమునకు లోబడిన భరతఖండ ప్రజారాజ్యము (Republic) ఏర్పడుటకు బదులు స్వతంత్రరాజ్యము లనేకము లేర్పడునేమో అను సందేహము కలుగుచున్నది.

## కేంద్రప్రభుత్వపు బడ్జెట్

ఈసంవత్సరమున కేంద్రప్రభుత్వపు ఆదాయవ్యయ పట్టికలో గమనించదగిన మార్పులనేకములుకలవు. ఉప్పుపన్ను రద్దుఅగుట మొదటిమార్పు. ఎంతకాలమునుండియో మహాత్మాగాంధీగారు సంకల్పించి యుండిన ఈ మార్పు ఇప్పటికి జరిగినది. నూటికి ఆరు రూపాయల కంటె ఎక్కువ లాభమును సంపాదించువారి ఎక్కువ లాభము లక్షకు మించినయెడల వారా ఎక్కువ లాభములో నూటికి ౧౨ ౨/౩ వంతున పన్నులు చెల్లింపవలయుననుట రెండవ మార్పు. దీనినిగురించి శాసనసభలో కొన్ని వాదప్రతివాదములు జరిగి తుదకు రాజీ మూలమున ఈ నిర్ణయము చేయబడెను. ఇట్లే ఆస్తుల విక్రయము (Capital gains) మూలమున అధికలాభమును సంపాదించువారు ఆ లాభము ననుసరించి రూపాయకు ఒక అణా మొదలు అయిదుఅణాల పన్ను చెల్లించవలసియున్నది. పన్నులకు సంబంధించిన ఈ రెండు మార్పులలో గమనించదగిన విశేష మొకటి కలదు. కష్టపడి పనిచేయక విస్తారలాభమును గడించువారు వారి ధనములో చాలభాగమును సంఘశ్రేయస్సుకై వినియోగించుటయే ధర్మమను సూత్రమును ఆచరణలో పెట్టుటయే ఈ విశేషము. జమీందారీలను రద్దుచేయవలెనను వాదములో ఉండు న్యాయమే ఇందులోకూడ కొద్దిగ కనుపించుచున్నది. జమీందారీలను రద్దుచేయవలెనని వాదించుచుండు కాంగ్రెసు ప్రముఖులు ఈ పన్నులను అడ్డుతగులుటయే కొంచెము ఆశ్చర్యకరముగను, హాస్యాస్పదముగను ఉన్నది. ధనికులను సాహుకార్లకు కాంగ్రెసు ప్రముఖవర్గముతో గల పలుకుబడియే దీనికి కారణము.

## మద్రాసు రాష్ట్రము

మద్రాసురాష్ట్రములో ప్రకాశం మంత్రివర్గము మారి ఓమాండూరి రామస్వామిరెడ్డిగారి మంత్రివర్గము అధికారములోనికి వచ్చెను. ఈ మార్పునకు కారణము లేవియో ఎవరికిని తెలియదు. ఈ విషయమై గత సంచికయందు కొంత వ్యాఖ్యానము చేసియుంటిని. ఈ సందర్భమున కాంగ్రెసు అధ్యక్షులగు శ్రీ ఆచార్య కృపలానీగారు చెప్పినమాటలు గమనించదగియున్నవి. "ప్రకాశంగారికిని, కాంగ్రెసుపక్షములోని ఇతరవార

ములవారికిని ఎందునిమిత్తమై ఘర్షణ సంభవించినదో నేను ఊహించలేకున్నాను. అన్నివర్గములవారు తమ ఉద్దేశము కాంగ్రెసు నిర్మాణక్రమము ననుసరించుటయే అనియు, ఆ క్రమమునకు బద్ధులైనట్లును నొక్కి చెప్పుచున్నారు. అట్టి సందర్భములో వారిలో ఇప్పుడుండు అభిప్రాయభేదములు దేనినిగురించియో నాకు అవగాహనమగుటలేదు." ఏసందర్భములవలన తమ మంత్రివర్గము రాజీనామా ఇయ్యవలసివచ్చినదో ప్రకాశంగారు శాసన సభలో విపులముగ వివరించి యున్నారు. ఇప్పటి మంత్రి వర్గమును గురించియు, ఇక మీదట ఏర్పడబోవు మంత్రివర్గములనుగురించియు విమర్శించు సందర్భమున కొన్ని విషయములు ప్రధానములుగ గమనింపవలసియున్నది. (౧) ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థిగ నుండుటకుకూడ అర్హుడు కాడని అనుకొనినట్టియు, శాసనసభలో ప్రస్తుతము సభ్యుడు కానట్టియు డాక్టరు సుబ్బరాయన్‌గారు ఇప్పుడు మంత్రిఅగుటయు, సభానాయకుడగుటయు విచిత్రము. ఈ సంఘటనకు కారణము లెవ్వి? మంత్రిపదవుల కర్హులును, సభానాయకత్వమును వహించతగ్గవారును శాసన సభలోని ౧౫౦ కాంగ్రెసు సభ్యులలో మరెవ్వరు లేరా? శాసనసభ్యులు కానివారిని మంత్రులుగా నియమించుటకు చట్టములో అవకాశ మున్నమాట వాస్తవమే. కాని ఈ అవకాశము ఏదో ప్రమాదకరమగు కాలమందు, మార్గాంతరము లేని క్లిష్టపరిస్థితులలో ఉపయోగించుకొనవలసినదేగాని, మామూలు పరిస్థితులలో ఉపయోగించుకొనతగినది కాదు. (౨) సభానాయకుడుగ నుండతగనివానిని కాంగ్రెసుపక్ష నాయకుడుగను, ప్రధాన మంత్రిగను ఎన్నుకొనుట ఎందుకు? అన్ని పనులను చేయుటకు సమర్థుడుగ నున్నవారినే ప్రధానమంత్రిగ ఏల ఎన్నుకొనలేదో? ఇంగ్లీషుపార్లమెంటులో ఒక్కొక్కప్పుడు ఒకరు ప్రధానమంత్రియు, మరియొకరు సభానాయకుడుగను ఉండు ఆచారము లేకపోలేదు. కాని దీనికి కారణములు వేరు. అచ్చట ప్రధానమంత్రి చేయవలసిన పనులు, వహింపవలసిన బాధ్యత చాల ఎక్కువగుట చేత, అతడు ఎంతటి సమర్థుడైనను సభానాయకుడు చేయవలసిన పనులను చేయుటకు కాలవ్యవధి చాలదు. మన రాష్ట్రపు పరిస్థితి అట్టిదికాదు. ప్రధానమంత్రికి సభానాయకత్వమును వహించుటకు కావలసిన అర్హత లేనికారణమువనే మరియొకరిని అట్టినాయకత్వమునకు నియమించవలసిన అవసర మేర్పడినది. (౩) స్థిరమైన మంత్రివర్గము లేనియెడల పరిపాలన సౌష్ఠవము తగ్గును. తగ్గుటయేకాక అధికారము ప్రజాప్రతినిధులగు మంత్రుల చేతులలో నుండక, సివిల్ సర్వీసువారి చేతులలోకి పోవును. పదేపదే మంత్రివర్గము మారినయెడల అనుభవము లేనివారు మంత్రులగుట సంభవించును. వ్యవహారములలోని మంచిచెడ్డలను గుర్తించి, క్లిష్టసమస్యలను పరిష్కరించుటకు వారికి సామర్థ్య ముండదు. ఉద్యోగులు ఏ సలహాల నిచ్చెదరో ఆ సలహాల ననుసరించి వారు వ్యవహారములు నడుపువారగుదురు. ఇట్టి ప్రభుత్వ విధానమునకే బ్యూరాక్రశీ (*Bureaucracy*) అని పేరు. ఇది ఉద్యోగుల ప్రభుత్వమగును కాని ప్రజాప్రభుత్వము కాజాలదు. (౪) ఏ పేట కాంగ్రెసుపక్షనాయకుని ఎన్నుకొనవలె నను సూత్రమునకు అపార్థము కల్పించినట్లు తోచుచున్నది. ఏ పేట పక్షనాయకుని ఎన్నుకొనవలెనని కాంగ్రెసుపార్టీవారి రూల్సులో ఉన్నది కాని, ఏ పేట ప్రధానిని ఎన్నుకొనవలెననిలేదు. నాయకుడే ప్రధానిగ ఉండవలెననికూడ లేదు. ఈ రెండుపదవులకు ముడిపెట్టుట అనుచితము. ఆ ముడిని విప్పి, మంత్రివర్గమునకు స్థిరత్వము కల్పించుట అత్యావశ్యకము. లేనియెడల శాసనసభ్యుల కాలమంతయు మంత్రులను మార్చుటయందే వినియోగమగుచుండును.



# ఐక్య ప్రపంచ సాధనకు ఆసియా ముందడుగు



## అభినవ ఆసియా నిర్మాణానికి నెహ్రూగారి నాంది

ప్రపంచ చరిత్రలో ఎన్నడును కని విని యెరుగని రీతిని అఖిల ఆసియా మహా సభ గత నెల 23-వ తేదీనాడు ఢిల్లీలో 'పురాణఖిల్లా' అనే చారిత్రక భవనములందు అఖండ వైభవముగా జరిగినది. శ్రీమతి సరోజినీదేవి సభాధ్యక్షురాలు. ప్రారంభకులు జవహర్‌లాల్ నెహ్రూగారు. శాంతి అభ్యుదయములను ప్రోత్సహించి, అభినవ ఆసియాను నిర్మించి, విశ్వసౌహార్ద సహకారాలతో ఏక ప్రపంచమును సాధించుటకు యత్నించుట ఈ సభోద్దేశ్యము. ఎర్రసముద్రమునుండి శాంతమహాసముద్రము వరకు గల విశాల భూభాగములోని ముప్పది దేశాలనుండి రెండు వందలకు పైబడి వచ్చిన ప్రతినిధులతోను, పదివేలకు పైబడిన ప్రేక్షకజనముతోను సభ దివ్యదర్శన మిచ్చినదన్న అతిశయోక్తికాదు. అలనాడు ఉజ్జయినిలోని విక్రమాదిత్యుని రాజ సభలకు గాని, పాటలీ పుత్రములోని అశోక చంద్రగుప్తుల దర్బారులకుగాని, ఢిల్లీలోని అక్బరు షాజహానుల కొలువుకూటములకుగాని ఇంత మంది ఆసియా ప్రతినిధులు ఎన్నడయినను వచ్చియుండిరా అన్నది అనుమానించదగిన విషయము. ప్రాచీన ఆసియా విజ్ఞానమంతయు ఆనాటి సభలో వేవెలుగులతో వెలిగినది. వింత వింతదుస్తులు - రకారకాల వ్యక్తులు-పలు తెగల భాషలు ఆ మహాసభ—చూపరకు కనులపండువును, వీనులవిందును కల్పించి, అభినవ ఆసియా కన్నులయెదుట సాక్షాత్కరించినట్లే తోపింపజేసినది. ప్రపంచ వ్యవహారముల భారతీయ సంఘ యాజమాన్యమున ఈ సభ ఏర్పాటుచేయబడినది. ఆసియాఖండ చరిత్రలో ఇట్టి సమావేశము జరుగుటకు ఇదే మొట్టమొదలు. ఈ సభాకార్యకలాపములను పరికించిన వారికి-విశ్వసౌహార్ద సహకారములద్వారా ప్రపంచ సమ్మేళనకై వెనుక నొకప్పుడు రవీంద్ర కవీంద్రుడు గాంచిన కల వృథాపోలేదనియు, అటువంటి దివ్యవైభోగమునకు ఈ మహాసభ అంకురార్పణచేసినదనియు గట్టిగా అనిపించినది. సభాలక్ష్యములను విశదీకరించుచు పండిత నెహ్రూగారు గావించిన ప్రసంగ మిదిగో చిత్తగింపుడు :

మన మిప్పుడు ఒక శకాంతంలో, ఒక క్రొత్త చరిత్ర యుగం గుమ్మంమీద కాలుపెట్టుకొని ఉన్నాము. మానవచరిత్రలో ఇలాంటి సంధియుగాన ఉన్న మనం అటు గడచిపోయిన సుదీర్ఘభూతకాలాన్ని, ఇటు ఇప్పుడు మన కండ్లయెదుట రూపొందుతూ ఉన్న భవిష్యత్తునుగూడ చూచె శక్తులమై ఉన్నాము. ఏండ్లతరబడిగా ఆలనా పాలనా లేక మాటుమణగి వుండిన ఆసియా ఉన్నదున్నట్టు ప్రపంచవ్యవహారాలలో తిరిగి ప్రప్రముఖస్థానానికి వచ్చి కూర్చొన్నది. వేలారుసంవత్సరాల చరిత్రను గనుక తిరగవేసి చూస్తే, సాంస్కృతిక సాహచర్యంలో ఈజిప్టుతో సంబంధ బాంధవ్యాలు నెరపుకొనివున్న ఈ ఆసియాఖండం మానవజాతి పరిణామ విప్లవంలో ఒక మహోన్నతమైన భూమికధరించిన సంగతి తేటపడగలదు. నాగరకత తొలి చిగుళ్లు తొడిగిందీ, మానవుడు తన అనంతమైన జీవితయాత్రకు నాంది పాడిందీ ఈ ఆసియాలోనే. మానవుని మనస్సు ఎడతెరిపిలేకుండా సత్యాన్వేషణ చేసిందీ. ఇక్కడనే ఈ విశాలవిశ్వాన్నంతనూ దివ్య తేజంతో ముంచెత్తిన మానవుని ఆత్మజ్యోతి ఇదం ప్రథమంగా వెల్లుబికింది ఈపవిత్రభూమిలోనే.

ఒకప్పుడు దిక్కుదిక్కులకూ విజ్ఞానవాహినులను విస్తరిల్లజేసిన ఈ ప్రచండ ఆసియా క్రమక్రమంగా నిష్క్రియ నిర్వికార అచేతస్థితికి వచ్చింది. ఇతర దేశాల ప్రజలూ, ఇతరఖండాలూ ముందుకువచ్చి, తమ క్రొత్త బలవేగాలతో ఇంతవి అంతవిగా విజృంభించి, ప్రపంచంలోని ప్రకృష్టభాగాలను ఇట్టిట్టే ఆక్రమించుకొన్నవి. బలోన్నతమై వెలసిన ఈఖండము ఉన్నట్టుండి యూరోపులోని ప్రతిస్పర్థి సామ్రాజ్యాలకు విహారక్షేత్రముగా పరిణమించినది; ఆ యూరోపు మానవవ్యవహారాలలో చరిత్రకూ, ప్రగతికీ ఇట్టే ఒక ప్రబల కేంద్రమై పోయింది.

కాని, దేవునిదయవల్ల, తిరిగి ఏదోమార్పు గోచరమవుతున్నది. ఆసియా తిరిగి తన వెనుకటి స్థానాన్ని అందుకొనే ఊపులో నున్నది. నేడో రేపో తిరిగి తక్కిన ఖండాలతోపాటు తనకు తగుమైన స్థానానికి రానై యున్నది. ఇటువంటి ఈ సమయంలో మనమందరమూ ఇక్కడచేరి, వర్తమానభవిష్యత్తులను విశదంగా పరిశీలించుకొని, మన అభ్యుదయానికీ, మన యోగ క్షేమాలకూ, మన చెలిమికీ గట్టిపునాదులు వేసుకోబూనుట సర్వథా సంభావ్యమై యున్నది.

ఆసియా ఎంతెంతో ఋణపడిఉన్న, ఎన్నెన్నో ఆకాంక్షలను తీర్చ వలసియున్న చీనామహాదేశము నుండీ, భారతదేశముమీద అఖండమైన ప్రభావం చూపిన మహత్తమ సంస్కృతిగల ఈజిప్టు అరబ్ దేశాలనుండీ, చరిత్ర తొలిరోజులనుంచీకూడా భారతదేశంతో సంబంధంకల ఇరానునుండీ, భారత సంస్కృతితో పెనవేసుకొని పోయిన చరిత్రగలట్టిన్ని, ఇప్పటికిప్పుడు గూడా ఎన్నడూ ఎరగని స్వాతంత్ర్యసమరం అమోఘంగా కొనసాగించి స్వాతంత్ర్యమునేడ గెలిచి సాధించుకోవలసిందే కాని దయాధర్మంగా ఒకరిమూలాన కానుకగా వచ్చిపడేదికాదని మనకుజ్ఞాపకపరచినట్టి ఇండోనేషియా ఇండోచైనాలనుండీ, ఒకానొక మహానాయకుని ప్రతిభాబలంచేత ఆరిపోని ఊపిరులుపోసుకున్న టర్కీనుండీ, మన తరమంటే మనతరంలోనే ఎంతో పురోభివృద్ధిగాంచి మన కెన్నో పాఠాలు నేర్పజాలియున్న ఆసియా సోవియట్ రిపబ్లిక్కులనుండీ, ఇరుగుపొరుగుననే ఉండి సహకార సౌజన్యాల కోసమై మే మెంతో ఆశలు పెట్టుకొనియుండు ఆఫ్ఘనిస్థాన్, టిబెట్టు, నేపాల్, భూటాన్, బర్మా, సిలోనులనుండీ, ఇంకా అనేక దేశాలనుండీ దూరాభారమనక దయచేసిన మీ అందరికీ సుస్వాగతం. ఏదైనా ఒకటి రెండు దేశాలు ఇందులో పాల్గొనక పోయివున్నప్పటికీ, దానికి కారణంఏవో అనివార్యమైన ఆటంకాలే అయివుంటుందికాని, రాగూడదనీ కాదు; అభిమానం లేకనూకాదు.

ఇంతమందిమి ఇక్కడ సమావేశమయ్యేటప్పటికి ఆసియాయొక్క తొలినాటి స్వరూపమంతా మన ముందర సాక్షాత్కరిస్తున్నది. ఇటీవలి కష్టనిష్ఠురాలు మరుగునపడి పోతున్నవి. ఎన్నెన్నో జ్ఞాపకాలు స్ఫురణకు వస్తున్నవి. అయితే నేనిప్పుడు ఆ పాతకాలాల వైభోగాలనుగాని, ఆనాటి మన గెలుపోటములనుగాని ప్రస్తావించ దలచుకోలేదు అలాగే, మనలను అధోగతికి అణగారినట్లు చేసిన, చేస్తూవున్న ఇటీవలి గాథలను గూడ తడవదలచుకోలేదు. గడచిన రెండుశతాబ్దాలలోనూ మనం ప్రాచ్యసామ్రాజ్యాల ప్రగతిని, ఆసియాలోని పెద్ద పెద్ద భాగాలు వలసదేశాలస్థితికి దిగనారిపోవడము న్ను చూచాము. ఈరోజుల్లో ఎన్నెన్నో విషయాలు జరిగినవి. ఆసియాపై యూరపు పెత్తందారీ మూలంగా ఆసియాలోని ఒకదేశానికొక దేశం విడిపోయి, దూరమైపోయి ఏకాకిత్వం వహించడం వాటిలోకల్లా ముఖ్యమైంది. భారతదేశం సదాసర్వకాలములందున్ను వాయవ్య, ఈశాన్య, ప్రాచ్య, ఆగ్నేయాలలోని తన

పొరుగు దేశాలతో సంబంధబాంధవ్యాలు నెరపు కుం టూనే వచ్చింది. కాని, దేశంలో బ్రిటిషుపాలన ఎప్పు డైతే ప్రారంభమయిందో నాటితో ఈబంధాలు తునా తునకలు చేయబడి, దేశం తక్కిన ఆసియా ప్రపంచం నుండి పూర్తిగా విడివడి పోయింది. ప్రాచీనమైన భూ మార్గాలు బందైపోయినవి. బైటి ప్రపంచాన్ని మనకు చూపే కిటికీలు ఒక్క ఇంగ్లండువెళ్ళే ఒక సముద్ర మార్గాన్నే చూపించినవి. ఇలాటి సంగతే ఆసియాలోని తక్కిన దేశాల విషయంలో కూడా జరిగింది. వాటి ఆర్థిక ప్రతిపత్తి ఏదో ఒక యూరోపియను సామ్రా జ్యంతోనో, మరొకదానితోనో కట్టుబడి పోయింది. వైజ్ఞానికంగాకూడా అవి యూరోపునైపే చూపులు మళ్లించవలసి వచ్చింది కాని తమ ఇరుగు పొరుగు మిత్రులవైపు కాదు.

రాజకీయంగానూ, ఇతరథా కూడా ఎన్నో కారణాలవల్ల ఇప్పుడీ నిర్లిప్తతా, ఈ ఒంటరి తనమూ అంతరించిపోతూవుంది. పాతసామ్రాజ్యాలు అదృశ్యమై పోతూ ఉన్నాయి. భూమార్గాలు మళ్ళీ తెరువబడి నాయి. విమానాలు ఉన్నదున్నట్టు మనలను ఒకరి కొక రిని అతిసన్నిహితానికి తెస్తున్నవి. ఇక, ఇలానే, యూరోపు పెత్తందారీతనంపోయిందా అంటే మన చుట్టూ ఉవ్వెత్తుగా పెరిగియున్న అగోడలు కుమ్మ కూలిపోయి, మనము ఒకరినొకరం ఆప్యాయంగా చూచుకోగలం; చిరకాలం కిందట విడిపోయిన మిత్రుల లాగా ఒకరినొకరం మళ్ళీ కలుసుకోగలం.

ఈ మహాసభయందుగాని, ఈ కార్యకలాపాల్లో గాని నాయకులూ లేరు, అనుచరులూ లేరు. ఏకలక్ష్య సాధనకు అన్ని దేశములూ సమానస్థాయిలో కలిసి పని చేయవలసి ఉన్నది. ఆసియా అభ్యుదయానికి సంబం ధించిన ఈ క్రొత్త దశలో భారత దేశం తన పాత్రను తాను నిర్వహించుట ఉచితమైయున్నది. భారత దేశం సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందనుండటమేకాక నే డాసియాలో పనిచేస్తూఉన్న అనేక శక్తులకు ఇది సహజకేంద్రంగానూ, లగ్నబిందువుగానూ ఉంటున్నది. భౌగోళికంగా కూడా ఈ దేశానికి గల స్థానమటు వంటిది.

ప్రాచ్య, పాశ్చాత్యదేశాలనుండి ఎంతెంతో విజ్ఞానం వాహినులువాహినులుగావచ్చి, మమైకంగా ఇక్కడి విజ్ఞానంతో కలిసిపోయి, నేటి భారతీయ సంపన్నవిజ్ఞానానికి దోహదం కల్పించింది. ఇలాగే ఇక్కడినుంచీకూడా ఎంతెంతో విజ్ఞానం ఎన్నెన్నో దూర దేశాలకు ప్రాకింది. ఆఫ్ఘనిస్తాన్ వెళ్ళండి, పశ్చిమ ఆసియా వెళ్ళండి, జపాను వెళ్ళండి, చీనా వెళ్లండి— ఎక్కడికైనా వెళ్లండి, మీకు భారతీయ విజ్ఞానవైభవం యొక్క నిదర్శనాలు ప్రత్యక్షమవుతాయి. ఈ విజ్ఞాన సమన్వయంవల్ల మనమంతా ఎంతో సన్నిహితానికి వచ్చినాము. భారతీయునిమట్టుకు భారతీయుడు ఆసియాలో ఏ దేశం వెళ్లినాసరే ఆ దేశానికీ, ఆ ప్రజ లకూ తాను ఎంతో సన్నిహితుడుగా, ఆత్మీయుడుగా భావించుకోగలుగుతున్నాడంటే ఈ విజ్ఞానసమన్వ యమే దానికి కారణం.

ఇదంతా పాతగాథ. దాన్ని తవ్వుతూ కూర్చోవడానికికాదు మనమిక్కడ సమావేశమైంది. భవిష్యత్కర్తవ్యాన్ని మనం సమాలోచించుకొందాం. ఎత్తులతోఎవరిమీదా కక్షతో ఏర్పాటయిందికాదు ఈ సభ. మాకు ఎవరిమీదా, ఏ దేశంపైనా కక్షలూ లేవు, ఆపేక్షలూ లేవు. ప్రపంచమంతటా శాంతి అభ్యుదయా లకు దోహదంచేయడమే మా మహదాశయం. ఎన్నో ఏండ్లు మేము పడమటిసీమ కోర్టుకచ్చేరీలలో అర్జీ దారులుగా నిలిచాము. ఆ కథ నేటితో తాతలనాటి కథ అయిపోవాలి. ఇకపైన మా కాళ్ళపైన మేము నిలువదలచినాము. మాతో సహకరించడానికి సిద్ధంగా నున్నవారితో మేము సహకరించితీరుతాము. ఇతరుల చేతి ఆటవస్తువులుగా ఉండడం మాత్రము మేము ఇక నసేమిరా ఒల్లము.

ప్రపంచ చరిత్రలోని ఈ అతిక్లిష్టవిషమదశలో ఆసియా మిక్కిలి ప్రధానమైన భూమికను నిర్వహించ నున్నది. ఇంకమీదట ఇతరులు ఈ ఆసియాదేశాలను ఆటవస్తువులుగా వినియోగించుకోగలరనేమాట కల్ల. ప్రపంచవ్యవహారాలలో ఆసియాదేశాలు విధిగాస్వతంత్ర మైన విధానాలనేఅనుసరించితీరవలసిఉన్నది మానవాభ్యు దయానికి యూరపు అమెరికాలు అపారమైన సేవ చేసినవి. అందుకు మనం ఆ దేశాలకు కృతజ్ఞత చెల్లిం పకతప్పదు. వారినుండి మనం నేర్చుకోవలసిన విష యాలుకూడా చాలా ఉన్నాయి. అట్టి విషయాలు తప్పకుండా గ్రహిద్దాము. కాని, పడమటిసీమ మన లను అనేక సంఘర్షణలలోకీ, అనేక సంగ్రామాలలోకీ ఈడ్చిన సంగతికూడా మనం మరవలేం. నిన్నగాక మొన్ననేకదా చండప్రచండమైన యుద్ధం జరిగి ముగి

# అఖిల ఆసియా మహాసభ చిత్రాలు



ప్రారంభోపన్యాసం చేస్తున్న నెహ్రూ పండితుడు.



నేపాలు దేశంనుండి వచ్చిన ప్రతినిధులు.



సభకు హాజరైన కొంతమంది పెద్దలు
జనరల్ ఆచిన్లేక్ దంపతులు, రాజాజీ, పటేలు ప్రభృతులు.



ఇరానునుండి వచ్చిన కొంతమంది ప్రతినిధులు

సింది. ఇంతలోనే మళ్లీ ఈ పరమాణుయుగంలో ఇంకా యుద్ధప్రసక్తి తరుచు వినవస్తూనే ఉన్నది. ఈ పరమాణుయుగంలో శాంతి రక్షణార్థమై ఆసియా మిక్కిలి గట్టిగా పాటుపడవలసిఉంటుంది. ఆసియా తన పాత్ర తాను నిర్వహించనిదే శాంతి యేర్పడనేరదనేది నిజం. ఇప్పుడు అనేక దేశాల్లో ఘర్షణ యేర్పడియున్నది. ఆసియాలోని మనకు కూడా—మన కష్టాలు మనకెన్నో ఉన్నాయి. అయినా కూడా ఆసియా తత్వమూ, దృక్పథమూ శాంతిబద్ధమైనది. ఆసియా గనక ప్రపంచ వ్యవహారాల్లో తన స్థానాన్ని తాను సంపాదించుకోగలిగితే ప్రపంచ శాంతి స్థాపనకూ, రక్షణకూ అది ఎంతో బలమైన సహాయకారిగా ఉండగలదు.

అన్ని దేశాలూ స్వతంత్రంగా ఉంటేనే, అంతటా ప్రజలందరికీ స్వాతంత్ర్యమూ, భద్రతా, అవకాశాలూ ఉంటేనే శాంతి సాధ్యం కాగలదు. కాబట్టి ఈ శాంతి స్వాతంత్ర్యాలను వాటి రాజకీయ ఆర్థికాంశాలనుబట్టి సమాలోచించుకోవలసి ఉంటుంది. ఆసియా దేశాలు ఎంతో వెనుకబడిఉన్నాయి. ప్రజల జీవితప్రమాణం చాలా తక్కువగా ఉన్నది. ఈ ఆర్థికసమస్యలు అతి జరూరుగా పరిష్కారం కావాలెను. లేకుంటే సర్వనాశమూ, ప్రళయబీభత్సమూ తప్పవు. కాబట్టి మనం సామాన్యమానవుని శ్రేయస్సుకోరి, అతన్ని ఇంతవరకూ నలిపివేసిన బరువులన్నీ తొలగి, సంపూర్ణాభివృద్ధికి అతనికి అవకాశమిచ్చేటట్లు అతనికి ఆర్థిక, రాజకీయ, సాంఘిక స్వాతంత్ర్యం లభించునట్లుగా మన ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవస్థలను మనమిప్పుడు భద్రంగా నిర్మించుకోవలసివున్నది.

'ఏకప్రపంచ' లక్ష్యము, ఒకవిధమైన ప్రపంచ సమాఖ్య అవసరమైన స్థితికి మనమిప్పుడు వచ్చియున్నాము. ఆ లక్ష్యసాధనకూ, అట్టి ప్రపంచ సమాఖ్యస్థాపనకూ కొన్ని అవరోధాలు లేకపోలేదు. అయినప్పటికీ అట్టి లక్ష్యసిద్ధికే మనం సర్వధా పాటుపడవలసివున్నది. చిన్నచిన్న వర్గాల యేర్పాటు చేసుకొనటకు మన మెన్నటికిని ప్రయత్నించరాదు. కనుకనే మేము ఐక్యరాజ్యసమితిని బలపరుస్తున్నాము. కాని, ఈ ఏకప్రపంచ లక్ష్యసాధనార్థం, ఆసియాలోని వివిధదేశాలూ ఒకదానితో ఒకటి ఆ విశాలాదర్శానికై సహకరించేటట్లు కూడా మనం చూడవలసిఉన్నది. అటువంటి సహకారసంపాదనకే ఈ మహాసభ ఉద్దేశింపబడింది.

సంకుచిత జాతీయతత్వాన్ని మేము ఎంత మాత్రమూ ఆకాంక్షించము. ప్రతీదేశంలోనూ జాతీయతకు స్థానమున్నది. ఆ జాతీయతను పాదుకొలపవలసిందే; పోషింపవలసిందే. కాని అంతర్జాతీయాభివృద్ధికి ఆటంకాలు కల్పించే వీరజాతీయతగా మాత్రము దాన్ని పరిణమింపనివ్వరాదు.

ఒక్క యూరోపు అమెరికాలకే కాక ఆఫ్రికాలో నానాకష్టాలూ పడుతున్న మన సోదరులకు కూడా ఆసియా తన స్నేహహస్తాన్ని చాస్తున్నది. ఆసియా వాసులమైన మనపైన ఆఫ్రికావాసుల విషయమై ప్రత్యేక బాధ్యత ఉన్నది. మానవకుటుంబంలో వారికీ ధర్మబద్ధమైన స్థానం లభించేటట్లు మనం మన శాయశక్తులా తోడ్పడవలసియున్నది. మనం సాధింప తలపెట్టుతున్న స్వాతంత్ర్యము నేడు ఇదీ అదీ అని ఒక్క జాతికిగాని, ఒక తెగ ప్రజకుగానీ కాక అఖిల మానవ జాతికిన్ని అనువర్తించేఉండాలి.

ఆసియా అంతా ఇప్పుడు విషమపరీక్షలకు పాత్రమైయున్నది. భారతదేశంలో కూడా ఎన్నో చిక్కులూ, ఘర్షణలూ ఉంటున్నాయి. ఇంతమాత్రం చేత మనం గుండెనిబ్బరం కోల్పోరాదు. సంధ్యాయుగానికి ఇటువంటివి తప్పవు. ప్రస్తుతం ఆసియా ప్రజల్లో నవంనవమైన జవజీవాలు కన్పిస్తున్నవి. ప్రజా సామాన్యం బాగా మేల్కొన్నది. మా ఆనువంశిక హక్కులు మాకు రావాలని దీక్షగా కోరుతున్నది. ఆసియా అంతటా పెనుగాడ్పులు వీస్తున్నవి. వాటికి మనం జడిసిపోరాదు. పై పెచ్చు వాటికి మనం స్వాగతమివ్వాలి. ఏమంటే, వాటిసాయంతోనే మనం కలకాలంగా కలలుకంటున్న అభినవ ఆసియాను నిర్మింపగలుగుతాము. ఈ మహత్తర అభినవ శక్తులపట్లా, ఇప్పుడిప్పుడే రూపొందుతూవున్న కలలపట్లా మనం గాఢమైన నమ్మకం పెట్టుకొని యుందముగాక.



# విమర్శనము



## వ్యాస సంపుటి

రచయిత : శ్రీ 'పుట్టపర్తి'. వెల ౧౮ అణాలు.

ఇది భవభూతి: నాటకకర్త; ప్రాకృతకవిత' గద్యపద్యములు: వాని భిన్నత; శ్రీనాథుడు: అతని మనస్తత్వం; తిక్కన: సుధేష్ణ—అనే అయిదు వ్యాసాల సంపుటి. రచయితకు సంస్కృతప్రాకృత భాషలందూ, ఆంధ్రమందూ సమానమైన పరిచయం కలదని యీగ్రంథంనుండి ఇట్టే గ్రహించవచ్చు. గ్రంథకర్త 'ఆయాగ్రంథములను ఎట్టిదృష్టితో చదివి'నాతో అనే విషయాన్ని మాత్రమే మనకి తెలియజేయటానికియీ గ్రంథం వ్రాయబడ్డది. ఇతని దృష్టిలో భవభూతి కవి కాని నాటకకర్త కాడు; ప్రాకృతకవిత కున్నంత సరళతీ, మంజులత్వమూ సంస్కృతానికి లేదు; అట్టి ప్రాకృతాన్ని సాహిత్యలోకం విస్మరించటం ప్రాకృత పక్షపాతి అనిపించుకుంటున్న యీకవికి బాధాకరంగా వున్నది; గద్యానికీ పద్యానికీ వున్న తేడాను విమర్శించే పట్లల్లో అందరూ అన్నమాటే యీతడూ అంటున్నాడేకాని, కొత్తవిషయా లేమీ కనబడవు. ఇక శ్రీనాథుని మనస్తత్వాన్నీ, మంచి కవిత్వాన్నీ ఏనాడో యెందరో విమర్శించారు; యిందులోనూ అలాంటివే కొన్ని విషయాలు వివరించబడ్డాయి; పాత్రపోషణలోని తిక్కన సునిశితత్వం ఒక్క ప్రధాన పాత్రలోనే కాకుండా అతడు సృష్టించిన ప్రతి చిన్న పాత్రలోనూ ద్యోతకమవుతుందన్న విషయాన్ని సుధేష్ణను మచ్చుకు తీసుకుని, చక్కగా చెప్పినాడు రచయిత.

'వచనరచనాకారుని కావేశ ముండరాదు. ఉండినచో నాతని రచన రక్తికట్టదు' అని తెలిసీ, యీ రచయిత ఆ దోషంలోనే పడుతున్నాడు. ప్రయత్నించి, అసంగతాలైన తన అభిమానవిషయాలు ప్రతీ వ్యాసంలోనూ గుప్పుతున్నాడు. రచయిత రసికుడనీ, కవిహృదయాన్ని అర్థంచేసుకుని ఆనందించగల శక్తివంతుడనీ మాత్రము యీ రచనల్లో స్ఫుటంగా కనబడుతోంది. సాహిత్యప్రపంచంతో అంతగా …క్యం లేని విద్యార్థులు కావ్యపఠనానికి అభిరుచిని తెచ్చుకోవటానికి గ్రంథం చదవవచ్చు.

## అగ్నివీణ

ఖండకావ్య సంపుటి: శ్రీ పుట్టపర్తి దంపతులది. వెల ౮ అణాలు.

"అగ్నివీణలోని ఖండికలు, నా ౧౬,౧౮ వయస్సుల మధ్యరచించినవి"—ఇది కవి 'వినతి'. అందుకనే కవి కావాలన్న ప్రయత్నం కావ్యంలో అతి విస్తరంగా కనబడుతోంది. నేటి కవిదృష్టికి సరిపోనివి ఎన్నో ఇందులో చేర్చబడివుండటంచేత కృతికి పరిపక్వత కవే యిచ్చుకోలేదు. లెక్కకు చాలా ఖండికలున్నా, వాటిలోని భావమంతా ఒక్కటే ననిపిస్తోంది. కవికి కొన్నిపదాలు ప్రయోగించటంలో వున్న పక్షపాతం రచనల్లో అక్కడక్కడా కనిపిస్తుంది. రసావేశం సహజమనిపించదు. కృష్ణపక్షాన్ని అనుకరించే శైలికీ, భావోద్రేకానికీ కవి ప్రయత్నించినట్టు తోస్తుంది.

కవిధర్మపత్ని శ్రీమతి కనకమ్మగారి ఖండికలు ఆమె వలదన్నా, ప్రకటనార్హాలే; అవి సహజంగా, కొన్నిపట్టుల్లో మనోరంజకంగాకూడా వున్నై.

పైరెంటికీ ప్రాప్తిస్థానము పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, ప్రొద్దుటూరు, కడపజిల్లా.

'సుం'

# గ్రంథ స్వీకారము

ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణము

గ్రంథకర్త: చలమచర్ల రంగాచార్యులుగారు. ప్రకాశకులు: విజ్ఞానవర్ధనీపరిషత్తు, హైదరాబాదు. వెల ౫ రూ.

మించుపల్లె - తెలుగుపూలుపు

పద్యకృతి. రచయిత: నిడుదవోలు వెంకటరావుగారు, యం.ఏ., ఆంధ్రోపన్యాసకులు, మద్రాసు విశ్వవిద్యాలయము. వెల ౧ రూ.

నా జీవితము

గాంధీగారి ఆత్మకథకు మహదేవ దేశాయి కృప్తీకరణము. అనువాదకులు: పోలవరపు శ్రీరాములుగారు. ప్రకాశకులు: సంస్కృతిగ్రంథమండలి, పెరంబూరు, మద్రాసు. వెల రూ. ౧-౮-౦.

సతీ అనసూయ

ఆరంకముల నాటకము. రచయిత: కొర్నెపాటి శేషగిరిరావుగారు. ప్రకాశకులు: వెంకటరామా అండు కో., బెజవాడ. వెల రూ. ౧-౮-౦.

భారతదేశము: ఆర్థికవ్యవహారాలు

గ్రంథకర్త: కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు గారు. ప్రకాశకులు: కళాపీఠము, బెజవాడ. వెల రూ. ౧-౮-౦.

౧. అరవిందోపన్యాసము

౨. అరవిందలేఖలు

ప్రకాశకులు: చతుర్వేదుల వెంకటకృష్ణయ్యగారు, అరవిందాశ్రమము, పుదుచ్చేరి. వెల ఒక్కొక్కటి ఆరేసి అణాలు.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras, Editor—S. Sambhu Prasad.

దర్శకుడు: టి. హనుమంతరావు

కవి. వి. సత్యనారాయణరావు

## అపూర్వమైన సాంఘిక సంఘటన

తెలుగునాడు ఇదివరలో చూడనిది

అతిత్వరలో



విడుదల

శ్రీ శ్యామలా ఫిలిమ్స్‌వారి

# 'గీతాంజలి' లో

శ్రీరంజని, గౌరీనాథశాస్త్రి, పూర్ణిమ

---

స్టూడియో:- చిత్రకళ.

కెమేరా :-ప్రభాకర్, సౌండ్ :-ఏబుల్‌జీవా, ఆర్ట్:-గోడ్‌గాంకర్